ప్రథమముద్రణము

డిసెంబరు - ౧౯౫౬

౧౦౦౦ ప్రతులు.

## పుష్పాంజలి

అన్నాతమ్ములు నక్క చెల్లెలును, భా  
ర్యా పుత్రులున్ తల్లియున్  
ఉన్నారెందరొ యింక బందుగులు, వా  
రుండేమి లేకేమి నా  
కెన్నండేనియు నాకు కష్టమున, వా  
రింతైన దోడ్పాటు చే  
యన్నారే యొక నీవె యన్నిటికి  
కృష్ణా! గోపికావల్లభా.

—గోపికావల్లభ శతకము.

వేంకట్రామ్ పవర్ ప్రెస్,  
ఏలూరు :: పవరుపేట

# మనవి

కళోపాసకుడైన 'శ్యాం' నన్ను చిరుతప్రాయంలోనే కళాదీక్ష కొంత కొన్నగా నర్పించాడు. అన్నయొక్క ప్రోత్సాహంవల్లనే నా స్వల్ప ప్రాయంలో కళార్థినై భారతదేశమున నేగాక తూర్పుదీవులలో గూడా సంచారము చేయుటవలన అనేకవిషయములు గ్రహించాను. ఆ యా ప్రదేశములలో నేను జూచిన ప్రజలజీవనము, వారి సాంఘికపరిస్థితులు, లలితకళలు మొదలైన విషయములను గూర్చి ఈగ్రంథములో వ్రాశాను. వేదయుగమునుండి నేటివరకూ - మన సంస్కృతి, మతము, లలితకళలు - మొదలగు విషయములను గూర్చిగూడ కొంత వరకు చర్చించాను.

లలితకళలకు నిలయమైనది మన భరతభూమి. ప్రాచీనభారతము తన కళా వైశిష్ట్యముచేత విశ్వమునే విస్మయ మొందజేసింది. కాని పరులపాలనయందు జిక్కి భారతీయులు తమ సంస్కృతినే, తమ కళావిశిష్టతనే, తమ విజ్ఞాన మహత్వ మునే విస్మరించేరు. అందుచేతనే మున్నూరేండ్ల చిరదాస్యశృంఖలల ఛిద్ర మొన రించుకున్ననూ, భావదాస్యమును మాత్రము తొలగించుకోలేకపోయారు భారతీ యులు. ప్రాచీనకాలమునుండి వచ్చుచున్న మన సనాతన ఆచారవ్యవహారములు, వానియందు గుప్తమైన నిగూఢభావములు తెలిసికొనుటకుబదులు వానిని త్రోసి వేయటమో, లేక గ్రుడ్డిగా అనుకరించుటమో చేస్తున్నాము.

మన సంస్కృతి, మన కళావిశేషములనుగూర్చి తెలిసికొనవలసిన అవసరము నాటికంటే నేడు యెక్కువైనది. కాని భారతప్రజానీకాన్ని పట్టపగటి నిదురనుండి లేపి - తాము నిరాదరదృష్టితో చూచుచున్న మన కళావిశేషమునుగూర్చి తగినంత ప్రచారము చేయుటగాదు నేడు పేరొందిన మనకళారాధకులు చేయుచున్న దేశసేవ. అమెరికా, ఇంగ్లాండు, రష్యా మొదలగు దేశములకువెళ్ళినృత్యప్రదర్శనము లిచ్చుట - వారిచే మన్ననలందుట - మనలో నెందరికో కళనుగూర్చి లేశమైనను తెలియకపోవుట వింతగాదు: కానీ మన గొప్పతనమును విదేశములలో చాటుట వింత - ఈనాటికీ కలవారికే అందుబాటులోనున్న లలితకళలను ప్రజాబాహ్యమునకు సన్నిహితము చేయుటయే నిజమైన కళారాధన. ఈ సత్కార్యమునకు ఏ ప్రఖ్యాత కళావేత్త పూనుకొనక పోవుట విచారకరము. ఇట్టి సందర్భములో నా ఈ కృషి ఏ మాత్రము సేవచేయగలిగినను నా ఆశయము సిద్ధించినట్లే. ఈ విధంగా కళాదేవికి నా అంజలుల నర్పించుకొంటున్నాను. ఇందు వివిధ భారతీయ నృత్యరీతులనుగూర్చి నాకు తెలిసినంతవరకూ నేనర్థముచేసుకున్నరీతి ననుసరించి రేఖామాత్రముగా ప్రతి నృత్య సాంప్రదాయమునుగూర్చి వ్రాసితిని. ఇంకను ఈ కళనుగూర్చి విశదముగా తెలిసికొన గోరువారు నారచనలు - నృత్యరేఖ, నాట్యసుందరి, దాక్షిణాత్యుల నాట్యకళాచరిత్ర, నృత్యమంజరులను చదువప్రార్థన.

తెలుగుభాషలో యిటువంటిపుస్తకము వ్రాయుటకు యిదే మొదటిసారి కావచ్చు. ఇది నా తొలికృతి. కళాహృదయులగు తెలుగుసోదరులు నా కృషికి తగిన చేయూత నిచ్చి నన్ను ప్రోత్సహించెదరని ఆశించుచున్నాను.

---

# ఒక్క మాట

మీ రీ పుస్తకములో నృత్యకళను గూర్చి చదువబోతారు. ఈ పుస్తకాన్ని మూడు భాగములుగా విభజించాను. మొదటి భాగంలో వేదయుగం మొదలుకొని ఈ నాటివరకు మనసంస్కృతి నృత్యకళను గూర్చి తెలుపబడింది. ఇది 'శాస్త్రీయ నృత్యకళ' అన్నాను. రెండవ భాగములో అరణ్యములలో నివసించే గోండులు, బైగాలు, సంతాలులు మొదలైన ఆటవికుల జీవితవిధానం, వారి నృత్యకళలను గూర్చి వ్రాశాను. దీనికి 'ఆటవికుల కళ' అని పేరుపెట్టాను. మూడవ భాగంలో జావా, బలీ, కంబోడియా మొదలైన తూర్పుదీవులలో మన భారతీయసాంప్రదాయము ననుసరించి చేయబడే ఆ దేశనృత్యకళను గూర్చి చర్చించాను. ఈ భాగం 'తూర్పుదీవులలోని నృత్యకళ' అని పిలువబడింది.

ఇక చదవండి............

# తొలిపలుకు

భారతీయ నృత్యకళనుగురించి తెలుగుభాషలో నేనెరిగి నంతవర కిదే మొదటిగ్రంథ మనుకుంటాను. శ్రీ నటరాజ రామకృష్ణగారు చిరుప్రాయముననే నాట్యకళచే నాకర్షింపబడి, నాట్యశాస్త్రమును ఉత్తమోత్తమ పండితులవద్ద నభ్యసించి, భారతీయ కళాసంస్కృతులు తమ ప్రభావమును వెదజల్లిన ఇతర సమీప ప్రాచ్యదేశములందు పర్యటించి అక్కటి కళా ప్రాదుర్భావమును కనుగొని చక్కని విజ్ఞానమును సంపాదించిరి.

భారతీయ నాట్యకళాసాంప్రదాయముల ప్రాశస్త్య మితర దేశములలో కీర్తింపబడుచుండు నీకాలమున, మనదేశము నందు మాత్రము తగినంత శ్రద్ధవహింపబడకుండుట మిగుల శోచనీయము. ఈ లోపమును తొలగించుటకు గావింపబడు చుండు వివిధ ప్రయత్నములలో, నాట్యకళ విజ్ఞానమును జనసామాన్యమునకు సులభముగా నందజేయుట ప్రాధాన్యత వహించుచున్నది.

శ్రీ రామకృష్ణగారు 'నర్తనబాల' యను గ్రంథమును ఆంధ్రబాలల్కై రచించి ఇటీవలనే ప్రకటించిరి. 'నృత్యరేఖ' యను మరియొక గ్రంథమును బాలబాలికలకు సులభముగా భారతీయ నాట్యకళయొక్క ముఖ్యాంశములను బోధించుట కనువగునట్లు ప్రకటించిరి. శాస్త్రీయ విషయములను బాల బాలికల కింత యాకర్షణీయముగా బోధించు గ్రంథములు మిగుల యరుదని చెప్పవచ్చును. ఇప్పు డీ 'నృత్యాంజలిని' సకలాంధ్ర పాఠకలోకానికి అందజేసినందుకు శ్రీ రామకృష్ణ గారు అభివంద్యనీయులు.

సకల భారతీయ శాస్త్రములకును, కళలకును మూలము మన ఆర్షవిజ్ఞానమే. సర్వశాస్త్రములకేగాక, ప్రాచీన భారతీయ కళలన్నిటికిని పునాదులు వేదములే. సృష్టి, స్థితి, లయకారణ మైన పరాశక్తియే లోకోపకారార్థ మీ సర్వవిద్యల నొసగె

నని మనవిశ్వాసము. విశ్వతాండవ మొనర్చు నటరాజే మనకు ప్రథమాచార్యుడు. ఈ కళలన్నింటికిని మానవుని యాధ్యాత్మిక జీవితముతో మన సాంప్రదాయానుసారము అవినాభావసంబంధము కలదు.

ఈభూమికను గ్రహించనంతవరకు భారతీయ కళలనేకాదు, సంస్కృతియొక్క ఏ ముఖ్యాంశమునుగూడ తెలిసికొనుట కష్టము. నాట్యకళయొక్క ఈ యాధ్యాత్మిక భూమికను, అనుశ్రుతమైన గాథలను సుందరముగా సుబోధముగా వివరించిరనుట అతిశయోక్తి కాదు.

ఈ 'నృత్యాంజలి' స్వతంత్రమైన నేటిరచనగాక, ఆంధ్ర ప్రభలో అప్పుడప్పుడు ప్రకటింపబడిన వ్యాసావళియొక్క సంపుటమైనంత మాత్రమున ఈ గ్రంథముయొక్క విలువ తగ్గదని నా విశ్వాసము.

సంవత్సరార్థము కాలములో ప్రకటింపబడిన వ్యాసములను సమగ్రంగా నన్నిటిని చదివి, నాట్యకళను గురించిన విజ్ఞానమును సేకరించుకొన్నవా రరుదుగనే యుందురు. అటు లెవరైన నున్నను ఈ సమగ్రసంపుటము వారికికూడ నుపకరించునను టలో సందేహము లేదు. ఈ వ్యాసములలో కేవల శాస్త్రీయ నాట్యకళా సాంప్రదాయములను గురించియే కాక భారతీయ జానపద నృత్యములను గురించి, ఇతర ప్రాచ్య దేశములందలి ప్రచలిత నృత్యములను గురించియు అనేక వివరములు గలవు. ఆంధ్ర పాఠకలోకము శ్రీ నటరాజ రామకృష్ణగారి ఈ సేవను గుర్తించి ఇతోధిక సేవావకాశమును వారి కొసంగుగాత !

రాజ్ భవన్
త్రివేండ్రం
[illegible]

బూర్గుల రామకృష్ణరావు,
కేరళ రాష్ట్ర గవర్నరు

# భారతీయ నృత్యకళ

## ప్రాంతీయ నృత్యాలను సమన్వయించి కాలానుగుణ్యంగా, నవీన భారతీయ నృత్యకళను ప్రాదుర్భవింపజేయాలి !

ప్రస్తుతకాలంలో మనదేశంలోని ఆరువిధముల నృత్యపద్ధతులు: తమిళ దేశంలో భరతనాట్యము దాసి అట్టము, ఆంధ్రలో కూచిపూడినృత్యము భోగమాట, ఉత్తర హిందూస్థానము, రాజపుటాన, బొంబాయి, పంజాబుల్లోని కథక్ నృత్యము, బెంగాల్, అస్సాము, మణిపూర్‌లోని మణిపురనృత్యము, మలబార్‌లోని కథకళి మోహిని అట్టము, సిరైకేళాలోని 'చా' నృత్యము. ఈ ఆరు శాస్త్రీయ నృత్య పద్ధతులు గాక ప్రతి ప్రాంతంలోను అనేకరకములుగా జానపద నృత్యములు చేయుచున్నారు. ఇంకా అరణ్యాల్లో వుండే గోండులు, భిల్లులు, సంతాలులు, కోయలు, నాగులు, తోడులు, బైగాలు మొదలైన ఆటవికజాతు లింకా చిత్ర విచిత్రాలైన నృత్యాలు చేయుదురు.

పై నృత్యము లన్నియు వివిధప్రాంతాలలో జేయబడు ప్రాంతీయ నృత్య పద్ధతులేగాని మన యావద్భారతమునకూ పనికివచ్చే ఒక నృత్యపద్ధతిలేదు. నృత్య కళారాధకులు, నాట్యాచార్యులు భిన్నాభిప్రాయాలు కలిగివుండడంచేత దేశ మంతటా ఒకేపద్ధతిలో నృత్యకళ అభివృద్ధి జెందుటకు అవకాశములేదు. స్వతంత్ర జాతిగా జీవించే నేటి మనకు, భారతజాతికంతకూ ఉపయోగించే ఒక నృత్య కళను సృష్టించి ప్రచారము చేయుట ముఖ్యావసరము. ఇట్టి కళాప్రచారము కొరకే ఉదయశంకర్ కొంతప్రయత్నించినా ప్రజాసహకారము ప్రభుత్వ సహాయము లేనందువల్ల ఆ ప్రయత్నం విరమించుకోవలసి వచ్చిందని చెప్పవలసి వచ్చుట విచారకరమైన విషయం.

మనము దక్షిణాది భరతనాట్యప్రదర్శనము చూచినపుడు సాధారణంగా ఆ ప్రదర్శనములో అలరింపు, జతిస్వరము, వర్ణము, పదము మొదలైనవే చూస్తాము. అలాగే కథకళినర్తకులు మయూరనృత్యం, భీమ, దుశ్శాసన, భస్మాసుర, లేక శివతాండవము ప్రదర్శిస్తారు. కథక్ నర్తకులు, గత్ తోరా, లేక గజల్, ఠుమ్రీలు నృత్యమాడుదురు. మణిపురియందు రాసలీల, లయహారోబా అను చూస్తాము. ఈ ప్రత్యేకాంశములు చూచుట అలవాటయిపోయినందున పై యంశములులేని నాట్యము చూచినపుడు సంతృప్తికలుగుటలేదు. అందువల్లనే మన నృత్యకళ మూడు శతాబ్దములు వెనుకబడియున్నది. కళ యెప్పుడూ ఒకజాతి పురోభివృద్ధికి సహక రించాలి గాని పతనకారణంగా ఉండగూడదు. కళ కాలాన్ననుసరించి పురోగమించి నపుడే దేశానికి సహకరించగలుగుతుంది. అటువంటికళే ప్రజాదరము పొందుతుంది. ప్రజాదరము పొందలేని కళ కళ కాదు.

## మన నాట్యాచార్యులు

ఉదయశంకర్, రాగిణీదేవివంటి ఆధునిక కళారాధకులు తప్ప తక్కిన మన నాట్యాచార్యులకు కాలముతోగాని, కళలలో తేగలిగిన మార్పులనుగురించిగాని, కళాసహకారంతో - దేశంలో తీసుకురాగలిగిన మహత్తరపరివర్తనల గురించిగాని ఏ విధమైన సంబంధములేదు.

అందువల్ల ప్రస్తుతం - ఏ నాట్యప్రదర్శనం చూచినా వారిముఖములు కొత్తవైనా - అంగవిన్యాసములలోగాని, భంగిమలలోగాని నృత్యనృత్తముల్లో గాని మార్పు చూడలేకున్నాము. కనుకనే కళాప్రదర్శనాలు సమాజంలోగాని, దేశంలోగాని రావలసిన తేవలసిన మార్పులు తీసుకొనిరాలేక విఫలమవుతున్నవి.

ఇక ఎప్పుడన్నా ఏ ఉదయశంకర్ వంటి ప్రతిభాశాలురో కళలో కొంత సంస్కరణతెచ్చి ప్రదర్శిస్తే మన నాట్యాచార్యులు, నర్తకులు, కళావిమర్శకులు వెంటనే పూనుకొని అది శాస్త్రసమ్మతము కాదని విమర్శలు వ్రాస్తారుగాని ఆ నవీనత్వంలో విశిష్టతను అర్థంచేసుకోడానికి యత్నించరు. ఆ కారణంచేతనే ఉత్సాహపూరితులైన నవ్యకళారాధకులు కళలో యే విధమైన సంస్కరణ చేసుకోడానికి భయపడి అసంతృప్తిగా తమ గురువులు చెప్పిన పాతపద్ధతులలోనే ప్రదర్శనల నిచ్చి తృప్తిపొందుతున్నారు. దీనివల్ల కళలోను, కళననుసరించి జాతిలోను రావలసినంత నవీనత, సౌకుమార్యము, పరివర్తన రావడంలేదు. నూతనత్వములేని ప్రాచీనతతో విసిగిపోయి ప్రజాదరణ తగ్గిపోవుచున్నది.

## శివతాండవము

మహానటుడు నటరాజు సృష్టి, స్థితి, సంహారములను తన నృత్యములలో ప్రదర్శించెను. ఆ మహానటుని మహిమాన్వితాదర్శములు, గంభీరభావములు, ప్రకృతి రహస్యములు ప్రదర్శించడానికి సామాన్యనర్తకునికి సాధ్యమయ్యే విషయమా ?

దానికెంత అనుభవము, విజ్ఞానము ఉండవలెను ? కాని ప్రస్తుతం మనదేశంలో మాత్రం ప్రతినర్తకుడూ పులిచర్మం దొరకనియెడల చిరుతపులిచర్మమో అదీ లేని యెడల అద్దకపుగుడ్డనో ధరించి, నాలుగు పిచ్చిగంతులువేసి శివతాండవమని పేరు పెడుతున్నాడు. ఇట్టి నృత్యము చూచినప్పుడు నటరాజస్వామికి జరుగుతున్న అవమానం సహించలేక కన్నీరు పెడుతుంటాను. ఈ ప్రదర్శనలవల్ల మహాదేవునిపై నున్న భక్తికూడ ప్రజల్లో సన్నగిలిపోతుంది.

## శాస్త్రమనగా

సామాన్య ప్రజానీకానికి అర్థంకాని జటిలభావాలను, నిగూఢసమస్యలనీ సరళీకరించి, సులభసాధ్యంగా పామరులకుకూడ అర్థమయ్యేటట్లు ప్రదర్శించి చూపడమే నాట్యశాస్త్రముయొక్క ముఖ్యోద్దేశము. కాని మన కళారాధకుల కృషి

లోపంచేత 'లోకధర్మి'ని పోషించుట మాని, ప్రజాదరణ పొందలేని 'నాట్యధర్మి' సమ్మతమైన తమ నాట్యమే శాస్త్రసమ్మతమని ప్రచారంచేశారు. వాస్తవమాలోచిస్తే 'నాట్యధర్మి' 'లోకధర్మి' సమ్మిళితమైతేనే గాని శాస్త్రసమ్మతమైన నృత్యముకాదు. ఈ దోషమువల్ల అతిసులభభావాలుకూడ పండితులకుకూడ అర్థంకాని విధంగా ప్రదర్శించి ఆ విధానమే శాస్త్రసమ్మతమని భ్రమపడుతున్నారు.

ఈ దోషములు తొలగించి అఖిలభారతదేశాన్ని ఆకర్షించగల నృత్యకళను దిద్ది తీర్చగల ఉపాయమున్నదా అని శంకింప నక్కరలేదు. ప్రస్తుతం మనకున్న నృత్యకళ ప్రాంతీయకళమాత్రమే. ఏ ప్రాంతపు నృత్యము ఆ ప్రాంతపువారికే గాని ఇతరులకు అర్థంకాదు. జాతిసమైక్యమునకు ఉపకరించేకళ ప్రస్తుతం మనకు కావాలి. అట్టికళను సృష్టించి పోషించాలంటే దేశంలోని వివిధ ప్రాంతాల్లోని - నాట్యాచార్యులు, నృత్యకళారాధకులు ఒక కేంద్రంలో సామరస్యంతో కృషిచేసి సాధించవలెను. భరతనాట్యంలోని రసభావ అభినయములూ, కథకళిలోని ముద్రలూ, కథక్‌లోని నృత్తమూ, మణిపురనృత్యంలోని సుకోమల ఆంగికాభినయము ఒకచోటచేరిస్తే, భారతదేశ గౌరవాన్ని చిరస్థాయిగా నిలుపగల దివ్యమైన నాట్యకళ తయారౌతుంది. ఇంత ఆదర్శవంతమైన కళానిర్మాణం చేయాలంటే ప్రభుత్వసహాయం కావాలి. మన జాతీయప్రభుత్వం కళాభివృద్ధికి తోడ్పడి - కళారాధకులను ప్రోత్సాహమిచ్చి - యీదివ్యకళను ఉద్ధరించవలెను.

వేదకాలంలో రాజాంతఃపురం మొదలు మహారణ్యంవరకూ నృత్యకళ మంగళకరంగాను, వినోదవికాసాలకు గౌరవనీయ ప్రచారసాధనంగాను భావించబడేది. వీరులకు యుద్ధభూమిలో ప్రచండోత్సాహం కల్పించే నృత్యమూ నాట్యకళాంశమే. భక్తులకు పారవశ్యంకల్పించి యిష్టదేవతా సన్నిహితులుగా నర్తింపజేసే దివ్యకళ ఈ నాట్యకళాంశమే. దేవసభలలో వేదార్థములు ప్రదర్శించి యిహపరతారకంగా ప్రసిద్ధివహించిన దీ నాట్యకళే. అట్టి మహోన్నత దివ్యకళ మననాట్యకళ. దేశకాలపరిస్థితుల పరివర్తనలకు సున్నితమైన ప్రచారసాధనము. ఇటువంటికళ మధ్యయుగంలో అవిద్యవల్ల కేవలంవిలాసపథంగా మారిపోయి న్యూనతపొంది రూపాంతరంతో క్షీణించిపోయింది.

దేశపునరుద్ధరణకు పూనుకున్న నేటి మన స్వతంత్రప్రభుత్వము లలితకళా పునరుద్ధరణకు ముఖ్యంగా నాట్యకళ పునరుద్ధరణకు సత్వరము పూనుకోవాలి.

ఇంగ్లండు, రష్యా మొదలైన విదేశాల్లోవలె లలితకళలకు విశ్వవిద్యాలయాలు స్థాపించి దేశంలోని కళారాధకుల నందరిని రప్పించి ప్రోత్సాహమిచ్చి ఆదర్శవంతమైన, దేశకాలానుసారమైన కళలను సేకరించాలి. అప్పుడే దేశానికి - జాతికి - గౌరవము, నాగరికత, నవీనత లభిస్తాయి. కళానిలయమైన భారతదేశంలో కళా దారిద్ర్యమును విదేశీయులు గుర్తించకముందే మనం గుర్తించాలి! పునరుద్ధరించాలి!

# నేటి భారతదేశంలోని నృత్యసాంప్రదాయాలు

ప్రస్తుతకాలంలో మనదేశంలో యెక్కువగా ప్రచారములోనున్న నృత్యసాంప్రదాయాలు – భరతనాట్యం (తంజావూరునాట్యం) కథక్ కథకళి మణిపుర నృత్యపద్ధతులు, వాటిలోని పోలికలు, భేదములు, విశిష్టతలనుగూర్చి ఈవ్యాసములో వ్రాస్తాను.

భరతము:—నాట్యము, నృత్యము, నృత్తము, అభినయము, తాండవము, లాస్యము అను భేదములు కలిగివున్నదని అందరికి తెలిసిన విషయమే.

పై చెప్పిన నాలుగు సంప్రదాయాలు ఏయే పద్ధతికి చెందుతాయో వ్రాస్తాను.

## భ ర త నా ట్య ము

ఇది అతి పురాతనమైన నృత్యము. హిందువులు దేవాలయములు కట్టుట యెప్పుడు మొదలుపెట్టిరో ఆనాటినుండి యీ కళ యెక్కువ ప్రచారములోనికి వచ్చినది. భరతుని నాట్యశాస్త్రము ననుసరించి అంగహారములు, రేచకములు, కరణములు, ఉత్ప్లవనములు మొదలగునవి శాస్త్రసమ్మతంగా ప్రదర్శించు కళ ప్రస్తుతకాలంలో మనదేశంలో ఇదొక్కటే కనబడుచున్నది. భరతశాస్త్రమును బాగుగా అభ్యసించి జీర్ణించుకొని ఈకళను రూపొందించి ప్రచారములోనికి నాట్యాచార్యులు తెచ్చిరేమో!

ప్రస్తుతకాలంలో ప్రచారంలోనున్న భరతనాట్యప్రదర్శన క్రమము (అనగా అలారి, జతి, శబ్దము, వర్ణము, పదము, జావళి, తిల్లాన) సుమారు వంద సంవత్సరముల క్రిందట తంజావూరు శరభోజిరాజు కాలములో యేర్పాటుచేయబడినది. ఈవిధానము ననుసరించి చేయబడే ప్రదర్శనములలో నృత్య, నృత్త అభినయములు సరిసమానములుగా పోషింపబడుతున్నవి. ఆంగిక, వాచిక, సాత్వికాభినయములకు చక్కని అవకాశం గలదు. ఈ విధమైన చక్కని విభాగము నాఅనుభవములో నేనుచూచి అభ్యసించిన జావనీస్, బాలినీస్, సయమీస్, కంబోడియన్, కథకళి, మణిపూర్, కథక్ నాట్యాలలో యెచ్చటను చూడలేదు.

ఈ నాట్యం లాస్యపద్ధతికి చెందిన దగుటచే సుకుమారమైన కోమల ఆంగికాభినయంతో నయనానందకరముగా హృదయాహ్లాదకరంగా ఉంటుంది. నాయికాభినయమందు ఈ సాంప్రదాయముదే పైచేయి. రౌద్ర, బీభత్స, భయానకరసములు తప్ప తక్కిన రసము లన్నియు ఈ పద్ధతిలో అభినయించవచ్చును. భరతనాట్య నర్తకులు చిత్రగతులను జతి స్వరమందు నృత్త మాడునపుడు మనహృదయాలు ఆ నాదబ్రహ్మానముచే ఆకర్షించబడి అర్థముకాని ఒక ఆనందము ననుభవిస్తాము. కాబట్టి నాయికానాయక సంబంధించిన శృంగారరస నిలయములైన పదముల అభి

నయము జూచినప్పుడు మనము మన వాస్తవిక జీవితాలలోని సుఖదుఃఖాలను అనుభవిస్తాము. కృష్ణాదిమహాత్ముల వర్ణనగీతాలతో కూడిన శబ్దనృత్యము జూచినప్పుడు దేవాలయములలోని శిల్పము లన్నీ మన కన్నులముందు కదలుతున్న ట్లే భ్రమ కలుగుతుంది.

నేటికాలంలో కేవలం వ్యాపారదృష్టితో నాట్యంచేసేవారుగాక, నాట్యకళకై తమ జీవితాల నంకితంచేసిన కళోపాసకుల భరతనాట్యప్రదర్శనం చూచినప్పుడు మనహృదయాలు ఆధ్యాత్మికానందంతో నిండిపోతాయి. మనలో పవిత్రభావాలు స్ఫురిస్తాయి. నిరంతరానందసంధాయి ఆ దేవదేవుని సాన్నిధ్యంలో ఉన్న ట్లే అనిపిస్తుంది. కాలక్రమేణ పతితుల చేతిలో పడి అపఖ్యాతి పొందినా పవిత్రమైన ఆదర్శములతో కూడికొని వున్న కళ యిది.

ఇందు 'లోక ధర్మి' 'నాట్యధర్మి' సమముగా పోషింపబడుచున్నది.

పూర్వము భరతనాట్యము స్త్రీలు చేస్తుండేవారు. పురుషుడు నటుడుగా (నాయికాభినయమందు చెలికత్తెగాను, వంటపాట పాడుటకు) మాత్రముండేవాడు. అందుచే భరతనాట్యము స్త్రీలే చేయవలెననియు, పురుషులు చేసిన రాణించదనియూ, "పురుషులు చేయుటకు వీలుండునా" అనియు నేటి కళారాధకులలో ఒక సంశయము కలిగినది.

అలారి, జతి, శబ్దము, తిల్లాన భాగములు స్త్రీ పురుషు లిద్దరూ చేయవచ్చును. కాని పురుషులు అభినయించుటకు నాయికాసంబంధములైన గీతములేగాక, నాయకసంబంధమైన పదములు, గీతములు, జావళీలు, పదవర్ణము లెన్నియో ఉన్నవి. వానిని ప్రచారములోనికి తీసుకొనిరావచ్చును. కొందరు పురుషులు స్త్రీవేషం ధరించి నాయికాసంబంధములైన గీతముల నభినయించుటగూడ చూస్తున్నాము. నాయక గీతములు పురుషవేషంలోనే అభినయించవచ్చును. కనుక భరతనాట్యమందు స్త్రీ పురుషు లుభయులూ పాల్గొనుటకు వీలున్నది.

భరతనాట్యం:—తమిళ-ఆంధ్రదేశాలలో యెక్కువ ప్రచారములోఉన్నది. ఇప్పుడిప్పుడు ఈ నాట్యకళలోని విశిష్టత గ్రహించి ఉత్తర హిందూస్థానములోని కళారాధకులుగూడ యెందరో ఈ నాట్యపద్ధతిని అభ్యసించారు. అభ్యసిస్తారు.

## కథకళి

భరతనాట్యము కోమల, సుకుమార భావములకు నిలయమైతే,— కథకళి, గంభీర, ఉద్ధత భావములతో నిండివుండే తాండవపద్ధతికి చెందిన నృత్యము. వీర, రౌద్ర, బీభత్స, భయానక రసముల నభినయించుటలో కథకళిన ర్తకులకు పెట్టినది పేరు. వారు అభినయించినా, అభినయించకపోయినా వారు ధరించే దుస్తులు, ముఖములకు వేసుకొనే రంగులు, చండ, మద్దెలనుండి వెలువడే గంభీరనాదము ప్రేక్షకులలో ఆ రసముల నుత్పత్తిచేస్తాయి. నృత్యమందు వీరి ఆహార్యము వాస్తవికతకు బహు దూరముగా నుంటుంది.

భరతనాట్యము రాజదర్బారులలో పెరిగింది. అందుచే అభినయము, గానము, ఆహార్యము ప్రతివిషయములో కోమలత్వము, లాలిత్యము కనిపిస్తుంది. కాని కథకళి నృత్యనాటికలలో లాలిత్య సౌకుమార్యాలకు తావులేదు. ఇది ముద్రనాట్యము. ఇందు ఉపయోగించబడినట్లు ముద్రలు మరియేపద్ధతియందుకూడ ఉపయోగించబడవు. కనుకనే సాత్త్వికముకన్న ఆంగికమే ఈపద్ధతిలో ఎక్కువగా ఉపయోగమందున్నట్లు తోస్తుంది. ఇది ఉద్ధతనాట్యమగుటచే దీనియందు సాధారణంగా స్త్రీలు పాల్గొనేవారు కారు. స్త్రీలు మోహిని అట్టము అభ్యాసం చేసేవారు

వింత వింతరంగులతో మేకప్ చేసుకొని, చిత్ర విచిత్రములైన ఆభరణములను ధరించి రంగస్థలముపై చండావాద్యము ననుసరించి నాట్యమాడుతుంటే ప్రేక్షకులను విస్మయానంద వీచికల నోలలాడిస్తుంది. ఈ నాట్యములో ఎంతవిద్వత్తున్ననూ, ఎట్టి అద్భుతమైన ఆహార్యమున్ననూ, అభినయవిధానము, భావప్రకటన కొంచెము మోటుగానుండును. సున్నితము తక్కువ. 'లోకధర్మి' చాలయెక్కువగా ప్రదర్శింపబడుటచే కొన్ని వేళలందు వికృతంగా నుండును. కాని మనదేశంలో మిగిలియున్న పూర్వకళలలో, పూర్వపద్ధతిలో ప్రదర్శింపబడేకళ ఇదొకటి. విశ్వకవి రవీంద్రునిచే పొగడ్తలొందిన ఈ కళకు మలబారు పుట్టినిల్లు. బెంగాలు, దక్షిణ భారతదేశాలలో యెక్కువ ప్రచారంలో నుంది.

## క థ క్

మహమ్మదీయయుగంలో ప్రభువుల వినోదార్థం పోషింపబడిన కళ. ఇందు టుమ్రీ, గజల్ అభినయము నాయికా భావాలతో కూడియున్ననూ, శాస్త్రసమ్మతము గాని ఈ అభినయము యాంత్రికనృత్యమును పోలియుండును. జనుల హృదయాలను ఆకర్షించేదే, రంజింపచేసేదే - (అసభ్యకరమైనది కాకపోయిననూ) కళ అనేపద్ధతిలో యిది పోషింపబడింది ప్రభువులతీరికసమయాల్లో జల్సాలకుగాను ఈకళ పెంపొందింది. అభినయ మెట్లున్ననూ మరి యే నృత్య సాంప్రదాయములోనూ లేని తాళనృత్తము దీనియం దున్నది. కథక్ నర్తకుడు యే తాళములో నైననూ గంటలకొలది నృత్తమాడగలడు. బహుకష్టతమమైన బ్రహ్మ, ధమార్, రుద్ర, లక్ష్మి మొదలైన తాళముల అవలీలగా నృత్తమాడగలడు. తన అడుగులో యెట్టి కష్టతరమైన శబ్దముల నైననూ ఎంత త్వరితగతినైననూ పలికించగలడు. ఇట్టి అభ్యాసము మరి యే పద్ధతి యందును లేదు. కాని యిది రసభావములులేని నృత్తమగుటచే అంత ఆకర్షణీయముగా నుండదు. కనుక ప్రేక్షకులు యెక్కువకాలము చూడలేరు. ఇది లాస్యపద్ధతికిచెందిన నృత్యము. ఇది ఉత్తరప్రదేశము, పంజాబు, రాజపుటాన, బొంబాయి మొదలగు ప్రదేశములలో యెక్కువ ప్రచారంలో ఉన్నది.

## మ ణి పు రి

లాస్యపద్ధతికిచెందిన నృత్యము. చైతన్యుల జన్మభూమియైన వంగదేశము, అస్సాము, మణిపూర ప్రాంతాలలో యెక్కువ ప్రచారంలో ఉంది. వేణుగోపాలుని నృత్యగానములతో పూజించునట్టి ఆరాధననృత్యంగా దీనిని పేర్కొనవచ్చును.

తంజావూరు భరతము పూర్వము ఆరాధనన్యత్యమైననూ అది ఒక కళగా వృద్ధిచేయుటకు, పాండిత్యము ప్రదర్శించుటకు దానిని దేవదాసీలు అభ్యసించేవారు. మణిపుర నృత్య మట్లుగాక సామాన్యప్రజానీకపు జీవిత నిత్యకృత్యములలో ఒక భాగమగుటచే ఇది అట్టి మహోన్నతస్థితికి రాలేదు. విశేషప్రచారముమాత్ర మున్నది. ఇది అతి కోమలమైన, మనోహరమైన, రమణీయమైన ఆంగికాభినయముతోగూడి చూచుట కింపుగా నుండును.

ఆకుపచ్చ, ఎరుపు తెలుపురంగుల అద్దాలు అమర్చబడిన బుట్టలవంటి లంగాలు ధరించి శిరోజాలు శివుని జటాజూటంలా పైకెగదువ్వి, నడినెత్తిపై గోపురాకారంగా కట్టి మణులతో అలంకరించుకొని, భక్తిహారవశ్యముతో స్త్రీలందరూ జేరి జయదేవుని అష్టపదులు పాడుతూ చేతులుకొట్టుతూ, కృష్ణమంజీర ఆవరణలో నృత్యంచేయడం చూస్తుంటే మనకు ద్వాపరంలో యమునాతీరములో కృష్ణుని రాసక్రీడ జ్ఞాపకానికి వస్తుంది. వీరు భక్త్యావేశముతో నృత్యము చేస్తారుగనుక ఒక్కొక్కసారి వీరు పాడే పాటకు, చేసే అభినయమునకు సంబంధమే ఉండదు. అభినయ మెక్కువ అభివృద్ధి గూడ చెందలేదు. రసపోషణ తక్కువ. ఈ సాంప్రదాయము శాస్త్రముకన్న ప్రకృతిపైనే యెక్కువ ఆధారపడి ఉంటుంది. హస్తవిన్యాసము మాత్రము బహు రమణీయంగా సెలయేళ్ళప్రవాహంలా ఇంపుగా ఉంటుంది. దైవారాధనకొరకు నృత్యముచేయు నర్తకులు శాస్త్రమునకుగాని, 'లోకధర్మి' 'నాట్యధర్మి'లకు గాని యెక్కువ ప్రాముఖ్యమివ్వక ప్రకృతిపైనే ఆధారపడిఉండుట లోకవిదితమే.

ఈ పై పద్ధతుల నాట్యములు అభ్యసించిన తరువాత నేను తెలుసుకోగలిగిన సత్య మేమనగా, ప్రస్తుతకాలంలో మనదేశంలో భరతశాస్త్రము ననుసరించి నృత్య, నృత్త, అభినయముల సమముగా పోషిస్తూ శాస్త్రసమ్మతంగా చేయబడే నృత్యము — 'లోకధర్మి' - 'నాట్యధర్మి' అవసరము గుర్తించి అభినయించు నృత్యపద్ధతి దక్షిణాపథములోని భరతనాట్యమొక్కటే కనబడింది.

[కథకళియందు నవరసములు అద్భుతంగా అభినయించబడిననూ, కథక్‌నందు నృత్తము అమోఘంగా వున్ననూ, మణిపురియందు అంగవిన్యాసము రమణీయంగా వున్ననూ, ఈ భరతనాట్య పద్ధతియందు అనుసరించిన క్రమము మరే పద్ధతి యందును లేదు. ఇది ఈ నృత్యపద్ధతులను అభ్యసించిన ప్రతి నర్తకునికి తెలిసిన విషయమే.]

# విషయసూచిక

## ప్రథమభాగము - శాస్త్రీయ నృత్యకళ



## ద్వితీయభాగము - ఆటవికుల నృత్యకళ



## తృతీయభాగము - తూర్పుదీవులలోని నృత్యకళ

# కళ

ప్రకృతియేకళ, కళయే ప్రకృతి. ప్రకృతిలో ఎక్కడచూచినా మనకు కళయే కనబడుతుంది. కళ ప్రకృతిలో దాగుకునుమాత్లాడుతుంది. మానవ జీవితమే ఒక గొప్పకళ.

మండుతున్న అగ్నిజ్వాలలో మనము నృత్యముచూస్తున్నాము. పర్వతశ్రేణులనుండి పల్లపుప్రదేశములకు జలజలపారే సెలయేళ్లలో మధురసంగీతము వింటున్నాము. సాయంసమయములో చెట్లసందుల గుండా పరుగులెత్తే మలయమారుతము హాయిగా పాడుతుంది. పిల్ల వాయువులకు అల్లల్లాడే ఆకులు, బాగుగాపూచి, కాడను విడిచి భూమిపై బడే పువ్వుల రెక్కలు, పండుటాకులు, నయనానందకరముగా నృత్యమాడుతాయి. పౌర్ణమినాడు యిసుక తిన్నెలపై కూర్చుంటే గంభీరనాదములతో తరంగములు చేసే తాండవనృత్యము చూడగలము. స్త్రీ, పురుష పక్షుల ప్రియసంభాషణల్లో సంగీతము వింటున్నాము. వర్ష ఋతువులో కప్పలు బెకబెక నాదాలతో హాస్యగీతములను పాడి మనకు వినిపించుతాయి. వసంతములో నెమళ్లు తమప్రియురాండ్రను ఆకర్షించుటకుచేయు అంగములచలనములో నాట్యకళ కనబడుతుంది. మేఘగర్జనలలో మృదంగ వాయిద్యము, కోయిల 'కోకో' రవములలో మురళీనాదము, ఏనుగుల ఘీంకారములో వీణాఝుంకారములు మనకు వినబడుతున్నాయి. వసంతఋతువులో ప్రభాత సమయమున ప్రకృతి వివిధాలంకారములతో చిత్రకారుడు చిత్రించిన సర్వాంగ సుందరివలె మనముందు ప్రత్యక్షమవుతుంది. చెట్ల లేతఆకులమీదపడిన మంచు బిందువులు యౌవ్వనవతి కుచములపై తళతళమెరిసే ముత్యాల మాలవలె మనకు ప్రాతఃకాలమందు దర్శన మిస్తాయి, భ్రమపెడతాయి, కన్నులు మిరుమిట్లుగొల్పుతాయి. ఈవిధంగా ప్రకృతిలో ఎక్కడ చూచినా మనకు లలితకళల మయముగా కనబడుతుంది.

కానీ, కళ అనగానేమి ?

ప్రకృతిని సహజముగా అభినయించుట, ప్రదర్శించుటయే కళ. కళారాధకునిద్వారా ప్రకృతి తన రమణీయతను ప్రపంచానికి

ప్రదర్శిస్తుంది. కళారాధకుడను అద్దముపై తన సహజసౌందర్యాన్ని ప్రతిబింబిస్తుంది. సృష్టియొక్క రహస్యములను అర్థము చేసుకొనుటయే కళాపిపాసియొక్క ఆదర్శము. ప్రకృతి సాయముతో తన స్వయంకృషి వల్ల సృష్టినర్థముచేసుకొని, ప్రావీణ్యత సంపాదించి, ప్రకృతికి రేఖలుదిద్ది, ప్రకృతిలోని లోటులను సవరించి, ప్రపంచమున కర్థమయ్యేవిధమున సృష్టిలోని వివిధరహస్యములను ప్రదర్శిస్తాడు కళారాధకుడు. సృష్టి రహస్యములు సామాన్య ప్రజానీకానికి, అతిసులభంగా అర్థమగుటయే గాక వారు వానిని అభ్యసించి, మరల ప్రదర్శించుటకు వీలగుటకై కళావేత్తలు శాస్త్రములువ్రాశారు. శాస్త్రమనగా సామాన్యమానవుడు ఒక పనిని ఎటులచేయవలయునో తెలుపునట్టి సూత్రముల గ్రంథము.

వర్షకాల మేఘగర్జనలే మన మృదంగవాయిద్యమునకు జీవము. ప్రకృతిలోని వివిధనాదములే సంగీత శాస్త్రము. జీవకోటియొక్క సంచలనమే నృత్యం. ప్రకృతిశోభయే చిత్రకళకు మాతృక. జవ్వనుల శృంగార చేష్టలే నవరసభరితమైన అభినయము. కళ సజీవముగా నుండ వలెనన్న కళారాధకుడు కళకు జీవమైన ప్రకృతిని ఆరాధించాలి. కేవలము శాస్త్రపఠనముతో తృప్తిచెందక ప్రకృతిలో లీనమవ్వాలి. అప్పుడే కళ (గీత, వాద్య, నృత్య, చిత్రలేఖనము, శిల్పములలో నేదైనను) శాశ్వతముగా, సజీవముగా నుండగలదు.

# భారతీయ సంగీత కళ

శ్లో॥ "గీత వాదిత్య నృత్యానాం త్రయం సంగీత ముచ్యతే"

గీత, వాద్య, నృత్యములచేరిక సంగీత మనబడును. భారతీయ సంగీత కళయొక్క చరిత్రను మూడు యుగములుగ విభజించ వచ్చును.

## ౧. వేదయుగము

ఈ యుగములో ప్రతి స్త్రీ, పురుషుడు విధిగా సంగీతకళ నభ్యసించేవారు. ప్రపంచమునకు కారణమైనట్టియు, ఆధారమైనట్టియు పంచ భూతములను నృత్యగీతములతో ఆరాధించెడివారు. సంగీతకళ యిప్పటి మన సంఘములోవలె ఏ కొందరి సొత్తోగాక దైనిక కృత్యము లలో ఒకభాగమై యుండినది. ఇప్పటికీ అడవిజాతులలో (గోండులు, ఒరియనులు, సంతాల్, ముండా మొదలైన ఆటవికులు) ప్రతియొక్కరూ సంగీతకళ నభ్యసిస్తారు. ఈ విధముగనే బాలీద్వీపపు ప్రజలలోకూడ ప్రతి స్త్రీ, పురుషుడు లలితకళల నభ్యసించే వాడుక యిప్పటికినీ గలదు.

## ౨. శాస్త్రయుగము (స్వర్ణయుగము)

ఇది మన దేశపు సంగీతకళయొక్క చరిత్రలో చాల ముఖ్యమైన యుగము. ఈ యుగారంభములోనే బ్రహ్మ నాలుగువేదములలోనుండి-ఋగ్వేదమునుండి వాద్యమును, యజుర్వేదమునుండి అభినయము, సామ వేదమునుండి సంగీతమును, అధర్వణ వేదమునుండి రసములను గ్రహించి పంచమవేదమనబడెడి 'భరతనాట్య' శాస్త్రమును రచించెను. (భరత శాస్త్రమనగా – భ అనగా భావము, ర అనగా రాగము, త అనగా తాళము; భావ రాగ తాళములతో కూడిన నాట్యమును గురించి తెలుపు శాస్త్రము అని యర్థము) భరతార్ణవమనే మహాగ్రంథమును సంక్షిప్తపరచి నందికేశ్వరుడు ఇంద్రునికోర్కెపై 'అభినయ దర్పణమను' గ్రంథమును రచించెను. శివుడు, పార్వతి తాండవ (పురుషుల నాట్యమని చెప్పవచ్చును), లాస్య (స్త్రీల నృత్యం) నృత్యభేదములను నిరూ

పించిరి. విష్ణు, దత్తిలుడు, కోహలుడు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, హనుమంతుడు, విఘ్నేశ్వరుడు, షణ్ముఖుడు, రావణుడు మొదలగు వారు సంగీతకళ నారాధించి, సంగీత గ్రంథములను వ్రాసిరి. సప్తతాళ నిర్ణయము, రాగములసృష్టి, ఏయే రాగము ఏయే సమయములలో పాడ వలయునో, అట్టి కాలనిర్ణయము ఏర్పరచిరి. ప్రకృతిని బహుజాగరూక తతో పఠించి, విమర్శించి నాట్యకళకు ఉపయోగపడు దృష్టి గ్రీవా (మెడ) మొదలగు భేదముల గూర్చి వ్రాసిరి. నృత్యహస్తముల (ముద్రల) పుట్టుకగూడ చాలమట్టుకు ఈ కాలములోనే జరిగినది. నృత్యమునకు పనికివచ్చు వాయిద్యములు (వీణ, మృదంగము, మురళి మొదలైనవి) కనిపెట్టబడినవి. ప్రకృతియొక్క ప్రతిబింబము, కళ శాస్త్రరూపము దాల్చినది ఈ యుగములోనే.

తరువాత శ్రీకృష్ణుడు, అర్జునుడు, ఉషాకన్య, విక్రమాదిత్యుడు, హర్షుడు మొదలగు మహారాజులీ కళను పోషించారు. శాకుంతలము వంటి గొప్ప నాటకమును వ్రాసిన మహాకవి కాళిదాసు, మృచ్ఛ కటికమును వ్రాసిన శూద్రకుడు ఈయుగమువారే. కాళిదాసు కాలమున నృత్యకళ రెండు విధములుగ నుండెడిది.

నృత్యమును దైవికముగా ఆరాధించుటకు దేవళములలో దేవ దాసీలు యేర్పరుచ బడిరి. (వీరినృత్యమే మార్గినృత్యము.) తర్క వేదాంత సంగీతకళల నభ్యసించి, రాజదర్బారులందు తమపాండిత్యమును ప్రదర్శించి ప్రభువుల గౌరవమునకు పాత్రులైన స్త్రీ కళారాధకులే గణికలు (వీరిసంగీతమే దేశ సంగీతము).

ఈ యుగములో ప్రతినాగరికుడు ఈ కళను అభ్యసించినను (వాత్స్యాయనుడు తన కామశాస్త్రములో ప్రతియొక్కడు అభ్యసించ వలసిన అరువది నాలుగు విద్యలలో గీతము, వాద్యము, నృత్యములను కూడ పేర్కొని యున్నాడు) ఈ కళయందు కృషిచేసి మంచి ప్రఖ్యాతి సంపాదించుటకు సంఘము ఒక ప్రత్యేకజాతిని యేర్పరచినది. అదే ఇప్పటి కళావంతుల జాతి. ఈ కళావంతుల నృత్యములో ఛురిత, యథావరిత అను రెండు భేదములు కలిగినవి. శాస్త్రయుక్తముగా చేయుచున్న నృత్యము 'ఛురిత' నృత్యము. శాస్త్రవిదితముగా గా

కేవలము పురుషుల హృదయములను రంజింపజేసి మానవులలోని పశుత్వమును తృప్తిపరచే నృత్యమే యావరితము. దీనికే 'కులటా' నృత్యమని పేరు. ఈ నృత్యాన్ని పూర్వులు బహిష్కరించారు. ఇట్టి ప్రదర్శనములు చూచిన పాపమనియు, పుట్టగతు లుండవనియు చెప్పబడినది.

ఈ కాలములో భారతదేశమంతటా సంస్కృతమునకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చుటచే కావ్యములు, పాటలు, పద్యములు, నాటకములు మొదలైనవన్నీ సంస్కృతములో వ్రాయబడినవి. అందువలన దక్షిణ, ఉత్తర హిందూదేశమంతటా సంగీత మొకేరీతిగా ఉండినది. కాని ఈయుగాంతములో ప్రాంతీయ భాషకు ప్రాముఖ్యత హెచ్చినది. దక్షిణ దేశములోని భాషలన్నిటిలో * తెలుగు అతిమాధుర్యమైనదగుటచే సంగీతశాస్త్రజ్ఞులు ఆ భాషలో వ్రాయుటకు మొదలుపెట్టారు. ప్రతాప సింహుడు మొదలైనమహారాజులకాలములో నృత్యమునకుపయోగపడు నట్టి పదవర్ణములు, స్వరజతులు, పదములు వ్రాయబడినవి. ఉత్తరమున వ్రజభాషకు (ఇప్పటి హిందీ భాషయొక్క మాతృక) ప్రాముఖ్యత హెచ్చినది. ఆ భాషకు సరిపోయే లాగున స్వరముల నేర్పరిచి, ఆ రాగ ములకు క్రొత్త పేర్లిచ్చి ఇప్పటి హిందుస్థానీ సంగీతమును క్రమేణా ఉత్తరదేశీయులు తయారుచేసిరి. ఈ విధముగా ఉత్తర దక్షిణదేశ సంగీతము యేర్పడినది.

## న వ యు గ ము

ఈ యుగము మహమ్మదీయులు మనదేశముపై దండయాత్ర చేసినప్పటినుండి ప్రారంభమయినది. క్రమ క్రమముగా మనలోని ఉన్నత ఆశయాలు ఒక్కొక్కటి నశించాయి. మనలోని పశుత్వాన్ని సంతృప్తి పరచే కళనే మన మారాధించడము మొదలు పెట్టాము. మన పూర్వులచే బహిష్కరింపబడిన కులట నృత్యాన్నే పోషించుటకు పూనుకున్నాము. స్వచ్ఛమైన కళ అంతమొందినా కళావంతుల జాతి మాత్రము మనకు మిగిలింది. దేవదాసీలు తమ

* 'Telugu is the Italian of the East' అని పాశ్చాత్యులు పొగిడారు.

కర్తవ్యాన్ని మరచిపోయి, ప్రేమ దాసీలుగా, ధనదాసీలుగా తయారైనారు. కాని ఉత్తర హిందూస్థాన లలిత కళలకీ యుగము చాలా ముఖ్యమైనది. ఇప్పటి ఉత్తర హిందూస్థానపు 'కథక్' నృత్యము (లక్నో ఘరానా నృత్యము) ఒక ప్రత్యేక కళగా తయారైనది. 'తోందిర్ దిర్, యలలియలల' మొదలైన శబ్దాలతో గూడిన (2) "తరానా" లు వ్రాసిన అమీర్ ఖుస్రూ, తాన్ సేన్ వంటి మహాగాయకులు హిందుస్తానీ సంగీతమును మహోన్నతస్థితికి తెచ్చారు. తబలా, సారంగి, సితార మొదలగు నూతన వాయిద్యములెన్నో కనిపెట్టబడినవి. ఖ్యాల్ గీతముల పాటగూడ ఈకాలములోనే ప్రారంభమయినది. అభినయమునకు ఉపయోగ పడునట్టి 'ఠుమ్రీలు' (దీనిని మువ్వగోపాల, సారంగపాణి పదములతో పోల్చవచ్చును), 'గజల్' (మన జావళీల వంటివి), 'టప్పా' మొదలగునవి ఎన్నో వ్రాయబడినవి.

కాని దక్షిణదేశపు సంగీతము మాత్రము వింతరూపము దాల్చుతూ వచ్చినది. శాస్త్రమన నేమో తెలియని వెఱ్ఱిగొల్లడు తన పశువుల కాయుచు, ఊదే మురళీగీతములోని మాధుర్యము, దినమంతా చేలలో పనిచేసి సాయంత్రము ఇండ్లకుపోతూ పల్లెపడుచులు పాడే జానపదగీతముల వినినప్పటి ఆనందము, మనకు ఈ శాస్త్రీయ సంగీతము వినినప్పుడుగాని, నృత్య ప్రదర్శనములను చూచునపుడు గాని గలుగక కష్టపడెదము. బృందావనములోని పదునారువేల గొల్లపడుచులను, జ్ఞాన శూన్యమైన పశుపక్ష్యాది జంతువులను ఆనంద పరవశులను చేసి ఆకర్షించిన సంగీతమిదియేనా అని సంశయిస్తాము. చైతన్యరహితములైన రాళ్ళను సయితము కరిగించే, నెమలను ప్పొంగచేసే, చెట్ల నల్లల్లాడించే, విమనిధిఫణిరాజు నానంద పారవశ్యమున నృత్యమాడించే 'నాదము', త్రిమూర్తులను గూడ బంధితులనుచేసే 'ఆ నాదము' హృదయమున్న మానవుని ఆకర్షించలేదంటే, ఆ నాదోపాసకులలో ఏదో లోటుఉండి తీరాలి.

మన గాయకులకు వారు పాడుచున్న పాటయొక్క జీవమైన భావముతో అవసరములేదు. కేవలము స్వరమునకే ప్రాముఖ్యత యివ్వబడును. ఉదాహరణమునకు 'ఎందు దాగినాడో మా రామ

చంద్రుడు' అను కీర్తన పాడేటప్పుడు, అది తోడిరాగములో, అపస్వరము లేక ఆదితాళములో పాడుచున్నారో లేదో అనే దానికే ఎక్కువ ప్రాముఖ్యత యిచ్చెదరుగాని, ఆ తోడిరాగములో ఆదితాళమునకు సరిపోవునట్లు, ఆ పాటలోని భావము వెలువడునట్లు పాడుటకు ఎవ్వరూ ప్రయత్నించుటలేదు. అలాగే నృత్యప్రదర్శనములలో కూడ ఏదైనా ఒకపదము నభినయించవలసి వచ్చినప్పుడు కేవలము శాస్త్రమునకే ప్రాముఖ్యత యివ్వబడుచున్నదిగాని, భావ ప్రకటనము సహజముగా నున్నదా అను విషయములో వారికి అవసరములేదు. అనగా శాస్త్రమునకే ఎక్కువ ప్రాముఖ్యతయిస్తూ ప్రకృతి ఆరాధనను పూర్తిగా మానివేసారు మన కళారాధకులు. ఇదే మనదక్షిణదేశ కళారాధకులలోని గొప్పదోషము అందువలన మనసంగీతకళ కేవలము నిర్జీవమైన ప్రతిమగా తయారైనది కాని, ఉత్తరదేశీయులు మాత్రము చాలవరకు ఈ దోషమునకు గురికాలేదు. కనుకనే మన సంగీతములో విద్వత్తు ఎక్కువగా నున్నను, ఉత్తరహిందూస్తానీ సంగీతములోనున్న సున్నితము, మాధుర్యము, హాయి మన సంగీతములో చాల తక్కువ. కనుక కేవలము శాస్త్రపఠనముతో కాలము వ్యయపరచక, ప్రకృతి నారాధిస్తూ, చెట్టునపండిన ప్రత్తికాయలలోని దూది పిల్లగాలులకు చెట్టునువీడి, ప్రకృతిలో అదృశ్యమగునట్లు ప్రకృతిలో లీనమైన నాడే శాశ్వతము, సజీవము ఐన కళను ప్రదర్శించగలము. ఇది ప్రతి కళారాధకుడు గమనించవలసిన విషయము.

# ప్రాచీన నృత్త పద్ధతులు:

మనదేశములో పూర్వముండిన నృత్యపద్ధతులను ఆరు విధ ములుగా చెప్పవచ్చును.

## ౧. సవర లేక సబర నృత్యము

సబరులు, గోండులు, ముండా, బైగా మొదలైనవారు ద్రావిడ శాఖకు చెందినవారు. వీరు నేటికిని ఒరిస్సా అరణ్యములలో నివసించు చున్నారు. వీరి నృత్యములన్నీ సాధారణముగా ప్రకృతి పూజకు సంబంధించినవి. ఈ నృత్యములను వేదయుగములోని ఆర్యుల నృత్య పూజలతో పోల్చవచ్చును. పురాతన గ్రీసుదేశములోగూడ ప్రజలు 'డియోనిసస్'న్ పూజించు సమయములో నృత్యగీతములతో స్తోత్రము చేసేవారు. గోండుల ఖర్మనృత్యము, ఒరియనుల నృత్య జాత్రలు, సంతాలుల నృత్యములు ఇట్టివే. ఇది అతి పురాతన నృత్యముగా చెప్పవచ్చును. ఇది శాస్త్రరీతిని గాక కేవలము ప్రకృతిపై ఆధారపడి యుండును.

## ౨. కర్షణీ నృత్యము

ఎనిమిదిమంది గోపికలు ఎనిమిది కృష్ణవిగ్రహముల చుట్టూ నిలబడి స్తోత్రగీతములను పాడుచూ నృత్యమాడుట 'కర్షణీ' నృత్య మనబడును. ఈ నృత్యము శ్రీకృష్ణుని కాలములో మనదేశమున అమలులోనికి వచ్చినది. బహుశః ఇది కృష్ణుని రాసలీలలో ఒక భాగమై యుండవచ్చును. ఈ మాదిరినృత్యమును కారువమేళగాండ్రు చేసెడివారు.

## ౩. కౌరంగి - (వసంతోత్సవ నృత్యము)

స్త్రీలు పురుషులు కలసి వసంతఋతు ప్రారంభములో ప్రకృతి గీతములనుపాడుచు చేసేనృత్యము; వసంతము పశుపక్ష్యాది జంతువులు తమ సంసారముల నేర్పరచుకొను సమయము; నెమిలి తన పింఛమును

విప్పి రమణీయముగ నృత్యమాడి తన ప్రేయసిని ఆకర్షించుసమయము. అట్టిసమయములో స్త్రీపురుషులలోగూడసంభోగచింతగలుగుటసహజము. శృంగారమునకు అధిదేవత యగు మన్మథుని పూజించు సమయమది. అట్టి మన్మథ స్తోత్రగీతములతో కూడిన ఉల్లాస నృత్యమే 'కౌరంగి' నృత్యము. ఇప్పటికీ ఉత్తరహిందూస్థానమున స్త్రీలు వసంతఋతువు ఆరంభములో అందరూ పసుపువన్నెచీరెలు, రవికలు ధరించి ప్రకృతి గీతములు పాడుచూ, నృత్యమాడుచూ వసంతుని ఆరాధింతురు.

## ౪. ఛురిత లేక చలిక నృత్యము

కాళిదాసు కాలములో మన దేశములోని కళను రెండు విధములుగ చెప్పవచ్చును. దేవళములలో కేవలము దైవసంబంధమై, దేవదాసీలచే చేయబడునది 'మార్గి' నృత్యము. సంగీత సాహిత్య తర్కశాస్త్రములయందు ప్రావీణ్యము సంపాదించి రాజసభలయందు తమ పాండిత్యము వెల్లడిచేసి గౌరవముపొందిన గణికలనృత్యమే 'దేశి' నృత్యము. ఈ దేశినృత్యము రెండువిధములు: (1) ఛురిత లేక చలిక నృత్యము. (2) యావరిత నృత్యము.

కాళిదాసుని 'మాళవికాగ్నిమిత్ర' నాటకములో మాళవిక నాట్యగృహములో రాజు ఎదుటచేసిన నృత్యము చలిక నృత్యమే. ఇది నాయికా, నాయకుల పరస్పరానురాగము తెలుపునట్టి నృత్యము. ఈ నృత్యములో పాడబడు గీతము నాలుగు పాదములుగలదై ఉంటుంది. అభినయించెడి నర్తకి మొదటి రెండుపాదములలో శాస్త్రము పఠించి మిగిలిన రెండుపాదములలో అతి చమత్కారముగా, అన్యులకు తెలియనట్లుగా, తన మనస్సులోని కోర్కెను రాజునకు తెలియబరుస్తుంది. ఇదే చలిక నృత్యము.

ఉదా:—మాళవికాగ్నిమిత్రములోని శ్లోకము - నాయిక ప్రోషిత భర్తృక అనగా తనపతి దేశాంతరమున నుండగా ఆ వియోగమునననుభవించుచున్న స్త్రీయని అర్థము.

"మర్లభహప్రియోమే తస్మిన్ భవహృదయనిరాశం
అహో ! అపాం గోమోపరస్ఫురతి-కి మపి-మహః
యేష సచిర దృష్టహ కథం పునరుపనేత వ్యహః కలిక్ష్
నాథహరాం పరాధీనాం త్వయిగణయః సతృష్ణాం

(దీనిమాతృక పాలిభాషలోనున్నది. ఇది దానికి సంస్కృత తర్జుమా)

హృదయమా ప్రియునికొరకు తహ తహ పడకుము. అతని గూడు ఆశ వదలుకో. అహో ! ఎడమ కన్ను అదరుచున్నదే !

పై శ్లోకముయొక్క మొదటిరెండు పాదముల అర్థమిది. అనగా ఈ రెండు పాదములలో ప్రోషితభర్తృకయొక్క నిరాశా హృదయ మును గూర్చి తెలుపబడినది.

"ఇక ఈ ఎడబాటును సహించలేను. మరల అతనిగూడు పెట్లు దేవా నిస్సహాయతనై యున్నాను. నిన్నుగూడ నామనస్సు కొట్టుకొను చున్నది. నన్ను నీ దానిగా చేపట్టుమా !

మిగిలిన రెండుపాదముల అర్థము పైన చెప్పబడినది. నర్తకి ఈభావము నభినయించునపుడు తన హృదయములో దాగియున్న కోర్కె అన్యులకు తెలియకుండ రాజుకు తెలుపుతుంది. ఇతరులకు ఇది కేవల మొక పాదముయొక్క అభినయమే. ఇట్టిదే 'చలిక' నృత్యమనబడును.

జకారి, మత్తావలీ తురుష్క సాంప్రదాయము ననుసరించి చేయబడిన నృత్యములు.

## ౫. జ కా రి క

పూమాలలతో నలంకరించుకొని పూగుత్తుల చేకొని ప్రకృతి గీతముల పాడుచూ కేవలము హృదయ రంజకముగానుండు హావ భావములతో (అనగా కొంత వరకు మనుష్యునిలోని పశుత్వము (Senses) తృప్తి పరచుటకు చేసెడి నృత్యము.

## ౬. మత్తావళి

మితిమీర మద్యముసేవించి, ఆ నిషాలో తురుష్కులు, ప్రేక్షకులు సిగ్గుపడునట్లుగా చేసెడి నృత్యము.

పైన వర్ణింపబడిన ఆరువిధములైన నృత్యపద్ధతులు ప్రాచీనమైనవి.

# దేవదాసి

ఆర్యుల కాలములో సంఘము నాలుగు భాగములుగా విభజింప బడినది. సంఘముయొక్క ఆచార వ్యవహారములునూ, ప్రజల యోగ క్షేమములునూ చక్కగా కొనసాగుటకై వారు చేసుకొనినదే ఆ ఏర్పాటు. దాని ననుసరించి వారిలో దైవారాధనాది కార్యముల యందు నియమితుడైన వానిని బ్రాహ్మణుడనియు, శత్రువుల బారినుండి ప్రజలను రక్షించు భారమును వహించినవాడు క్షత్రియుడనియు, ప్రజలకు వలయు ఆహారపదార్థములను ఉత్పత్తిచేయుటయందు నిమగ్నుడయిన వానిని శూద్రుడనియు, సంఘముయొక్క సంపదను వృద్ధిచేయుటయే ఆదర్శముగాగలవాడు వైశ్యుడనియు పేర్కొనబడిరి. ఆనాడు నాలుగు జాతులవారును ఒండొరులపై నాధారపడి అందరూ సంఘక్షేమమే జీవితాదర్శముగా నెంచి, హెచ్చుతగ్గులులేక సమానతా, సౌభ్రాతృత్వములతో ప్రశాంతజీవితముల గడుపుచుండిరి.

భరత శాస్త్రమునందు తెలుపబడిన రంగులను బట్టికూడా ఈ నాలుగు వర్ణములవారి స్వభావమును తెలుసుకొనవచ్చును.

సాత్వికత, శాంతము, స్వచ్ఛత, నిర్మల హృదయము, నిశ్చల భావము- ఇట్టి సౌశీల్యముల తెలుపజాలినది 'తెల్లని' రంగేకదా? అట్టి గుణములు కలిగియుండువాడుగనుక బ్రాహ్మణుని తెలుపురంగుతో సరిపోల్చిరి.

శౌర్యము, ఉత్సాహము, ఉద్రేకము, గంభీరత, పౌరుషము, క్రోధము-ఇట్టి గుణములను సూచించునట్టి రక్తవర్ణముతో క్షత్రియుని పోల్చిరి.

లోహములన్నింటిలోను విలువగలదిబంగారము. ప్రజలసంపదను పోషించువాడు వైశ్యుడు. గనుక అతనిని బంగారువన్నె (పసుపు రంగు) తో పోల్చిరి.

కాలక్రమమున సంఘాభివృద్ధితో బాటు తెగలునూ పెరిగి పోయినవి. అందుచేతనే శూద్రులలో అనేక తెగలు ఏర్పడినవి

(కమ్మరి, కుమ్మరి, కంసాలి, సాలి మొదలైనవి). కనుక వీరిని ప్రత్యేకముగా ఒక రంగుతో పోల్చలేదు.

ఆర్యులకు దైనిక కృత్యములలో దైవారాధన ముఖ్యమైనది. యజ్ఞయాగాదులలో సృష్టికి కారణమైన పంచ భూతములను, పృథివ్యాప స్తేజో వాయురాకాశములను గీత వాద్య నృత్యములతో ఆరాధించెడివారు.

లలితకళలు క్రమముగా అభివృద్ధవసాగినవి. బౌద్ధయుగారంభము నాటికి దేవాలయ నిర్మాణమునందు శిల్పకళానైపుణ్యము చక్కగా విరాజిల్లినది. నృత్యగానములు గూడ అభివృద్ధిపొందసాగినవి.

వారి నిత్య కృత్యములలో నృత్యకళ ఒకటిగానుండినను, నాడు ఆలయములలో నృత్యపూజకై 'దేవదాసీ' లను వారిని ప్రత్యేకముగా ఏర్పరచిరి. వీరు ప్రత్యేకముగా ఒక తెగగాదు. అన్ని కులములవారును తమ బిడ్డలను ఆలయములలో నృత్య పూజార్థము భగవంతునికి అర్పించుట విధ్యుక్త ధర్మముగానెంచిరి. ప్రాపంచిక విషయవాంఛలను పరిత్యజించి, నృత్యవిద్యాభ్యాస మొనర్చి పరమేశ్వరు నర్చించుటయందే జీవితముల ధారపోయుటకై దేవదాసీలను సృజించిరి. మొదట ఈ దేవదాసీలు అవివాహితస్త్రీలగుటచే వారికి సంతతి యనునది లేక 'దేవదాసీ' తెగయని ఏర్పడలేదు. కాలక్రమమున వారును వేశ్యలవలె జీవించ మొదలుపెట్టిన పిమ్మట వారూ వారిసంతతి ప్రత్యేక తెగగా ఏర్పడినది. దేవదాసీ శిక్షణ ఒక నియమితాదేశాను సారముగా జరుగుచుండెడిది.

దేవదాసీగా చేయబడిన బాలిక ఐదవ ఏటనే దేవళమునకు గొని పోబడును. ప్రపంచ మననేమో తెలియని ఆ చిరుతప్రాయమునందే ఆ బాలిక మనసును ఆధ్యాత్మిక చింతలయందు మరలజేయుదురు. దేవదాసీ నిర్ణయములో మనపెద్దలు ఊహించినదెంత దివ్యపథమో చూడండి.

ప్రాతఃకాలమున ఆ బాలిక స్నానముచేసి పసుపు వస్త్రములు ధరించును. తలిదండ్రులామెను దేవాలయమునకు తీసుకొనిపోయెదరు.

నాడు దేవాలయము ఉత్సవ సమయమందు వలె కలకలలాడుచుండును. మేళతాళములతో నెటజూచినను మంగళధ్వనులే మారు మ్రోగు చుండును.

పూజవేళ సమీపించినంతనే ఆ బాలిక దేవుని యెదుట నిల బడును. దేవునిముందు తెర వేయబడి యున్నది. పూజారుల స్తోత్ర మంత్రములు వినబడుచున్నవి. హారతివేళ – తెరతీయబడినవి. నగారా నాదము వినిపించును. భక్తులు గణగణమని గంటలు మ్రోగించుచు, భక్తితో చేతులెత్తినమస్కరించుచున్నారు. కొందరు స్తోత్రగీతములతో దేవునికి తమ భక్తినైవేద్యముల నివేదించుచున్నారు.

కాళ్ళయందలి కంచుమువ్వలు ఝణఝణారవములు చేయ నొక కోమలి దేవాలయ ప్రాంగణములోనికి వచ్చినది. పూజారులు కుంభ హారతిని దెచ్చి, ఆమెచే తాకించి దేవునికి హారతి ఇచ్చుచున్నారు.

"ఝణ ఝణాం ఝణ ఝణ"మని గజ్జెలు మధుర ధ్వనులు చేయ మేళవించిన మహతీ నాదమందు తన మేలి కంఠముజేర్చి భక్తి గీతముల పాడుచు దాని అర్థమును నిజహస్తముల నభినయించుచు, రసభావములను నేత్రద్వయమున నెఱుకపరచుచు, పాదములతో తాళ లయల తెలుపుచు నిర్మలభావావేగమున భక్తి భావపూరితమైన మనసుతో పరమహంసవోలె ఆదేవదాసి దేవుని ఎదుట నృత్యము చేయుచున్నది. ఆ నృత్యమును వీక్షించుచున్నవారందరూ విస్మృతాత్మా నంద వీచికల తేలియాడుచు తన్మయత్వము నొందుచున్నారు. వారు మాయా వ్యామోహబంధితమైన జగత్తును మరచి శాశ్వతానంద సంధాయియగు పర్వేశ్వరునెదుట నున్నట్లే తలచుచున్నారు.

దీనినంతనూ చూచుచున్న ఆ చిన్నారి ముద్దుబాల ఏమియో తెలియరాని మనసుతో స్తంభమువలె కదలక మెదలక నిలుచుండి యున్నది.

పూజారి దేవుని పాదములకడనున్న మాంగళ్యమును తీసుకొని వచ్చి మనలో పెండ్లిసమయములో వలె ఆ చిన్నబాలిక మెడలో కట్టును. నాటినుండి ఆమె ఆ దేవదేవునిపాలిట దేవదాసి. ఆ జగ

న్నాథుడే ఆమె నాథుడు. ఆ సర్వేశ్వరుడే ఆమె ప్రాణేశ్వరుడు, ఆమె జీవిత మా నాథుని సేవించుటలోనే అంతమొందును.

ఇక నృత్యపూజచే పతిని సేవించి తరించవలెనని ఆ బాలిక నేలపై గుండ్రముగా వేయబడిన వస్త్రపై నిలువబడినది. సకలశాస్త్ర విశారదుడగు నాట్యాచార్యుడు ఆమెచే—

'తా, తెయ్; తా, తెయ్' అని తొలి అడుగులు వేయించును.

మానవుని హృదయము నిర్మలమైయున్నప్పుడే భావ ప్రకటనయూ పవిత్రమై యుండగలదు. స్వచ్ఛమైన నడవడిక కలవాడే స్వచ్ఛమైన హృదయము కలిగియుండును. విషయలంపటునకు పవిత్ర హృదయమెటనుండి వచ్చును.

పవిత్ర హృదయము పూజ్యభావము-సద్వర్తనము-సౌశీల్యము-ఆధ్యాత్మిక చింతల నలవరచుకొనవలసిన దేవదాసికి, దానికనుకూలమైన వాతావరణమునందు శిక్షణ యివ్వబడుచున్నది.

శరీరమును శూలములతో పొడుచుచున్నట్లనిపించు చలికాలమునందు అరుణోదయమునకు ముందు ప్రకృతి ధరణియను ఉయ్యాలలో తన పాపలనుంచి, లాలిపాటలతో నిదురబుచ్చినదో యనునట్లు జీవకోటి సర్వస్వము మైమరచి నిద్రించుచున్న సమయమున దేవదాసిగా చేయబడిన ఆ బాలిక నిదుర మేల్కాంచి నిత్యకృత్యముల నెరవేర్చి తనయందలి రజతమోగుణముల నిర్మూలించుటకు మనోనిగ్రహము నలవరచుకొను సాధనముల నభ్యసించును. రాత్రియంతయు మంచులో నుంచబడిన ఝల్లుమనుచున్న మట్టికుండను కొంతసేపు తనబిగికౌగిలిలో నుంచుకొనును.

కామక్రోధాది యరిషడ్వర్గమునకు నిలయమైన శరీరమును, మనసును స్వాధీనమందుంచుకొనుటకై ప్రాణాయామ యోగాభ్యాసములను ఆమె చేయును. కష్టతరములైన లలాటతిలక, శకటాస్యములవంటి నృత్యములను చేయవీలగునట్లు తన శరీరమునందలి ప్రతి అవయవమును స్వాధీనమందుంచుకొనుటకై శరీరవ్యాయామమును చేయును.

సూర్యోదయమైనది. దేవాలయమునందుండి నాగస్వర మంగళ వాయిద్యములు వినబడుచున్నవి. దేవదాసి దేవాలయమునకు వచ్చినది. నాట్యాచార్యు డుపదేశించుచుండ సహాధ్యాయులతో బాటు నృత్యము నభ్యసించుచున్నది. ఇటు లామె ప్రతిదినము తన విధ్యుక్త ధర్మము నెరవేర్చుచునేయున్నది. కాని విగ్రహరూపియగు ఆమె నాథు డొక్క నాడైనను ఆమెను పలుకరించ డది ఏలకో? తన మనసులోని పరితాప మును దీర్చుట గురువునకు గాక అన్యులకు సాధ్యమా? కాని తన నాథు డంత సులభముగా పలుకడట. అతనిని పలుకరించుటకు ఆమె యింకను పరిశ్రమించవలెను. మరికొంత తపస్సు చేయుచుండవలెను. నానాటికీ ఆమె మనసు నాథునందే, నాథుని ప్రీతి కొనర్చు నాట్యవిద్య యందే లగ్నము గాజొచ్చినది. ధ్యానముతో ఆధ్యాత్మిక పరివర్త నము గూడ పెంపొందసాగినది. విగ్రహము యెదుటనున్నప్పుడు తన నాథు డచట కదలినట్లు ఆమెకు తోచెడిది. అతడేమో మాట్లాడ బోయినట్లు అనిపించును. కాని మాటలాడక ఏల నిలచెనో? ఇంకను ఎంత కాలమునకు నాథుడు తనపై కరుణించునో?

నృత్య విద్యాభ్యాసము పూర్తియగుచున్నది. ఆమె మనోవీధి యందు ఎల్లప్పుడును నాథుని రూపమే నాట్యమాడుచుండెను. ఎటు జూచినను తన నాథుడే – తన జన్మకారకులైన తలిదండ్రులతోగాని, ప్రపంచాభివృద్ధికి హేతువులైన సాంసారికేచ్ఛలతోగాని ఆమెకెట్టి సంబంధములేదు. నాథుడే తన సర్వస్వము. విశ్వమునం దేదిచూచినను నాథుని రూపమే కన్పడుచుండెను. అతనిని విడిచియుండు టెట్లు?

నాడు శుద్ధపూర్ణిమ. నాథుని సంసేవనార్థము దేవాలయమున కేతెంచిన ఆ దేవదాసి ముఖమునుచూచి సిగ్గుతో మేఘాలమధ్య దాగుకొన్నాడు చంద్రుడు. స్నానముచేసి పసుపురాసుకొనిన ఆమె శరీరము మెరుగుపెట్టిన మేలిబంగారుకాంతుల పరిహసించుచున్నది. ఆమె అవయవశోభ కట్టియున్న పుట్టములలోనుండి మెరయుచుండ చూచి వెలవెలబోవుచున్నవి మింటనున్న తారలు. నల్లకలువలను ధిక్కరించు ఆమె కన్నుగవ తీర్చి దిద్దిన కాటుకచే మరింత వెలుగొందు చున్నవి. సర్వాంగసుందరి యగు ఆమె ప్రాణేశ్వరు ప్రేమాల పతాక

హస్తముల బట్టి సమభంగిమలో సమదృష్టినిలిపి నిలువబడినది. ఆమె కించుక దూరమున నాట్యాచార్యుడు, కుడివైపున తాళధారి, ఇరు పార్శ్వముల మృదంగీకులు, వారి నడుమ ఆమెననుసరించి గాయకులును, వారి వెనుక శ్రుతికారుడును నిలుచుండిరి.

కుంభహారతి ముగిసినది.

"తెయ్ తెయ్ తక్కిట తరికిట తెయ్
తెయ్ తెయ్ తక్కిట తరికిట తెయ్
తెయ్ తెయ్ తక్కిట తరికిట తెయ్"

నాట్యాచార్యునకు, మృదంగీకులకు నమస్కరించింది.

"నాహృదయ పీఠికపై నాట్యమాడు దేవా
నమస్తే నమస్తే నమస్తే" అంటూ

విగ్రహస్థితుడగు నాథుని ఎదుట నాట్యమాడ మొదలుపెట్టింది. నాట్యాచార్యులా గీతముననుసరించిరి. భక్తి భావపూరితమైన ఆమె నృత్యము క్రమక్రమముగా విలంబితమునుండి మధ్య మధ్య ద్రుత లయలోనికి మారుచున్నది.

ఆమెనృత్యమునకు ఆనిశ్చలరూపియగు భగవంతుడు చలించాడు. ఆమె కన్నుల ఎదుటనున్న విగ్రహము అదృశ్యమైనది. ఆ స్థానమున ఇంతకాలము తానెవరికై అహోరాత్రములు పరితపించుచుండెనో, ఏ విశ్వమోహన మూర్తికై తన సర్వస్వము ధారవోసెనో, ఏ దివ్య రూపుని తా దర్శింప దలచెనో అట్టి లావణ్యమూర్తి, సర్వాంతర్యామి తన నాథుడు తన్ను చేర పిలచెను. ఆనందాతిశయమున తన్మయురాలై నృత్యము చేయుచు ఆమె నాథునెదుట ప్రణమిల్లెను. నాథుని చేరుకొన్న ఆ జీవాత్మ ఆ భౌతికశరీరములోనికి తిరిగిరాలేదు.

హిందువులు ధర్మపరులు. అధర్మము, అవినీతి సంఘ వినాశన మునకు దారితీయునని, అవి మానవజాతినే నిర్మూలించగల దుష్ట శక్తులనియు వారి నమ్మకము. అందుచేతనే వారు మనుష్యునిలో

పశుత్వమును ప్రకోపింపజేయు కళను బహిష్కరించారు. అట్టి ప్రదర్శనములు చూచుట పాపమని తలచారు. సంఘసేవాభివృద్ధులకు తోడ్పడునట్టియు, మానవుని సన్మార్గమున నడుపునట్టియు, అతనియందు ఆధ్యాత్మిక శక్తిని కలిగించునట్టియు నైన కళనే వారు పోషించారు. అందుచేతనే రసభావములతో కూడుకొనిన కళను ఒక్క దేవదాసీలే అభ్యసించేవారు. దేవాలయములందు వారు నృత్యముచేసేవారు. ఆ నృత్యమును చూచిన ప్రజానీకము పవిత్రహృదయములతో మనస్సును ఆధ్యాత్మిక దృష్టియందు మరలించేవారు. ఈ విధముగా దేవదాసీలు తమనృత్యకళతో దేవారాధన చేయుటయేగాక, సామాన్య ప్రజానీకమును సద్వర్తనాపరుల జేయుచుండిరి.

సంగీత, తర్క, వేద, ఉపనిషదాది శాస్త్రములను ఎఱిగి రాజ సభలను అలంకరించిన గణికలు దేవదాసీలుకారు.

కాలక్రమమున దేవదాసీలలోకూడ మార్పుకలిగింది. వారు తమ ఆదర్శములను మూలత్రోశారు. ప్రాపంచికేచ్ఛలపై దృష్టిసారించారు. నాటినుండి దేవదాసీకి, సామాన్య వెలయాలికి భేదములేదు. అపవిత్ర జీవితములను గడుపువారి నృత్యకళనుగూడ హేయముగా చూడసాగిరి. ఆనాడు మానవుని ఆధ్యాత్మికానువర్తిగా నొనరించిన ఆ దేవదాసీలు, ఈనాడు అతనిని కామపిపాసిగావించి అధఃపతితు నొనరించేరు.

దేవదాసీలు శివదాసీలు, విష్ణుదాసీలు అను రెండు విధములు. శివాలయములు తమిళదేశమున ఎక్కువగా నుండుటచే శివదాసీలు దక్షిణమున ఎక్కువ నున్నారు.

బసవిరాండ్రకు శివదాసీలకు చాలభేదమున్నది. బసవిరాండ్రు కొన్ని ప్రదేశములలో గణాచారులుగా నుందురు. వీరికి నృత్యకళతో సంబంధములేదు.

బంగాళము, మొదలగు ప్రదేశములలో వైష్ణవమతము విరివిగా వ్యాపించుటచే అచ్చటవారందరూ విష్ణుదాసీలు. విష్ణుదాసీల నృత్యము

నవరసభరితమై, భక్తియోగమువలె సామాన్య మానవునికి సులభగ్రాహ్యమై యుంటుంది.

శివదాసీల నృత్యము జ్ఞానయోగము వంటిది.

"ఏమాటలాడిన నీ మాటలేగాని యెంతచెప్పిన

ఎదురాడమురా.

తామరసాక్షి నీవెపు డొత్తువో యని తలవాకిలిల్లుగా

నిలచియున్నది."

ఇట్టిపదములందలి భావమును ఇతరుల కర్థమగునట్లు సులభముగా నభినయించవచ్చును.

"ఆనంద నటన మాడినార్

సచ్చిదానంద నటన మాడినార్."

దీనియందలి భావము అభినయింపవలెనన్న ఈశ్వరుని సప్త తాండవములను తెలిసికొనవలెను. ఈశ్వరుడు సృష్టినిచూచి ఆనంద పరవశుడై చేసిన నటనమే ఆనందతాండవము. జీవకోటియొక్క చలనమును స్వాభావికముగను, ఇతరుల కర్థమగునట్లును అభినయింపవలెనన్న నర్తకి ఎంతటి నేర్పును కలిగియుండవలెనో గ్రహింపవచ్చును.

కళకే జీవితము సంకితముచేసి కళను మహోన్నతస్థితికి తెచ్చినది దేవదాసి. తాను నాథునిగా పరిగ్రహించిన పరమేశ్వరుని జూచినపుడు కనులనుండిరాలు ఆనందాశ్రువులతో అతని నభిషేకించి, నేత్రపుష్పములతో పూజచేసి, జ్ఞానాగ్నియందు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులను ధూపమొనర్చి తన శరీర సర్వస్వమును నివేదన మొనరించి తరించెడి ఆ దేవదాసీ రూపము కనులయెదుట చిత్రించుకొనినచో ప్రాచీన భారతీయుల ప్రాభవము వ్యక్తముకాగలదు. వారివలె కళాస్వరూపిణియైన ప్రకృతిని పవిత్రహృదయములతో పూజించిననాడే కళలు సముజ్జ్వలమై విలసిల్లగలవు.



# శివతాండవము

భరతనాట్య విధానములో శివతాండవము మిక్కిలి ముఖ్యమైనది. శివతాండవమునుగూర్చి చక్కగా తెలిసికొన వలయునన్న కేవలము ఆచరణ విధానమును గూర్చియేగాక దానియందలి గర్భితార్థమును తెలిసికొనుట అత్యవసరము.

సృష్టి, స్థితి, సంహారము లను మూడుశక్తులను హిందువులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులరూపమున పూజించుచున్నారు. సృష్టికర్త బ్రహ్మ; సృష్టినిరోధకశక్తులహతమొనరించువాడె విష్ణువు. కనుకనాతడు

"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే"

దుష్టశిక్షణ, శిష్టరక్షణలకు దశావతారములు దాల్చినాడని పురాణములలో చెప్పబడినది.

సృష్టిని అంత మొందించు మహాశక్తియే రుద్రుడు. కైలాసమాతనివాసము. పార్వతి యాతని పత్ని. వృషభ మాతని వాహనము. వ్యాఘ్రాజిన మతని వేషధారణము. మెడలోని పాములే ఆతని ఆభరణ సర్వస్వము.

ఇట్టి మూర్తిత్రయమున కతీతమైన మహాశక్తియే విశ్వమును, సర్వమును తన యందు యిముడ్చుకొనును, తననుండి వెలివఱచును.

ప్రపంచమును సృష్టి యొనర్చుట, వృద్ధిపొందించుట ధర్మమార్గమున నడుపుట, అంతమొనరించుట, మరలతనయందు లీనముచేసుకొనుట అను ఐదుక్రియలనే త్రిమూర్తులచే ఈ మహాశక్తి నెరవేర్చును. ఈ క్రియాపంచకమునే ఈశ్వరుడు తన సప్తవిధ తాండవములలో ప్రదర్శించును.

శంకరుని తాండవము ఏడువిధములు – ఆనంద తాండవము, సంధ్యా తాండవము, కలిక తాండవము, గజాసుర సంహారము, లేక విజయ తాండవము, ఊర్ధ్వతాండవము, ఉమా తాండవము, సంహార తాండవము.

## ౧. ఆనందతాండవము

సృష్టిని జూచి ఆనందమును వెలిబుచ్చుచు శర్వుడు ఆనంద తాండవము నాడును.

'ఢమఢమత' యని అతని కుడిచేతిలోని ఢమరు సృష్టికి కారణమైన నాదము పలుకుచున్నది. వామహస్తమున ప్రపంచ నిరోధక శక్తుల హాతమొనరించు అగ్ని ప్రజ్వరిల్లుచున్నది. మూడవచేతితో ధర్మమునకై పాటుబడి ప్రపంచ శ్రేయస్సుకు తమ జీవితాలను ధారపోసిన త్యాగ జీవులకు అభయ ప్రధాన మొసగుచున్నాడు. నాల్గవచేతి పతాక హస్తము విజయమును సూచించుచున్నది. సృష్టియందలి జీవకోటి యొక్క సంచలనమే ఆతని ఆంగికాభినయము. ప్రకృతిలోని వివిధ నాదములే ఆతని వాచికాభినయము. చంద్రతారలాతని అలంకార ములు. మానవుని చిత్తప్రవృత్తియే ఆతని సాత్వికాభినయము.

## ౨. సంధ్యా తాండవము

సృష్టి నిరాటంకముగ అభివృద్ధినొందుటను జూచి సంతసమున శంభుడు చేయు నృత్యమే సంధ్యాతాండవము.

పరమేశు నర్ధాంగి పార్వతి మణిమయ సింహాసనాధిష్టితయై యున్నది. ఇంద్రుడు మురళి నూదుచున్నాడు. విష్ణు మృదంగము, సరస్వతి వీణ, బ్రహ్మ తాళము వేయుచుండగా యక్ష గంధర్వ కిన్నర కింపురుషాదులు ఆనందముతో చూచుచుండ రుద్రుడు సంధ్యాతాండవ నృత్యము నొనరించును.

## ౩. కలిక తాండవము

ప్రపంచపరివృద్ధి నిరోధకములగు అజ్ఞానము, అవినీతి మొదలగు దుష్టశక్తులను హతమార్చి అఖండ జ్ఞానజ్యోతిని వెలిగించుటకు ఆ దుష్టశక్తుల చెండాడునప్పటి అంగచలనమే కపాలేశుని కలికతాండవము.

## ౪. విజయ తాండవము (గజాసుర వధ)

పూర్వము ప్రపంచముయొక్క శ్రేయోభివృద్ధులకు భంగము చేయగలుగు మంత్రశక్తులను కొందరు ఋషులు కలిగియుండిరి. వారితో వాదించి ఆ దుష్టశక్తులను హరించి వారిని సన్మార్గమున సంచరింపజేయ సమకట్టి అర్ధనారీశ్వరుడు ఋషిరూపమున అరణ్యములకు వెళ్ళెను. ఆ ముని లాతనిచే ఓడింపబడి, అతనిని పరిమార్చనెంచి హోమ కుండమున నొక క్రూర వ్యాఘ్రమును సృజించిరి. రుద్రుడాపులిని పట్టుకొని దాని చర్మమును తన చిటికెన వ్రేలి గోటితో నొలిచి తన నడుము చుట్టూ అలంకారముగ ధరించును. అంత ఆ ముని లొక కూౄర యురగమును సృష్టిజేసిరి. దానిని శివుడు మాలగా ధరించి నృత్యమాడ సాగెను. కడపట ఒక దుష్టశక్తి (గజాసురుడు) ఆ హోమకుండము నుండి శివునిపై కురికెను. దానిని తన పాదముతో త్రొక్కి, వెన్నెముక విరిచి దానిపై విజయ తాండవము చేయుచుండ దేవతలు చూచి ఆనందించిరి.

## ౫. ఊర్ధ్వ తాండవము

సృష్టికి కారణములయిన స్త్రీ, పురుషశక్తుల అంతఃకలహమే దీని యందలి అంతరార్థము.

తాండవమున గట్టివాడు శివుడు. లాస్యమున నేర్పరి ఉమ. తానే గొప్ప కళావేత్తనని శూలియు, "నేను చక్కగా నభినయించ గలనని" అంబయు వాదులాడుకొందురు. వీరి చిలిపిజగడము తీర్చుటకు యక్ష కిన్నర గంధర్వ కింపురుషాదులు, మహామునులు, అప్సరసలు – అందరూ కైలాసముపై గుమిగూడిరి.

ఉమాశంకరులిర్వురును పతాక హస్తముల బట్టి నిలువ బడిరి. ఉన్నట్లే ఉండి పళపళ ధ్వనులతో శర్వుడు నృత్యమాడ మొదలు పెట్టెను. ఘళ ఘళమని మృదంగము మ్రోగినది. తళ తళ మని ఆతని తలమీది చంద్రరేఖ మెరయుచున్నది.

విష్ణు మృదంగములో నృత్యశబ్దములను పలికించు చున్నాడు. బ్రహ్మ లయ వేయుచున్నాడు. సరస్వతి వీణ ఝుంకారించు చున్నది. ఇంద్రుడు మురళినూదుచున్నాడు. నారదుడు తంబుర మీటుచున్నాడు. 'ఢాం ఢోం' అను శంఖనాదములతో ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనించు చున్నది. ఇందిర ఆ నాదములో కంఠముచేర్చి పాడుచున్నది.

శివ పార్వతులు హెచ్చుతగ్గులు నిర్ణయింప నలవిగాని విధమున నృత్యము చేయుచున్నారు. ఈశ్వరుని నృత్యము గంభీరమై యున్నది. భవాని భావప్రకటన అతి మృదువుగానుండి నయనానందము గొలుపు చున్నది. వీరికి కొంచెము దూరములో నిలిచియున్న కుమారస్వామి వాహనమగు నెమలి శంకరునితో కలిసి అడుగులు వేయుచున్నది. సరస్వతి సమీప మందున్న మరాళము తన మందగమనమును సవరించుకొనుచున్నది. అప్సరసాదులు తమ నృత్యకరణులు, చారులు, రేఖలలోని దోషములను దిద్దుకొనుచున్నారు.

దంతిముఖుని యుదంతమో ? నాట్యశాస్త్రము చేకొని నృత్యము శాస్త్రోక్తముగ జరుగుచున్నదో లేదోయని అల్లన మెల్లని చూపులు చూచుచు, చల్లగా తొండమెత్తి శివుని జటలనుండి ప్రవ హించుచున్న గంగాజలమును గ్రహించి, పొంతనున్న సహస్రాక్షునిపై జల్లి, వినోదము ననుభవించుచు వెకిలినవ్వులు నవ్వుచున్నాడు.

నృత్యములో చండికకే విజయము చేకూరుచున్నది.
నృత్యమిపుడు సంహార తాండవములోనికి దిగింది.
అందునా అంబికయే గెలుచునేమో ?

శంకరుడు ఓడునట్లు గ్రహించెను. ఇక తానామెను ఓడించుట కష్టము. విష్ణు ద్రుతలయలో మృదంగము పలికించుచున్నాడు.

"కిడ్రదె త్ ధ్మేదడ్రద్రకిటతక
కిడ్రదె త్ ధ్మేదడ్రద కిటతక"

లక్ష్మి తిల్లానాలోని కడపటి ముక్తాయింపు పాడుచున్నది.

రుద్రుడు తటాలున ఒక కాలునెత్తి తలపైనుంచి ద్రుతమునుండి విలంబితమునకు లయమార్చి వికటముగా నృత్యమాడ మొదలు పెట్టాడు. (ఇదియే గౌరీశంకరుల ద్వంద్వనృత్యము-ఉమామహేశ్వరుల ఊర్ధ్వతాండవము) జగన్మాత అట్లుచేయలేక తననృత్యము నిలిపినది. ఈశ్వరుడే జయించెను.

## ౬. ఉమా తాండవము

దుర్గాశంకరు లా భూతగణములతోగూడి స్మశానవాటియందు నృత్యముచేయుచున్నారు. ప్రపంచమునందలి క్రియలను పరిసమాప్తి చేసిన శరీరములను వదలి జీవరాసులు ఒక్కొక్కటివచ్చి వీరిని చేరుచున్నవి. దుర్గ తనచేతియందలి ఎముకతో అచటి సమాధులపై తట్టును. పటపట ధ్వనులతో ఆ సమాధులు బ్రద్దలుచేసికొని అందుండి వెలికివచ్చిన జీవరాసులు ఆమెతోగూడ నృత్యములో పాల్గొంటున్నవి. దూరమున మండుచున్న చితులలోనుండి అనేక వెలుగులు లేచివచ్చి వారిని చేరుచున్నవి. ఆ నృత్యమునకు భూమి దద్దరిల్లుచున్నది. ధూళి మింటికెగయుచున్నది.

## సంహార తాండవము

విశాల స్మశానవాటిక మానవ జీవనావ సంసారసాగర తరంగములలో మునుగుచు, తేలుచు, కడపట చేరుకొనిన గమ్యస్థానము. దేహమునిండుగ విభూతియలదుకొని జడలుకట్టిన శిరోజములపై చంద్రకళనుధరించి పద్మాసనోపవిష్టుడైన పరమశివుడు ధ్యానముద్రయం దున్నాడు. చితులనుండి జీవకణములు లేచివచ్చి యతనియందు లీనమగుచున్నవి. మాయామోహముల బారినుండి జీవకోటిని విముక్తియొనరించి మరల తనయం దైక్యమొనరించుచున్నాడా సంహారతాండవమూర్తి పరమశివుడు.

సప్తతాండవములలో ఇది కడపటిది.

ఇట్లు సృష్టి స్థితి సంహార, అనుగ్రహ, తిరోధానములను పరమేశ్వరుని పంచకృత్యములను సూచించునదే శివతాండవము. ఊహాతీతమైన ఈ ఉత్తమనృత్యమును ప్రదర్శించుటకు కళారాధకుడు ప్రకృతిని పూర్తిగా అర్థముచేసుకొనవలెను. ప్రకృతియందాతడు ఐక్యము కాగలిగిననాడే ఈ మహత్తర నృత్యమందలి నిగూఢభావముల నెరుంగ గలడు. అప్పటికినీ కళారాధకుడు ప్రపంచబంధములనుండి విముక్తుడై ఆధ్యాత్మిక చింతానురక్తుడై పరమేశ్వరునకు ఆత్మార్పణము చేయ గలిగిననాడే అతడు తాండవనృత్యము చేయుట కర్హుడు. లేనిచో అతడు చేయు శివతాండవమునందు మనముచూచినది యిందు విశద పరుపబడిన భావములుగావు. తదన్యములు మాత్రమే. కావుననే ఈ నాటి ప్రఖ్యాత కళావేత్తలుగూడ పరమేశ్వరుని వేషధారణయందు పులిచర్మము కట్టవలసియుండ అది ప్రేక్షకుల కాకర్షణీయముగ నుండదని కావచ్చు చిఱుతపులి చర్మము ధరించుట.

ఉత్కృష్టమైన శివతాండవమును, నిర్దుష్టముగ చేయలేనపుడు తాము తలచినరీతిచేసి, నాట్యవిద్యాధినాధుడగు నటరాజునే వెక్కిరించిన వారగుచున్నారు. ఇది ఎంత హృదయ విదారకము! ఈ ముఖ్యవిషయమును ప్రతి కళారాధకుడును గ్రహించుగాక!



# భరతనాట్యము

మనదేశములోని ఈనాటి నృత్యకళను ఆరుపద్ధతులుగ విభజింప వచ్చును. అన్ని పద్ధతులకు ఆధారము భరతశాస్త్రమే అయినను, ఆయా ప్రదేశములనుబట్టి, ప్రజలనుబట్టి భావప్రకటనలోను, పేర్లలోను, ప్రదర్శనములలోను కొంత మార్పు చెందినది.

దక్షిణమున భరతనాట్యమనియు; ఆంధ్రదేశమున 'కూచిపూడి' నృత్యమనియు; మణిపూరు, బెంగాల్, అస్సాములలో 'మణిపురి' నృత్యమనియు; మలబారులో కథకళీ నృత్యము, మోహినీ ఆట్టమనియు; ఉత్తరహిందూస్థానములో కథక్ నృత్యమనియు, సిరైకేలాలో చవ్వ నృత్యమనియు - (Mask Dance) ఈ విధముగా వేరువేరుపేర్లతో మన నృత్యకళ పిలువ బడుచున్నది. భరతనాట్యమును గూర్చి ఈ క్రింది శీర్షికలలో చెప్పబడును.

భరతఋషిచే రచింపబడిన నాట్యశాస్త్రము ననుసరించి చేయ బడిన నృత్యము గనుక భరతనాట్యమనియు, భారతదేశ నృత్యకళ గనుక భరతనాట్యమనియు చెప్పెదరు. భ అనిన భావము, ర అనిన రాగము, త అనిన తాళము—భావ రాగ తాళములతో కూడిన నాట్యము భరతనాట్యమనియును చెప్పవచ్చును.

దక్షిణదేశ భరతనాట్యమును, తంజావూరు నృత్యము, దాసి ఆట్టము లేక దేవదాసీ నృత్యము అను రెండు విధములుగా చెప్పవచ్చును.

మన పూర్వులు చెప్పిన మార్గి నృత్యమును (దైవికమై దేవళములలో భగవంతుని ముందు చేయునది-దేవతల యొక్క నృత్యము) పూర్వకాలపు దాసి ఆట్టముతోనూ; దేశి నృత్యమును (వినోదార్థము రాజాస్థానములయందు, సభలయందు మొదలగు ప్రదేశములయందు చేయునది) తంజావూరు నృత్యముతోనూ పోల్చవచ్చును.

భరతనాట్యము లాస్యనృత్యము. లాస్యము సుకుమారమైనది. ఇది స్త్రీలు చేయు నృత్యము.

భరత నాట్యములో సాధారణముగ ఒక స్త్రీ పాల్గొనును (Solo). ఇందులో నటుడు నర్తకియొక్క గురువు. ఆమె నాయికాభినయము చేయవలసి వచ్చినప్పుడు గురువు చెలికత్తెగా అభినయించును. ఇతర సమయములలో నృత్యమునకు కావలసిన గీతములను వెనుకపాట పాడును.

అలరింపు, జతి స్వరము, శబ్దము, వర్ణము (తానవర్ణము, పదవర్ణము, స్వరజతి), పదము, తిల్లాన అను ఆరు భాగములుగా భరత నాట్యమును విభజింపవచ్చును.

## ౧. అలరింపు

నేటికాలములో ప్రతి భరతనాట్య ప్రదర్శనము 'అలరింపు' తో ప్రారంభింపబడుతుంది. అలరించుట అనగా పుష్పించుట లేకవికసించుట. ఈ నృత్యము ఆరంభములో చేయబడునుగనుక దీనిని ప్రార్థననృత్యముగా గూడ పేర్కొంటారు.

## ౨. జతిస్వరము

చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణ, అని దక్షిణాది తాళములు ఐదుజాతులు. చతురశ్ర అనగా నాలుగు అక్షరములుగలది. త్రిశ్ర అనగా మూడు అక్షరములుగలది. మిశ్ర అనగా ఏడక్షరములు గలది. ఖండ అనగా అయిదక్షరములు గలది. సంకీర్ణ అనగా తొమ్మిది అక్షరములు గలది.

| | చతురశ్ర | | త్రిశ్ర | | మిశ్ర | | ఖండ | | సంకీర్ణ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తాళజాతులు ౫ — | దగిణత | + | గిణత | + | తకదరిగిణత | + | తధిగణత | + | తకదికి తరిగిణత |

ఒక జాతికిచెందిన తాళముతో నృత్యముచేయుచు, ఇతర గాతి నడకలు ఆ తాళముతో చేర్చిన అది ఆదిజాతిస్వర మనబడును.

సపదప । గరిసరి । గ౽ గరి । గపదప
ఈ చతురశ్రజాతి స్వరములపై నృత్యముచేయునప్పుడు దానిలో

సరిగ | రిగప | గపద – 'తిశ్ర జాతినడక'

సరిగరిగ | రిగపగప | గపదపద – 'ఖండజాతి'

సరిగరిగరిగ | రిగపగరిగప | గపదపగపద – 'మిశ్ర జాతి'

సరిగరిసరిగపద | రిగపగరిగపగప | గపదపగపదసద – 'సంకీర్ణజాతి'

జతి

తద్దీనుతధిమి – ధీనుతదిమి
తకధీనుతధిమి – ధీనుతధిమి
తద్దీనుతధిమి – తాహాత జంతరి
ధీనుతధిమి – తాహాత జంతరి
తకధీనుతధిమి – తాహాతజంతరి
ధీనుతధిమి – తాహాతజంతరి
తద్దీనుతధిమి – తకధీనుతధిమి
తద్దీనుతధిమి – తక్కడతక తరికిటతోంన్ (3)

తద్దీనుతధిమి – త
తకధీనుత ధిమి – త
తకదణ తోం – తకదణ తోం – తకదణ తోం
ఇట్టి మృదంగ శబ్దముల కూర్పు 'జతి' యనబడును.

ఈ పై చెప్పినలాంటి స్వరములను చేర్చి నృత్యముచేయుట జతిస్వరము. ఇది రసభావములు లేక కేవలము తాళ లయల ననుసరించి చేయునటువంటి నృత్తము. తాళలయలకు సరిపోవునట్లు నేత్రములను, తల, కంఠము, చేతులు, కాళ్లు మొదలగు అవయవములను కదిలించుట జతి స్వరము.

భావ ప్రకటనకు (అభినయమునకు) ఆధారమైనటువంటి అంగములు, ప్రత్యంగములు, ఉపాంగములు, (కళ్లు, శిరము, కాళ్లు, చేతులు మొదలైనవి) తాళమునను సరించి, వానికి కొంత వ్యాయామ మిచ్చి, వానిని తమ స్వాధీనములో నుంచుకొనుటకుగాను కళాప్రదర్శకులు అభినయమునకు మున్ముందు ఈ జతిస్వర నృత్యము చేయుదురు.

## 3. శ బ్ద ము

అలంకరింపు, జాతిస్వరముల చేయునప్పటికి నర్తకి కొంచెము అలసిపోవును. ఆమెకుకొంచెము విశ్రాంతినిచ్చుటకుగాను శబ్దనృత్యము చేయబడును. ఎక్కువ భావప్రకటన అవసరములేనటువంటి చిన్నపాటలు ఈ శబ్ద నృత్యములో అభినయింతురు. సాధారణముగా కృష్ణుడు మొదలగు దేవతలయొక్క జీవిత వర్ణనా గీతములు ఇందులో పాడబడును.

మోహన - అటతాళం

ఉదా:—బాలగోపాల మా ముద్ధర - కృష్ణా పరమ కల్యాణ గుణాకర

అ. పల్లవి:—నీరద నీల కళేబర - కృష్ణనిరుపమ కౌస్తుభ కంధర

౧. నందనందన భక్తచందన - సురబృందరచిత బహువందన
మందస్మిత సుందరానన - కోటిమదన సుందర జగన్మోహన
ఇందిరా మందిర - భక్తసుందర హృదయార విందా
భృంగ భక్త మకరంద - నందిత గోపిక బృందా

౨. తాం తావాత్తై దత్తతాం - దక్కతోదిమ్మిణా
గిణతో దిమ్మిరే - తకత్తో ధిమ్మి ధిమికిటతో
ధిమ్మిరే - తక్కతోదిగిణాం గింగిణత్తోం
గత్తిరుతోంగ - దిర్గుడు దదికి తకిట
దధిగిణతోం ॥ - బాలగోపాల

## ४. వర్ణము (పదవర్ణం, తానవర్ణం, స్వరజతి)

పదవర్ణం:—ఒక భావమును పదములతో వర్ణించుట లేక స్పష్ట పరచుట పదవర్ణ మనబడును.

ఉదా:—వనజాక్షిరో వాని సరసకు రమ్మనే - అను గీతము పాడునప్పుడు

దీనిలోని విరహోత్కంఠిత నాయికభావమును పోషించుటకు ఇతర సహాయములు కల్పించి ఆ భావమును స్పష్టపరచుట.

విశదీకరణ (Explanation)

'వన జాక్షిరో వాని సరసకు రమ్మనే' అను పదమును అభిన యించుచున్నారను కొందము ఇట నాయిక విరహోత్కంఠిత. అతను సరసకేల రావలయును.

'ఈ మారుని వెతనే సయిపతరము విను'-మారుని బాధసహించ లేను గనుక రమ్మనవే.

'దురుసుగ అరణికి శరములు నిరతముకురియగ నా తరమా'

మన్మథుని పూబాణములను నాపై ఆపక అటులవేయుచుండగా ఒంటరిగా జీవించుట నా తరమా ? కనుక ఓ చెలి అతని నాయొద్దకు రమ్మనవే !

మరియు

"ఈ మలయ మారుతము - ఇదియ వేళనుచు
చిలుకలు కలకల మనుచును కూయగవిని తాళవశమ"

మలయ మారుతము హాయిగా వీస్తూంది. చిలుకలు కలకలమని కూస్తున్నాయి. ఇట్టి సమయములో నా ప్రియుని వదలివుండగలనా ? కనుక ఓ సఖి వానిని నన్నుగూడ మనవే !

ఇటుల పాడిన పాటయొక్క భావము నభినయించును. దాని స్వరములపై నృత్యము చేయబడును. ఈ విధముగా ఒక భావమును సృష్టి పరచుటకు గాను దాని కనుగుణముగా అనేక విధములైన పదములతో దానిని వర్ణించుట పదవర్ణము. ఇది నృత్త (భావములేనటువంటి అంగ చలనము) అభినయములతో కూడియున్నను దీనిలో అభినయము ప్రాముఖ్యత వహించును.

తానవర్ణము:—ఇందు స్వేచ్ఛా హస్త ప్రయోగము గలదు. ఒక భావమును ముందుపాడి దీనినే స్వరములలో వర్ణించుట తానవర్ణ మనబడును. ఇది పదవర్ణము కంటె బహుకష్టమైనది.

'వనజాక్షిరో ఈ విరహమోర్వజాల' అని ముందు అభినయించి ఆ విరహోత్కంఠితయొక్క విరహవేదన, ఆతృత, ప్రియుడు ఇంకను రాలేదను విసుగు, రాడేమోనన్న శంక, విచారము, దుఃఖము, నిస్సహాయత, నిరాశ - ఇట్టిభావములన్నీ ప్రేక్షకులకు అర్థమయ్యే లాగున ఆభావములను వెలబుచ్చునటువంటి స్వరములను చేర్చి పాడుట; ఆ స్వరములకు ఆ భావము చూచేవారికి చక్కగా బోధపడులాగున నృత్యముచేయుట తానవర్ణము. ఇందులో వివిధ భావ ప్రకటనలు చేయుటకు, అభినయమునకు జీవమైనపాట ఉండదు. కనుకస్వరములనే ఆధారముచేసుకొని నృత్యముచేయవలెను. అందువలన తానవర్ణము విజయ వంతముగా చేయవలెనన్న కేవలము స్వర జ్ఞానము, తాళ జ్ఞానమే గాక ఆ స్వరములయొక్క ప్రభావము (Effect), ఆస్వరముల నొక్కటొక్కటే పాడినపుడెటువంటి భావోత్పత్తి కలిగిస్తుంది, వివిధ విధములుగాచేర్చి పాడినప్పుడు ఎటువంటి భావము కలుగుతుంది అనునది బాగుగా తెలిసికొని యుండవలెను.

ఉదా:—'సరిగమపదని' ఈ సప్తస్వరములు ఒక్కటొక్కటే పలికినపుడెట్టి భావము కలుగుతుంది ?

ఒక ప్రత్యేక భావము వినువారిలో కలుగవలయునన్న స్వరములను ఏ విధముగా పాడవలయును ? ఇట్లు ధ్వనినిగూర్చిన సమగ్రమైన జ్ఞానము కలిగియుండవలెను. ఈ కాలములో సాధార ణముగా ఎవ్వరూ తాన వర్ణములను భరతనాట్యములో నుపయోగించరు.

స్వరజతి:—ఇది వర్ణముకన్న కడుసులభమైనది. జంటస్వరముల గీతిక స్వరజతి అని పిలువబడును.

ఉదా:—రార వేణుగోపా బాల 'రాజిత సద్గుణ జయశీల'

## ౫. పదము (అభినయము)

భరతశాస్త్రములోని నాట్య, నృత్త, నృత్యములయొక్క సారమే అభినయము - మానవ మన స్తత్వమునుగూర్చి చక్కగా

తెలిసికొని మానవ స్వభావమును గ్రహించి ప్రదర్శించుట ఇందు ముఖ్యమైనది. క్షేత్రయ మువ్వగోపాల పదములు జయదేవుని గీత గోవిందములోని అష్టపదులు జావళీలు; త్యాగయ్యకృతులు,దీక్షితారు, స్వాతి తిరునాలు కీర్తనలు–ఈ పదములు సృష్టికి ఆదిరసమగు శృంగార రసముతో నిండియుండుటచే అష్టవిధనాయికలకు సంబంధించియుండును. పూర్వపు భరతశాస్త్ర కళావేత్తలు ప్రకృతిలోని స్త్రీయొక్క స్వభావ చిత్తవృత్తులను ఎనిమిది విధములుగా విభజించారు. సతీ పతుల పరస్పరానురాగ సమయమున వారిలో కలుగు వివిధ మనోభావములు, మార్పులు ఈ అష్టవిధ నాయికలలో వర్ణించబడుతవి. ఈ అష్టవిధ నాయికల చేష్టలు, క్రియలు మనము చక్కగా విమర్శించితే మానవ హృదయాన్ని, స్వభావాన్ని మన పూర్వులు ఎంత చక్కగా అర్థము చేసుకొన్నారో బోధపడుతుంది. పాశ్చాత్యులకు అసలు మనస్తత్వ శాస్త్రమన్నది ఏమిటో తెలియక ముందే కొన్ని వేల సంవత్సరముల క్రింద మనస్తత్వమునుగూర్చి సంపూర్ణముగ తెలిసికొని మనపూర్వులు ఈరసభావ అభినయ మార్గమును తెలియజేసారు.

స్వీయ, పరకీయ, సామాన్య అని స్త్రీలు మూడువిధములుగా విభజింపబడ్డారు.

అగ్నిసాక్షిగా పెండ్లియాడిన భర్తనే దైవముగా తలచి పూజించిన మహాపతివ్రిత స్వీయ.

(ముఖారి) - ఆది

అక్కరలేని కాపురమాయె
అతని మనసు వేరాయె
యెక్కడదీ దాని పాలాయె
యెవరాడిన రోసము లేదాయె.

పెండ్లియాడిన భర్తయున్నను పరపురుష సంయోగము నపేక్షించినది పరకీయ.

(ఆనందభైరవి) - చాపు

తూరుపు తెల్లవారె - రేపువత్తువుగాని
పోరా ఈవేళకు
నాపతి జూచిన - రాపిడి చేయును
కాపురములు నేడు కడగండ్లపాలగును.

ద్రవ్యము కొరకు పరపురుషుని గూడు వెలయాలు సామాన్య.

(కమాస్) - ఆది

మరులు కొన్నదిరా మానినీ మణిపై
పరి విధముల పరితపించుచు బాలా॥
ధరలో ధనికుని వెదకి నిను వల్లభుడు
తరుణి మణి బాలా తలచి తలచి నీపై॥

మరలవీరే ప్రోషితభర్తృక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, అభిసారిక, స్వాధీనపతిక, వాసవసజ్జిక, కలహాంతరిత అను అష్టవిధ నాయికలుగా అలంకార శాస్త్రములో విభజింప బడ్డారు.

(అ) ప్రోషిత భర్తృక

పతిదేశాంతరమునకు పోయినపుడు ఆవియోగము ననుభవించుచు జీవితముగడుపు నాయిక ప్రోషిత భర్తృక. ఈ ప్రోషిత భర్తృకయొక్క జీవితవర్ణనమే కాళిదాసుని 'మేఘ' సందేశము. ఈ ప్రోషిత భర్తృకాభినయములో "ఎన్నటికినే వానికౌగిట నెనసి సుఖమనుభవించెదను."

ఎన్నటికి నాకొమ్మను జూచేది
ఎన్నటికో నామనసు చల్లనయ్యేది.

లేక

సునీ సజరియా ప్రయాతూ యేకబేరి ఆజా
దిన నహీ చయన రహా నహీ నిందియ
జియా కె జరన భుజాలా జా
మొదలగు పదములు పాడబడును.

## (ఆ) విరహోత్కంఠిత

సంకేతస్థలమునకు అనుకున్న సమయమునకు ప్రియుడు రాలేదని విరహముచేచింతించు నాయిక విరహోత్కంఠిత. ఈనాయికాభినయములో

'సావిరహే తవదేనా కృష్ణా'
స్వామిని రమ్మనవె వేగమెదయచేసి యిప్పుడు
సరోజ దళ నయనా పరాకు యిక తగునా
బిరాన కనికరాన విను సరసుని
సరసకు సమయము

లేక

బయరనహోగయి హోగయీరాతే
అబుమేరే ప్రియసే లగుగయీఆంఖే
మొదలగు గీతములు పాడబడును.

## (ఇ) వి ప్ర ల బ్ధ

సంకేత స్థలమునకు ప్రియునిగూడబోయి అతనిచే మోసగించబడి పరితపించు నాయిక విప్రలబ్ధ.

'యామిక మిహ శరణం'– సఖిజన వచన వంచితా'
''యెంత మోసమాయెనే చెలియా
నేనెంత బేలనైతినే
ఇంతలో గోపాలుడు యిటుల
వంచించునని నే నెరుగనైతినే''

ఇట్టి పదములు ఈ నాయికాభి నయములో ఉపయోగపడును.

## (ఈ) ఖండిత

అన్యస్త్రీ రతుడై ప్రాతఃకాలమునందు వచ్చిన పతినిజూచి కోపించు నాయిక.

"యాహి మాధవా । యాహి కేశవా
మావద కైతవ వాదం
తామనుసర సరసీ రుహాలోచన
యాతవ హరతి విషాదం॥"

"ఏకీతి బొంకేవురా ఓరోరి ఇదిగో నీ భుజమున
దేరిన పసుపు నిగ్గులు
నీమే నలజారిన కుంకుమ జక్కులు
నీరెప్పలపై పేరిన కాటుక కగ్గులు"

"సాచికహాోమేసే బతియాం
కహాగమాయీసారీ రతియా"

ఇట్టి పదములు ఖండితనాయికాభినయములో పాడబడును.

(ఉ) అభిసారిక

ప్రియుని గూర్చి అభిసరించునది లేక ప్రియుని అభిసరింప జేయునది అభిసారిక. ప్రియుడున్న స్థలమునకు వెళ్ళునది, ప్రియుని తానున్న స్థలమునకు తెప్పించుకొనునది అభిసారిక.

తమోభిసారిక, జోత్స్నాభిసారిక, దివాభిసారిక యని అభిసారిక మూడు విధములు.

నల్లని, ఎఱ్ఱని దుస్తులను ధరించి, చీకటి రాత్రులలో ప్రియుని గూడ బోవునది తమోభిసారిక.

తెల్లని దుస్తుల ధరించి, మల్లెపూవులు మొదలగు పుష్పము లతో అలంకరించుకొని వెన్నెల రాత్రులలో ప్రియుని వెదకుచుబోవునది జోత్స్నాభిసారిక.

పగటిపూట అన్యులకు తెలియకుండ ప్రియునిచేరి సంభోగ సుఖముల ననుభవించేది దివాభిసారిక.

"ధీరసమీరే యమునాతీరే వసతివనే వనమాలి
గోపీ పీనపయోధర మర్దన చంచల కరయుగశాలి"

"చూడరే అది నడిచే హొయలు
సుదతి జేయు జాడలు
ఆడది కులకాంత అత్తింటికోడలు
అల గోపాలుని విడిదికి వెడలెను."

"ఝున్ ఝున్ ఝున్ ఝున్ భాజేమోరి పాయలియా
ఆనమిలే అబుమేరీ సావరియా"

ఇటువంటి పాటలు ఈ అభిసారిక నాయికాభినయములో అభినయించబడును.

(ఉ) స్వాధీనపతిక

ప్రియుని తన అదుపులో ఉంచుకొనినది, ఎల్లప్పుడు తనయిష్టము ననుసరించి ప్రవర్తించు ప్రియుని గలది స్వాధీనపతికనాయిక.

"ఎందుకురా కోపము మదన జనక
ఏమి మనసున దోచెరా
గ్రక్కున ననునీ కౌగిటచేర్చగ
చక్కని మోవి చురుక్కున నొక్కని"

"జావో జావో సయ్యాతూసే, మయినహీ బోలుం
డగర చలత మోసే కరత రాత్॥"

ఇట్టి గీతములు స్వాధీన పతిక అభినయములో ఉపయోగపడును.

(ఋ) వాసవసజ్జిక

ప్రియుడు వచ్చునని తెలిసి అతని ఇష్టమగునట్లు అలంకారములను ధరించి గృహమును అలంకరించి సిద్ధముగా నుండునది వాసవసజ్జిక.

"అక్కట మరుపాయే నార మరే మాయె
అక్కర తెలిసి రావైతివదే మాయే
ఏడాది పండుగ నేడని ఎంచి
తే మెడ శృంగారించితి

జలకమ్ముల వాడి వల్వాయుధరించితి
కస్తూరిబొట్టు వాడిగా నొనరించి"
"మోరి పియాసె మైకై సే పావుం
దౌరజ పటసఖి గరవలగావుం
విసే రసకే రసీత బాకే
సావరియా మోరి ఘర అబు ఆవే"

ఈ మాదిరిపాటలు వాసవసజ్జిక నాయికాభి నయములో ఉపయోగ పడును.

(ఋ) కలహాంతరిత

పతిని అవమానించి తరువాత విచారించునది.
"తెలివి యొకరి సొమ్మా ఎందుకు విభుని తిరిగి బొమ్మంటివే
చలమునను అలవితుడేసిన అలరుములుకులకులికి అలసితే"

ఇందులో నాయిక నాయకుడు తనయొద్ద లేనప్పుడు పశ్చాత్తాప పడునట్లు తెలుప బడినది.

"సయ్యాసే యితనీ జాయకహో మోరిజనత్
తమ బిల కలన పరత జుగిసే భీతత ఘరే

నైననకీ నీందగయీా – రజనీ బయిరన బయీా
సునీసే జరిచతర బిరహిత ఆగనజలీ"

ఈ పాటలో ప్రియునికి తనయొక్క దీనస్థితి దెలిపి రమ్మనియు, అతని మన్నించుమనియు చెలికత్తెనంపి వేడుకుంటుంది.

ఇట్టిపదములు స్వాధీనపతిక నాయికాభినయమున పాడబడును.

ఈ అష్టవిధనాయికల అభినయమును గురించి అతి క్లుప్తముగా చెప్పబడుటచే ఇందులో నాయికలయొక్క చేష్టలు, క్రియలు మొదలగువానిని గూర్చి రసభావపోషణ, అవి యెటుల అభినయించ

వలయునో వ్రాయుటలేదు. ఒక్క ఖండిత నాయికనుగురించి మాత్రము వివరముగా వ్రాయబడుచున్నది.

సాయంసమయము – భానుడు పడమటికొండలో మాయమవు చున్నాడు. మలయమారుతము హాయిగా వీస్తూంది. వికసించిన పూదీగెల పుష్పసుగంధముతో ప్రకృతి నిండింది దినమంత ఆకాశ ములో సంచారముచేసిన పక్షిదంపతులు గూడు చేరుకుంటున్నాయి. ఆ సమయంలో ఒకస్త్రీయ అద్దమువద్ద కూర్చొని శృంగారము చేసుకుంటున్నది.

"రాధా ! నీ శరీరానికి తెల్లచీర శోభనిస్తుంది సుమా ! అని గదూ వారనింది. అందువల్ల వారికిష్టమైన తెల్లచీరనే ఈ వేళ కట్టుకుంటాను" అని తెల్ల చలువవలువ ధరిస్తుంది. సొగసుగ తిలకము దిద్దుతుంది. కమలరేకులవంటి కన్నులకు మరింత అందమునిచ్చు కాటుక పెడుతుంది. కస్తూరి, పునుగు మొదలైన సుగంధద్రవ్యములు పూసుకుంటుంది. పూచిన పూవులైనచో ప్రియుడు వచ్చువేళకు వాడి పోవునని మల్లెమొగ్గల మాలతో తన శిరోజముల నలంకరించు కుంటుంది. పాన్పు సిద్ధపరచి ప్రియునిరాకకు వేచియుంటుంది. ప్రియుడు వచ్చేవేళ అయింది. తన శృంగారజీవితమును తలచుకుంటూ ఊహా ప్రపంచములో సంచారముచేస్తుంది. బయట ఏదో చప్పుడవు తుంది. పతి వచ్చాడని భ్రమపడి గుమ్మమువద్దకు వచ్చి అతడు వచ్చే మార్గమువైపు తొంగిచూస్తుంది. ఈ విధముగా నిమిషమొక యుగ ముగా గడుస్తుంది.

కానీ అన్యస్త్రీ భోగరసికుడత డెక్కడనుండి వచ్చును? ఆతడు ఏ పరకీయను, వెలయాలిని గూడ బోయెనో?

అర్ధరాత్రి అయింది. లోకమంతా సుఖముగా నిద్రపోతుంది. ఆమె మాత్రము ద్వారమువద్దనే ప్రియుని రాకను నిరీక్షిస్తూ నిలబడింది. ఆమె హృదయములోని ఆశలన్నీ నిరాశలైనవి. హృద యము దుఃఖముతో మునిగిపోయింది.

"ఎవరు చూసి ఆనందించాలి ? ఈ అడవిని పూచిన పువ్వును" తన అలంకారములను ఒకటొక్కటి తీసివేసింది. విచారముతో గుమ్మమువద్ద ఆలాగే నిలబడిఉంటుంది.

అంతలో 'కొక్కొరోకో, కొక్కొరొకో'—కోడికూత వినబడుతుంది.

ఆమె అలసిపోయి దుఃఖముతో మంచముపై ఒరిగి బడలిక తీర్చుకుంటుంది.

ఆ ప్రభాతసమయంలో అన్యస్త్రీ సంగమచిహ్నములు, శరీరముపై గలిగిన ఆమె ప్రియుడు యిల్లు చేరుకున్నాడు.

ఆ స్థితిలో ఉన్న ప్రియుని జూడగనే ఆమెలో కోపము జనించు చున్నది. అన్యస్త్రీకి అతని సంయోగ సౌఖ్యము చేకూరెను గదా యని అసూయపడుతుంది.

అతనినిచూడనట్లేపడుకుంటుంది. ఏదోదీర్ఘముగాఆలోచిస్తున్నట్లు మౌనముగా ఉంటుంది. అతడు అటుల చేయుటకు అదే మొదటిసారి అయినచో స్తంభాకృతిదాల్చుతుంది. అతని శరీరముపైనున్నచిహ్నములు చూసి కోపగించుకుంటుంది. తన దీనస్థితికి వలవల ఏడుస్తుంది.

'ఎక్కడికి వెళ్ళారండీ?' అని యేమీ తెలియనట్లు ప్రశ్నిస్తుంది.

"ఈ కాటుక మరక లేమిటి ? మొఖమెందుకుఅలావాడిఉన్నది? కండ్లు ఎట్లుబారినవెందుకు ? రాత్రి నిద్రలేదు కాబోలు" అని హేళన చేస్తుంది.

తన శరీరములో బాగులేనట్లుగా మూలుగుతూ పడుకుంటుంది.

"మీరు నన్నిలా దుఃఖపెట్టుట న్యాయమా ?" అని దీనంగా అడుగుతుంది. కన్నీరు కారుస్తుంది.

"ఇంత తొందరగా వచ్చారే. ఇంకాచీకటైనా పడలేదుగా ?" అని కోపముతో కఠినంగా మాట్లాడుతుంది.

అతడు పలుకరిస్తే మారుపలుకక ఊరు కుంటుంది.

కానీ, యిన్ని చేసినను పతియెడలప్రేమ, పతి అనగా గౌరవమూ ఈ రెండు మాత్రము ఆమె మరచిపోదు. ఇవన్నీ ఆక్షణంలో ఆమెలో కలుగు మార్పులు. 'ప్రేమ, గౌరవము' ఆమె హృదయము నెల్లప్పడూ ఆక్రమించి ఉంటాయి. కనుక కోపము గలిగినపుడు – అది ప్రేమతో గూడిన కోపమేగాని, ఒక విరోధిని చూచునపుడు – ఒక వ్యక్తిలో గలిగే ఉద్రేకము, క్రోధముగాదు.

అందువలన

"ఏరీతి బొంకేవురా, ఓరోరి ఏరీతి బొంకేవురా"

అన్న పదాభినయములో నర్తకి కోపము నభినయించవలసి వచ్చునపుడు శృంగారముతో, పతి యన్న గౌరవముతో కూడుకొనిన అతిసున్నితముగా ఆ భావము నభినయించవలయునుగాని, గంభీరముగా, ఉద్రేకపూరితముగాగాదు.

పిల్లవాడు అల్లరి చేస్తూఉంటాడు. వాని అల్లరిసహించలేక తల్లి వానిని కొడుతుంది. మరలా వెంటనే "నీవు యిలా అల్లరి చేయకపోతే దెబ్బలు ఎందుకు తినే వాడివిరా" అని ఏడుస్తున్న కుమారుని దగ్గరకు చేర్చుకుని తనూ కంట తడిపెడుతుంది. ఆమె కుమారుని కొట్టడము ప్రేమతో గూడిన మందలింపేగాని ఇద్దరు వ్యక్తులు జగడమాడే సమయములోని ఉద్రేకపూరిత క్రియ గానేరదు. అప్పటి ఆమె కోపము తన కుమారుని చర్యలపై గల విసుగు. అది క్షణ భంగురము. కాని పిల్లవానిమీద ప్రేమ మాత్రము శాశ్వతము.

అలాగే యిట ఖండిత నాయికయును తన ప్రియుని కోపముతో మాట్లాడుట, అతని చర్యలను ఖండించుటేగాని క్రోధము గాదు. భర్త యెడల శాశ్వతమైన ప్రేమగౌరవముల నెల్లప్పడూ కలిగియుండును.

అందువలన ఆమె ప్రియుడు

"చారుశీలే ప్రియే చారుశీలే
వదసియది కించిదపి దంతరుచి కౌముదీ"

"శీలవతివైన ఓ ప్రియురాలా! నీ ముఖ చంద్రములో దాగియున్న ముత్యములవంటి పలువరుస తొంగిచూచేటట్లు ఒక్కసారి నవ్వవమ్మా!" అని బ్రతిమాలునపుడు సూర్యకిరణములచే విరిసిన మంచు తెరలాగున ఆమె కోపమంతా మాయమవుతుంది. ప్రియుని కౌగిట చేరుతుంది.

ఇట్టి ఖండిత నాయికను

"చల్లనాయెనా మనసు చల్లనాయెనా
చల్లనాయెనా మనసు స్వామి మువ్వగోపాలా॥"

అన్న పల్లవిలో పై భావములన్నీ ప్రేక్షకుల కర్థమయ్యే లాగున అభినయించే కళావేత్త ఎంతచక్కగా మానవహృదయము,స్వభావము, ప్రకృతి రహస్యములను తెలిసినవాడై యుండవలెనో మనము గ్రహించ వలెను.

ఇతర నాయికల అభినయము ఆ యా నాయికనుబట్టి, ఆమె చేష్టలు, వ్యవహారములను బట్టి మారుచుండును.

## ౬. తిల్లాన

'నాదిర్ దిర్ దిర్ తోంతనన ధీం ధాతిం తాదన్నా'

ఇటువంటి మృదంగశబ్దములతో కూడుకొనిన పాటను పాడుచు ఆ శబ్దములను అనుసరించి నృత్యమాడుట 'తిల్లాన'. ఈ నృత్యములో నర్తకి తాళలయల ననుసరించి తనకు గల ప్రావీణ్యము ప్రదర్శించును. దీనియందు పాదసంచలనమందలినేర్పు ప్రావీణ్యము గమనార్హములు.

భరతనాట్యశాస్త్రములో చెప్పబడిన నృత్య, నృత్తభేదములు హిందూదేశములోని అన్ని నృత్యపద్ధతులలోను, ఒక భరతనాట్య మందే సరిసమానముగా పోషింపబడుచున్నది.

# కథక్ నృత్యము

భరత శాస్త్రము నాట్యము, నృత్యము, నృత్తము అని మూడు విధములు. నాట్యమే ఇప్పటి మననాటకము. దీనియందు అనేకఘట్టము లుండును. అనేక పాత్రలుకూడ ప్రవేశపెట్టుదురు. ఒక కథ ననుసరించి అనేక సన్నివేశములను గల్పించి దానికి కావలసిన పాత్రలను ప్రవేశ పెట్టి అభినయించుట నాట్యము.

పూర్వము మన దేశములో వచన నాట్యములు బహుకొలది. అన్నియు గేయ నాటికలుగాను, నృత్యనాటికలుగాను ప్రదర్శింప బడినవి. మలబారులోని 'కథకళి', ఆంధ్ర దేశములోని 'కూచిపూడి' గొల్ల భాగవతులు, ఉత్తరహిందూస్థానములోని 'రామలీలా' నౌటంకి నర్తక, మహారాష్ట్రములోని దంశారు ప్రదర్శనములను పూర్వపు నాట్యముతో పోల్చవచ్చును.

నృత్యము:—రస భావములతో కూడి, తాళలయలననుసరించి చేయబడు అభినయము లేక అంగచలనము నృత్యమనబడును.

నృత్తము:—రసభావరహితమై కేవలము తాళలయలననుసరించి చేయబడునది నృత్తము. కథక్ నృత్యములో ముఖ్యముగా చూడవలసిన విశేషము ఈ నృత్తమే.

ఈ నాట్య, నృత్య, నృత్తములు తాండవము, లాస్యమని రెండు విధములు.

తాండవము:—ఉద్ధతమగు నృత్యమే తాండవము. ఇది సాధా రణముగా పురుషులచే చేయబడునది. 'కథకళి', సిరైకేళా, చప్పునృత్య ములు ఈ తరగతికి చెందినవి.

శివుని భూతగణములలో ఒకడగు తాండుడనువాడు ఈనృత్యము చేయుటచే దీనికి తాండవమనిపేరు వచ్చినదని కొందరి అభిప్రాయము.

పెబాలి (ప్రేక్షణి),బహురూప అని తాండవము రెండువిధములు.

రసభావములు లేక కేవలము లయ, తాళ, రాగముల ననుసరించి శరీరముయొక్క వివిధాంగములను కదిలించుటయే విచాలి నృత్యము.

'బహురూప' రసభావములతో కూడియుండును. ఇందు నాటకములలోవలె అనేక సన్నివేశములుండవచ్చును. నర్తకుడు ఆ యా ఘట్టములకు తగినట్లుగా అలంకారములను ధరించును.

లాస్యము:—సుకుమారమైనది లాస్యము. ఇది స్త్రీల నృత్యము. భరత నాట్యము, కథక్, మణిపూరి నృత్యములు చాలమట్టుకు లాస్యమును పోలియుండును.

లాస్యము 'ఛురిత', 'యౌవరిత' అని రెండు విధములు.

కేవలము పురుషుల హృదయములనాకర్షించుటకు వేశ్యలుచేయు అతిసుకుమారమైన అభినయము యౌవరిత నృత్యము.

నాయికా నాయకుల పరస్పరానురాగము ప్రకటించు నట్టిది 'ఛురిత' నృత్యము.

వీటి అన్నింటియొక్క సారమే అభినయము. ఒక భావము అన్యులకు అర్థమయ్యేలాగున ప్రదర్శించుట అభినయము.

అభినయము ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్వికము అను నాలుగు విధములు.

## ౧. ఆంగికము

అంగములు, ప్రత్యంగములు, ఉపాంగములు (కాళ్లు, చేతులు, కండ్లు, కనుబొమలు, మెడ, చేతులు మొదలైనవి) వీనియొక్క సహాయముతో ఒక భావమును ప్రకటించుట ఆంగికాభినయము.

## ౨. ఆహార్యము

నాట్యములోగాని, నృత్యములోగాని ఒక ఘట్టమునకు తగు విధముగ అలంకారములు ధరించుట ఆహార్యాభినయము.

## ౩. వాచికము

దీనిని కావ్య, నాటకములయందు గాననగును.

## ౪. సాత్వికము

ఏదేని ఒక దృశ్యమును చూచునప్పుడుగాని, దానిని గూర్చి వినినప్పుడుగాని మన చిత్తములో కలుగు మార్పులను అభినయించుట సాత్వికము. స్థంబము, చెమర్చుట, గగుర్పాటు, మూర్ఛపోవుట, కన్నీరు కార్చుట, గుండెదడ మొదలైనవి.

ఆంగిక సాత్వికాభినయములోని భేదము

ఆంగికము కేవలము ఒక భావమును (పద్య, గద్యముల మొ॥) వివిధాంగసంచలనముచే వెలివరుస్తుంది.

సాత్వికము అటుగాక మన హృదయములో గలుగు మార్పులను తెలుపుతుంది.

నృత్తము:— రసభావరహితమైన అంగచలనము.

విశమ, వికట, లఘు అని నృత్తము మూడు విధములు.

మనప్రాంతములలో దొమ్మరివాండ్రు గెడయెక్కుట, సర్కస్ మొదలైవానిలో తాడుపై నృత్యముచేయుట – మొదలైనవి విశమ నృత్యము.

ప్రేక్షకులలో భయ విస్మయములు కలుగునటువంటి ఆహార్యం ధరించి నృత్యమాడుట వికటనృత్యము.

రెండుకాళ్ల మడమలను పైకెత్తి, మునివేళ్లపై తాళలయల ననుసరించి ఒకదాని తరువాత నొకటి భూమిపై కొట్టుట లఘునృత్యము.

కథక్ నృత్యములలో ముఖ్యముగా చూడవలసినది ఈ నృత్యము.

మహమ్మదీయ పరిపాలన మనకు మూడు వెలలేని రత్నాల నిచ్చింది ఒకటి జగత్ప్రసిద్ధమైన తాజమహాలు. రెండవది హిందూస్తానీ

సంగీతము, మూడవది 'కథక్' నృత్యము. దీనికే లక్నో ఘరానా నృత్యమని గూడ పేరు. మహమ్మదీయులకు పూర్వము మన నృత్యము హిందూమత సాంప్రదాయాలననుసరించి చేయబడేది. మననృత్యములో అభినయము ప్రధానము. మన అభినయగీతములన్నియు హిందూమత దేవతల వర్ణలతో గూడియున్నవి. అందువలన హిందూమత సంబంధమైన గీతములతో కూడిన నృత్యములను వదలి మహమ్మదీయుల కాలములో భావప్రకటన లేని నృత్యమునకు ప్రాధాన్యమిచ్చుటచే వారి పోషణలోనుండిన నృత్యకళారాధకులు ఈ భావ సూన్యమైన నృత్తమునే ఎక్కువ వృద్ధిలోనికి తెచ్చారు. ఈ కథక్‌లోవలె మరే పద్ధతిలోగూడ నృత్తము ఇంతఎక్కువగా వృద్ధిపొందలేదు. హిందువుల వలె మతసంబంధముగా గాక, ఈ నృత్య ప్రదర్శనములు కేవలము వినోదార్థమై చేయబడినవి. కాని ప్రస్తుతకాలములో వీరు 'రాసలీల', 'రతిమన్మథ' మొదలైన కొన్ని నృత్యములనుగూడ చేయుదురు.

వీరు అభినయములో టుమ్రీలు (మన పదములవంటివి), గజల మొదలగు పాటలు పాడుదురు.

ప్రాంతీయ భాషకు ప్రాముఖ్యతలేక, సంస్కృతమే దేశభాషగా ఉన్నకాలము భారతదేశములోని సంగీతమంతా ఎలా ఒకేవిధముగా ఉండేదో, అలాగే 'తబలా' వాయిద్యము కనిపెట్ట బడకముందు, ఉత్తర, దక్షిణ హిందూదేశ నృత్య శబ్దములు ఒకేవిధముగ నుండేవి. అందుచే నృత్యములో, అంగ చలనములోకూడ భేదములేక ఒకే విధముగ నుండేది. కాని 'తబలా' కనిపెట్టబడిన పిమ్మట మృదంగములో నున్న స్వేచ్ఛ (Freeness) 'తబలా' వాయిద్యానికి ఉండదుగనుక శబ్దములలోను, ముక్తాయింపులలోను కొంతభేదము వచ్చింది.

'తబలా' వాయిద్యపు వరుసలన్నియు ఎక్కువగా చక్రాకారముగ నుండును. అనగా శబ్దము (Sound) చక్రమువలె (Circle) తిరుగును. పైకి అంతఎక్కువ ప్రతిధ్వనించదు. సున్నితముగ నుండును.

మృదంగ ధ్వని అటులగాక కోణములుగాను (angular), తిన్నగాను (straight), మెలికలుగాను (Zigzag) వుండును. సున్నిత ముగా గాక ఉద్రేకపూరితముగా, గంభీరముగా నుండును.

ఉదా:—

తబలా శబ్దములు

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| తరికిట | తక | దిరికిట | తక |
| 5 | 6 | 7 | 8 |
| దినా | తిరకట | దిరకిట | తకి |

ధ్వని నడక

ఈ మాదిరిగనే ధ్వని ననుసరించి అంగచలనము ఎక్కువగా, వలయాకారముగా నుండును. కోణాకార శబ్దములు బహు తక్కువ.

మృదంగ శబ్దములు

1 2 3 4

త కిట తక తైయ్

5 6 7 8 9

నంగిట కిట తక నంగిట కిటతక

ధ్వని నడక

ఈలాగే దక్షిణదేశములోని నృత్యములలో అంగికాభినయ ములో కోణములుగనూ, తిన్నగనూ, మెలికలుగనూ ఎక్కువగా ఉండును. చక్రాకారశబ్దములు తక్కువ. కాని మణిపూరి నృత్యములలో సాధారణముగా వలయాకార, కోణాకార శబ్దములు సరిసమానముగా నుండును.

కత్తకీనృత్యము నేర్చుకొనునపుడు ముందు ముందు చెప్పబడు నటువంటి నృత్యపరణులు, రెండు మచ్చునకు క్రింద వ్రాయబడుచున్నవి.

గగన మగన వహ - ధిగిన నగన తక
నాచత శంకరు - తిరికిట తిరికిట తక
చంద్రతు బనకతు హారితి - తిరికిట తిరికిట తక

గంగలునగధర - తిరికిటతక
నాచకశంకరు - తాకిట దికితక
దడాంగణ దడాంగణ దడాంగణ
తున్ తున్దా తున్ తున్దా తున్తున్

ఇది 'శివ' పరణుముందు ఈపాటను అభినయముచెప్పి, తరువాత ఆ సాహిత్యమునకు సరిపోవునటువంటి తబలాశబ్దములకు నృత్యము నేర్పబడును.

"హా తోంసే హ తేలీ బాజే
పైరోంసే కదమ కిజయ్యా
సూరదాస సంగీతలిఖే
జబుభాజత మృదంగ్
తబునాచత కనయ్యా కనయ్యా
కనయ్యా కనయ్యా కనయ్యా కనయ్యా"

ఇది సూరదాసు వ్రాసిన నృత్యపరణు. ఇట్టిపదములకు భావాభినయము, వాని శబ్దములకు నృత్యమునూ నేర్పబడును.

## కత్తకీ నృత్యములోని తాళములోని వివిధభాగములు

కాలము యొక్క కొలతయే 'తాళము' (Time measure). ఒక తాళము యొక్క గతి (Speed) ని తెలుపుచున్నది 'లయ'.

విలంబిత, మధ్య, ధృత అని లయ మూడు విధములు.

మనము ఒక గీతము పాడునపుడు చేతితో అతి సులువుగ తాళము వేయుచు పాడుకొనుటకు వీలుగా నుండు లయ విలంబిత (Slow) లయ.

విలంబితమును ద్విగుణీకృతము చేసిన మధ్యలయ, మధ్యలయను ద్విగుణీ కృతముచేసిన ధృతలయ యగును. ధృతలయ కంటె ఎక్కువ తొందరగానున్నది 'జలద్' లయ అనబడును.

ఆవృత్తము :

ఒక తాళములో పాడుచున్నప్పుడు మొదటి అక్షరమునుండి మొదలుపెట్టి పాడుచూ మరల మొదటి అక్షరమునకు వచ్చినచో ఈ మధ్యకాలము ఆవృత్త మనబడును.

ఉదా:—పదహారక్షరముల తాళములో పాడుచున్నప్పుడు ఒకటవ అక్షరమునుండి మొదలుపెట్టి మరల ఒకటవ అక్షరమునకు వచ్చుట ఆవృత్తమనబడును.

ముకడా (ముక్తాయింపు) :

ఏ తాళములోనైనా 'సమ్మె' (తాళ మొదటి అక్షరము) నుండి 'కాలె' (నిశ్శబ్దక్రియ) వరకుగాని, 'కాలె' నుండి 'సమ్మె' వరకుగాని కాని తాళ శబ్దములు కలిపివాయించుట 'ముకదా' అనబడును.

ఉదా:—"దాతిరకిట తక తిగ నగ తాదా'

దినత దినత త్రక్ దిన్ దిన్ తా"

ఇటుల తాళశబ్దములను చేర్చి వాయించుటయే 'ముకడా' అనబడును.

మొహరా లేక తియా (తీర్మాణము) :

ఏవో కొన్ని అక్షరములుచేర్చి మూడుసార్లువాయించి 'సమ్'పై వచ్చుట తియా, మొహరా లేక తీర్మాణ మనబడును.

ఉదా:—"దాతరికిట తక దా తరికిట తక తద్దానన్ దా"
ఇట్టి శబ్దములు మొహరా అనబడును.

లగ్గీ:—తాళ శబ్దములతో 'దిన దాడే - దినదాడా' ఇటువంటి శబ్దములు వాయించుట 'లగ్గీ' అనబడును.

లడీ:—'దినతట దిన్నన' ఈ ప్రకారపు అక్షరములకు లడీ అని పేరు.

రేలా:— తబలా మధ్యలయలో వాయించ బడుచున్నప్పుడు ఒక్కొక్క అక్షర కాలములో ఎనిమిదేసి అక్షరములు వాయించుట 'రేలా' అనబడును.

ఉదా:—దీ నాదీ దీనా - ఇట్టి ఒక్కొక్క అక్షరమునకు

'దిన తిరికిట తక కత తిరకిట తక - ఈ విధముగా ఎనిమిదేసి అక్షరములు వాయించుటయే 'రేలా'.

పరన్:—సంపూర్ణ శబ్దములను 'సమ్'నుండిగాని మరియే అక్షరమునుండిగాని మొదలుపెట్టి రెండు మూడు ఆవృత్తముల వాయించి 'సమ్'కు వచ్చుట పరన్ అనబడును.

(దక్షిణ దేశనృత్య కళారాధకులకు ఉత్తరదేశ తాళముల వివరములను తెలియ బరుచుటకు గాను అవి అన్నియూ వ్రాయబడినవి)

ఒక్కొక్కప్పుడు నృత్యము చేసే స్థలమంతా కుంకుమతోనో, ముగ్గుతోనో కప్పబడి ఉండును. నర్తకుడు ఆ ప్రదేశములో నృత్యము చేయును. నృత్యాంతమున ఆ ప్రదేశమును చూచిన అచట ఏ పద్మమో, ఏ రాధాకృష్ణ చిత్రమో చిత్రించబడి యుంటుంది.

నర్తకులు రాధాకృష్ణ నృత్యము చేయుచున్నారనుకుందుము. వారు ఆనృత్యము ముగించిన పిమ్మట ఆ ప్రదేశమును చూచిన, అచ్చట కుంకుమలో రాధాకృష్ణ చిత్రము చెక్కబడి యుంటుంది.

అలాగే కొన్నిసమయములందు ఆ స్థలమునిండా బతాసాలు పరచబడి యుంటాయి. వానిపై వారు నృత్యమాడుదురు. కానీ నృత్య

మయిన తరువాత మనము పరీక్షిస్తే అన్ని బతాసాలు చెక్కుచెద కుండా, విరగకుండా అలాగే ఉంటాయి.

దీనినిబట్టి వారికి పాదము వేయుటల్లో ఎంతసామర్థ్యము, ఎంత ప్రావీణ్యత గలదో గ్రహించవచ్చును.

మనకు కథక్ నృత్యమును, హిందూస్తానీ సంగీతమును ప్రసాదించిన 'అమీరా క్రుస్రూ అక్బర్' పరమపదముచెందారు. వారితో మొగల్ సామ్రాజ్యలక్ష్మిగూడ మనదేశమునందంత రించినది. తాన్ సేన్ మనకు కానరాడు. కాని, తాన్ సేన్ కీర్తిని తెలుపు అతనిగీతములు మాత్రము ఈ నాటికీ ప్రతి గాయకుడు పాడుచున్నాడు. షాజహాన్ తన భౌతిక దేహాన్ని చాలించాడు. కాని పవిత్రబంధాను సూచకము, ప్రేమ చిహ్నము అగు తాజ్ మహాల్ బాలకృష్ణుని విహారసీమయగు యమునానదీ తీరమున శాశ్వతముగా తన కాంతిని విరజిమ్ముచున్నది.

శరీరము క్షణ భంగురమే. కానీ యశస్సు శాశ్వతము గాదా!



మయిన తరువాత మనము పరీక్షిస్తే అన్ని బతాసాలు చెక్కుచెద కుండా, విరగకుండా అలాగే ఉంటాయి.

దీనినిబట్టి వారికి పాదము వేయుటల్లో ఎంతసామర్థ్యము, ఎంత ప్రావీణ్యత గలదో గ్రహించవచ్చును.

మనకు కథక్ నృత్యమును, హిందూస్తానీ సంగీతమును ప్రసాదించిన 'అమీర్ కుస్రూ అక్బర్' పరమపదముచెందారు. వారితో మొగల్ సామ్రాజ్యలక్ష్మికూడ మనదేశమునందంతరించినది. తాన్ సేన్ మనకు కానరాడు. కాని, తాన్ సేన్ కీర్తిని తెలుపు అతనిగీతములు మాత్రము ఈ నాటికీ ప్రతి గాయకుడు పాడుచున్నాడు. షాజహాన్ తన భౌతికదేహాన్ని చాలించాడు. కాని పవిత్రబంధాను సూచకము, ప్రేమ చిహ్నము అగు తాజ్ మహల్ బాలకృష్ణుని విహారసీమయగు యమునానదీ తీరమున శాశ్వతముగా తన కాంతిని విరజిమ్ముచున్నది.

శరీరము క్షణ భంగురమే. కానీ యశస్సు శాశ్వతము గాదా!

# మణిపూర్ నృత్యం

"...to understand the music of any country is to know more of the emotions of the people of that country, of its race character, than by any other method."

(Margret E. Cousins)

ఒక జాతియొక్క స్వభావ సౌశీల్యములను తెలిసికొనుటకు వారియొక్క సంగీతము తెలిసికొనుటయే చక్కని మార్గము.

మనము బెంగాల్ సంగీతమువింటే అది అతినెమ్మదిగాను, ఏడుస్తున్న పసిబిడ్డలను ఉయ్యాలలోవేసి వూపుతూ తల్లిపాడే జోలపాట లాగున అతిసున్నితముగాను, హాయిగాను ఉంటుంది.

బెంగాలీలు కళాపూర్ణ హృదయులు, అద్భుతమైన కల్పనా శక్తిగలవారు. వారి భావప్రకటనగూడ అతి సున్నితముగాను, సుకుమారముగాను, రమణీయముగాను ఉంటుంది. వారినృత్య లేక నాట్యప్రదర్శనము చూచునప్పుడు మనము ఈ ప్రపంచములోనే ఉన్నామా లేక స్వప్నము జూస్తున్నామా అని అనిపిస్తుంది.

దక్షిణములోని తమిళుల సంగీతము వినునప్పుడు స్వరతాళముల కిచ్చిన ప్రాముఖ్యత భావమున కివ్వరు. వీరు ఒక పాట పాడినప్పుడు అది రాగ తాళములతో ఉందా లేదా చూస్తారుగాని ఆపాట భావ పూరితముగా నున్నదా అని చూడరు. అంటే వీరు శాస్త్రమున కిచ్చిన ప్రాధాన్యత భావమున కివ్వరని చెప్పవచ్చును. శాస్త్రమునకే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చేవారు గనుక వీరిలో శాస్త్రజ్ఞులు ఎక్కువ కనిపిస్తున్నారు.

వీరుపాడుటగాని, మాట్లాడుటగాని అతి త్వరితముగా నుండును. అటులనే ఏదైనా క్రొత్తవిషయములనుగూర్చి తెలిసికొనవలసి వచ్చినప్పుడు అతిత్వరగాను, కడుసూక్ష్మముగాను, సులభముగాను గ్రహించే మేధాశక్తి వీరిలోగలదు. వీరు పాడే సంగీతమును సవిమర్శక

దృష్టితో పరికించినయెడల ఈ విషయములన్నీ బోధపడగలవు. ఈ భావాన్నే స్వామి వివేకానంద

—"The brain of India is in the south and body in the north." (భారతావని మెదడు దక్షిణమున ఉన్నది. శరీరము ఉత్తరమున గలదు.) అన్న పలుకులలో తెలిపారు.

ఇక మన తెలుగువారి సంగతి—

ఆంధ్రులు శాస్త్రమునకన్నా భావమునకు, సహజత్వమునకు ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారు. వీరు ప్రదర్శించే నృత్యములు, పాడే పాటలు భావపూరితమై ఉంటాయి. తేనెలొలికే తెలుగుభాష మిగుల కోమలమై, ఒక లేదీగవలె ఎటువాల్చిన అటువాలి నర్తిస్తుంటుంది. వీరిహృదయము కూడ ఎంతో సున్నితమైనది. అందుచేతనే వీరిని నమ్మించుట, మోసగించుట బహు తేలిక. వీరు ప్రకృతిని ఎక్కువగా ఆరాధించుదురు. గనుక వీరిలో 'నా' అనే భావమంతా కనిపించును. ప్రకృతి ఎక్కడైనా ఒక్కటే. వీరు ఏ ప్రాంతమునకు వెళ్లితే ఆ ప్రాంత ప్రజలలో వారి ప్రత్యేకతను మరచిపోయి వారిలో లీనమైపోతారు. బర్మాలోని తైలంగులు తెలుంగులే అయినా వారు బర్మీయులలో కలిసిపోయి బర్మావారై పోయినారు. అటులనే మరాటిదేశములోనున్నవారు మహారాష్ట్రులయి పోయినారు.

తమిళదేశమందలి చిదంబర నటరాజ దేవాలయగోడలపై చెక్కబడియున్న భరతనాట్య శాస్త్రీయ భంగిమలూ—

ఆంధ్రదేశములోని అమరావతీ స్థూపము, నాగార్జున శిల్పముల లోని నృత్యభంగిమలూ—

ఈ రెంటినీ మనము జాగ్రత్తగా పరిశీలిస్తే పై సత్యము మనకు ఇంకా చక్కగా విదితమవుతుంది.

చిదంబర నటరాజ దేవాలయములోని గోడలపై చెక్కబడిన భంగిమలు భరతశాస్త్ర యుక్తముగా చెక్కబడిన వగుటచే అవి నిర్దుష్ట శిల్పములై అలరారు చున్నవి.

కానీ సహజత్వము, సౌకుమార్యము అమరావతీ స్థూప భంగిమలలో గలదని చెప్పవచ్చును.

దీనినిబట్టి ఆంధ్రులు శాస్త్రముకంటె భావమునకు (Technic), ప్రకృతికి ఎక్కువ ప్రాముఖ్యత యిస్తారనే విషయము విదితమౌతుంది.

ఇక,

'కథకళీ' నృత్యమునకు పుట్టినిల్లగు మలబారువారి నృత్య ప్రదర్శనములకన్నా వీరి వాయిద్యములు విన్నా, నృత్యములలో ధరించే అలంకారములు, ముఖానికి రాచుకునే చిత్ర విచిత్రములైన రంగులు చూచినా మాయలవాడురా మళయాళీ అన్న సామెత జ్ఞప్తికి వస్తుంది.

మనదేశము వదలి హిమాలయము లందలి టిబెట్ దేశపు సంగీతము నాలకించుదాం.

టిబెట్టీయులు ప్రతియేటా డెహ్రాడూన్ మొదలగు ప్రాంతాలకు ఉత్సవ సమయాలలో వస్తారు. సుమారు పది, యిరవైమంది పిల్లవాండ్రు మోసే పదిఅడుగుల పొడుగుపాటి పెద్ద పెద్ద సన్నాయిలు, మద్దెలలతో కూడిన సంగీతమువింటే అదేతో విచిత్రంగా ఉంటుంది. మనము ఈ లోకమునందే ఉన్నామా లేక ఊహాతీతమైన అగ్రముకాని మరో ప్రపంచములో ఉన్నామా అనిపిస్తుంది. అందువలననే టిబెట్‌ను 'Mysterious Tibet' అన్నారు. ఆరీతిగానే ఆ ప్రజలు, వారి సిద్ధాంతములు, వారి జీవితము, మనకుఅర్థముగాక అగమ్యగోచరమై ఉంటాయి.

ఇక ఇంగ్లీషువారి సంగీతము - వారి ఆర్కెస్ట్రాగాని, వారి బ్యాండుగాని వింటే వివిధతను వారు ఆశించుతారని (People who like Variety) స్పష్టపడుతుంది. వారు ఎప్పుడూ పురాతన వస్తువులకే ప్రాముఖ్యతనివ్వక క్రొత్త క్రొత్త వింతలయందు, వస్తువులయందు ప్రీతి గనుపరుస్తారు. గనుకనే వారు క్రొత్తవస్తువులను కనిపెట్టుటయందు, నూతన విషయముల పరిశోధించుటయందు శ్రద్ధ వహించుచున్నారు. కృషిచేస్తున్నారు.

ఇట్లు సంగీతము వినుటవలన ప్రజలగుణ శీలముల నెరుగ గల మనుట విశదమేగదా!

అసలు సంగీత మననేమి?

స్వర, రాగ, తాళములతో కూడుకొనిన నాదమే సంగీతము. ఆనాదములోనుండి అక్షరములు పుట్టుచున్నవి. అట్టి అక్షరముల యొక్క చేరికపదములు, పదసముదాయములచే వాక్యములు యేర్పడు చున్నవి. మన మనోభావములను పరస్పరము తెలుపుటకును వాక్యములు ఉపయోగపడుచున్నవి. అందువలన సృష్టికి కారణమైన ఆ నాదముయొక్క సంపూర్ణజ్ఞానముగల వ్యక్తి ప్రపంచములోఏజాతివ్యక్తి హృదయమునైనా, స్వభావమునైనా అతి సులువుగా గ్రహించగలడు.

ద్వాపరమున పదునారువేల గోపికల హృదయములను ఆ నాదోపాసనతో మ్రుచ్చిలించిన మురళీమోహనుని తమ నృత్యగీతాలతో ఆరాధించు మణిపురవైష్ణవ వనితల నృత్యకళనుగూర్చి కొంత తెలిసికొందము.

మణిపూర్, బెంగాల్, అస్సామ్ మొదలగు ప్రదేశములలో చేయబడు నృత్యమునకు మణిపూర్ నృత్యమని పేరు.

వంగదేశము వైష్ణవమతబోధకుడగు చైతన్యుని జన్మదేశము. చైతన్యులుపదేశించిన భక్తియోగము మణిపూర్ ప్రజలపాలిట వర ప్రసాదము.

శంకరాచార్య, నారాయణతీర్థ, రామకృష్ణ పరమహంసల యొక్క కష్టతరమైన జ్ఞానయోగముగాక, అందరకు సాధ్యమైన భక్తియోగ, శృంగారములతో మనక్షేత్రయ్య, జయదేవులవలె మురళీధరుని పూజించి తమ జీవితముల తరింపచేసుకొందు రావైష్ణవ వనితలు. ప్రతివైష్ణవవనిత హృదయమునందు తన చిన్నిపాదముల బంగారు గజ్జెలందియలు ఘల్లుఘల్లన నీలమేఘ శరీరుడు నృత్యము చేస్తాడు. ప్రతియౌవ్వనవతి కృష్ణసంయోగ క్రీడలను కలలు కంటుంది. ప్రతి వృద్ధభక్తురాలు బాలకృష్ణుని మురళీగీతమువిని తరిస్తుంది. ప్రతిస్త్రీ, ప్రతి పురుషుడు 'జగన్నాథా జగన్నాథా' అని కీర్తిస్తూ తన్మయత్వము

# మణిపూర్ నృత్యం

"...to understand the music of any country is to know more of the emotions of the people of that country, of its race character, than by any other method."

(Margret E. Cousins)

ఒక జాతియొక్క స్వభావ సౌశీల్యములను తెలిసికొనుటకు వారియొక్క సంగీతము తెలిసికొనుటయే చక్కని మార్గము.

మనము బెంగాల్ సంగీతమువింటే అది అతినెమ్మదిగాను, ఏడుస్తున్న పసిబిడ్డలను ఉయ్యాలలోవేసి వూపుతూ తల్లిపాడే జోలపాట లాగున అతిసున్నితముగాను, హాయిగాను ఉంటుంది.

బెంగాలీలు కళాపూర్ణ హృదయులు, అద్భుతమైన కల్పనా శక్తిగలవారు. వారి భావప్రకటనగూడ అతి సున్నితముగాను, సుకుమారముగాను, రమణీయముగాను ఉంటుంది. వారినృత్య లేక నాట్యప్రదర్శనము చూచునపుడు మనము ఈ ప్రపంచములోనే ఉన్నామా లేక స్వప్నము జూస్తున్నామా అని అనిపిస్తుంది.

దక్షిణములోని తమిళుల సంగీతము వినునపుడు స్వరతాళముల కిచ్చిన ప్రాముఖ్యత భావమున కివ్వరు. వీరు ఒక పాట పాడినపుడు అది రాగ తాళములతో ఉందా లేదా చూస్తారుగాని ఆపాట భావ పూరితముగా నున్నదా అని చూడరు. అంటే వీరు శాస్త్రమున కిచ్చిన ప్రాధాన్యత భావమున కివ్వరని చెప్పవచ్చును. శాస్త్రమునకే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చేవారు గనుక వీరిలో శాస్త్రజ్ఞులు ఎక్కువ కనిపిస్తున్నారు.

వీరుపాడుటగాని, మాట్లాడుటగాని అతి త్వరితముగా నుండును. అటులనే ఏదైనా క్రొత్తవిషయములనుగూర్చి తెలిసికొనవలసి వచ్చినప్పుడు అతిత్వరగాను, కడుసూక్ష్మముగాను, సులభముగాను గ్రహించే మేధాశక్తి వీరిలోగలదు. వీరు పాడే సంగీతమును సవిమర్శక

దృష్టితో పరికించినయెడల ఈ విషయములన్నీ బోధపడగలవు. ఈ భావాన్నే స్వామి వివేకానంద

— "The brain of India is in the south and body in the north." (భారతావని మెదడు దక్షిణమున ఉన్నది. శరీరము ఉత్తరమున గలదు.) అన్నపలుకులలో తెలిపారు.

ఇక మన తెలుగువారి సంగతి—

ఆంధ్రులు శాస్త్రమునకన్నా భావమునకు, సహజత్వమునకు ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారు. వీరు ప్రదర్శించే నృత్యములు, పాడే పాటలు భావపూరితమై ఉంటాయి. తేనెలొలికే తెలుగుభాష మిగుల కోమలమై, ఒక లేదీగెవలె ఎటువాల్చిన అటువాలి నట్లుంటుంది. వీరిహృదయము కూడ ఎంతో సున్నితమైనది. అందుచేతనే వీరిని నమ్మించుట, మోసగించుట బహుతేలిక. వీరు ప్రకృతిని ఎక్కువగా ఆరాధించుదురు. గనుక వీరిలో 'నా' అనే భావమంతా కనిపించును. ప్రకృతి ఎక్కడైనా ఒక్కటే. వీరు ఏ ప్రాంతమునకు వెళ్లితే ఆ ప్రాంత ప్రజలలో వారి ప్రత్యేకతను మరచిపోయి వారిలో లీనమైపోతారు. బర్మాలోని తెలుంగులు తెలుంగులే అయినా వారు బర్మీయులలో కలిసిపోయి బర్మావారై పోయినారు. అటులనే మరాటిదేశములోనున్నవారు మహారాష్ట్రులయి పోయినారు.

తమిళదేశమందలి చిదంబర నటరాజ దేవాలయగోడలపై చెక్కబడియున్న భరతనాట్య శాస్త్రీయ భంగిమలూ—

ఆంధ్రదేశములోని అమరావతీ స్థూపము, నాగార్జున శిల్పముల లోని నృత్యభంగిమలూ—

ఈ రెంటినీ మనము జాగ్రత్తగా పరిశీలిస్తే పై సత్యము మనకు ఇంకా చక్కగా విదితమవుతుంది.

చిదంబర నటరాజ దేవాలయములోని గోడలపై చెక్కబడిన భంగిమలు భరతశాస్త్ర యుక్తముగా చెక్కబడిన వగుటచే అవి నిర్దుష్ట శిల్పములై అలరారు చున్నవి.

కానీ సహజత్వము, సౌకుమార్యము అమరావతీ స్థూప భంగిమ లలో గలదని చెప్పవచ్చును.

దీనినిబట్టి ఆంధ్రులు శాస్త్రముకంటె భావమునకు (Technic), ప్రకృతికి ‌—ఎక్కువ ప్రాముఖ్యత యిస్తారన్న విషయము విదితమౌతుంది.

ఇక,

'కథకళీ' నృత్యమునకు పుట్టినిల్లగు మలబారువారి నృత్య ప్రదర్శనములకన్నా వీరి వాయిద్యములు విన్నా, నృత్యములలో ధరించే అలంకారములు, ముఖానికి రాచుకునే చిత్ర విచిత్రములైన రంగులు చూచినా మాయలవాడురా మళయాళీ అన్న సామెత జ్ఞప్తికి వస్తుంది.

మనదేశము వదలి హిమాలయము లందలి టిబెట్ దేశపు సంగీతము నాలకించుదాం.

టిబెట్టీయులు ప్రతియేటా డెహ్రాడూన్ మొదలగు ప్రాంతాలకు ఉత్సవ సమయాలలో వస్తారు. సుమారు పది, యిరవైమంది పిల్లవాండ్రు మోసే పదిఅడుగుల పొడుగుపాటి పెద్ద పెద్ద సన్నాయిలు, మద్దెలలతో కూడిన సంగీతమువింటే అదేతో విచిత్రంగా ఉంటుంది. మనము ఈ లోకమునందే ఉన్నామా లేక ఊహాతీతమైన అర్థముకాని మరో ప్రపంచములో ఉన్నామా అనిపిస్తుంది. అందువలననే టిబెట్‌ను 'Mysterious Tibet' అన్నారు. అదేరితిగానే ఆ ప్రజలు, వారి సిద్ధాంత ములు, వారి జీవితము, మనకుఅర్థముగాక అగమ్యగోచరమై ఉంటాయి.

ఇక ఇంగ్లీషువారి సంగీతము - వారి ఆర్కెస్ట్రాగాని, వారి బ్యాండుగాని వింటే వివిధతను వారు ఆశించుతారని (People who like Variety) స్పష్టపడుతుంది. వారు ఎప్పుడూ పురాతన వస్తువులకే ప్రాముఖ్యతనివ్వక క్రొత్త క్రొత్త వింతలయందు, వస్తువులయందు ప్రీతి గనుపరుస్తారు. గనుకనే వారు క్రొత్తవస్తువులను కనిపెట్టుటయందు, నూతన విషయముల పరిశోధించుటయందు శ్రద్ధ వహించుచున్నారు. కృషిచేస్తున్నారు.

ఇట్లు సంగీతము వినుటవలన ప్రజలగుణ శీలముల నెరుగ గల మనుట విశదమేగదా !

అసలు సంగీత మననేమి ?

స్వర, రాగ, తాళములతో కూడుకొనిన నాదమే సంగీతము. ఆనాదములోనుండి అక్షరములు పుట్టుచున్నవి. అట్టి అక్షరముల యొక్క చేరికపదములు, పదసముదాయములచే వాక్యములు యేర్పడు చున్నవి. మన మనోభావములను పరస్పరము తెలుపుటకును వాక్యములు ఉపయోగపడుచున్నవి. అందువలన సృష్టికి కారణమైన ఆ నాదముయొక్క సంపూర్ణజ్ఞానముగల వ్యక్తి ప్రపంచములోప్రజాతివ్యక్తి హృదయమునైనా, స్వభావమునైనా అతి సులువుగా గ్రహించగలడు.

ద్వాపరమున పదునారువేల గోపికల హృదయములను ఆ నాదోపాసనతో మ్రుచ్చిలించిన మురళీమోహనుని తమ నృత్యగీతాలతో ఆరాధించు మణిపురవైష్ణవ వనితల నృత్యకళనుగూర్చి కొంత తెలిసికొందము.

మణిపూర్, బెంగాల్, అస్సామ్ మొదలగు ప్రదేశములలో చేయబడు నృత్యమునకు మణిపూర్ నృత్యమని పేరు.

వంగదేశము వైష్ణవమతబోధకుడగు చైతన్యుని జన్మదేశము. చైతన్యులుపదేశించిన భక్తియోగము మణిపూర్ ప్రజలపాలిట వర ప్రసాదము.

శంకరాచార్య, నారాయణతీర్థ, రామకృష్ణ పరమహంసల యొక్క కష్టతరమైన జ్ఞానయోగముగాక, అందరకు సాధ్యమైన భక్తి యోగ, శృంగారములతో మనక్షేత్రయ్య, జయదేవులవలె మురళీధరుని పూజించి తమ జీవితముల తరింపచేసుకొందు రావైష్ణవ వనితలు. ప్రతివైష్ణవవనిత హృదయమునందు తన చిన్నిపాదముల బంగారు గజ్జెలందియలు ఘల్లుఘల్లన నీలమేఘ శరీరుడు నృత్యము చేస్తాడు. ప్రతియౌవ్వనవతి కృష్ణసంయోగ క్రీడలను కలలు కంటుంది. ప్రతి వృద్ధభక్తురాలు బాలకృష్ణుని మురళీగీతమువిని తరిస్తుంది. ప్రతిస్త్రీ, ప్రతి పురుషుడు 'జగన్నాథా జగన్నాథా' అని కీర్తిస్తూ తన్మయత్వము

నొంది, అశ్రువులు రాలుస్తూ యమునాతీర విహారినిగూర్చి గానము చేయుచూ నృత్యమాడుదురు.

ఇదియే వైష్ణవ భక్తి, వైష్ణవ ప్రేమ. "ప్రేమ ప్రేమ జగతి యంతా ప్రేమమయం" ఇదియే వారి జీవితములోని ముఖ్యసిద్ధాంతము.

మణిపూర్ రాసలీలా నృత్యములో స్త్రీలు మాత్రమే పాల్గొంటారు. ఈ నృత్యమునకు శాస్త్రముతోకంటే ప్రకృతితో సంబంధము జాస్తి. ఇది లాస్యనృత్యము. మణిపూర్‌లో కృష్ణోత్సవ సమయములో యువతులందరు శ్రీకృష్ణదేవాలయావరణములో గూడి మురళీ ధరుని కీర్తిస్తూ నృత్యమాడుదురు.

దక్షిణదేశమున దేవదాసీలుమాత్రమే దేవళములలో నృత్యము చేయుదురు. కాని యిచ్చట అన్నిజాతులకు చెందిన యువతులు నృత్యములో పాల్గొందురు. అట్టి సమయములో వీరు చేయునది రసలీలా నృత్యము.

## రసలీలానృత్యము

రాధాకృష్ణుల విరహతాపమే ఈనృత్యము. పరమాత్మనుండి వేరుపరుచబడి ప్రపంచ మాయచే బంధింపబడిన జీవి ఆ బంధము లన్నింటినీ త్రెంచుకొని మరల పరమాత్మలో లీనమగుటయే రసలీలానృత్యసారము.

ఒక యువతి కృష్ణునిగా అలంకరించుకొనును. మరియొక భక్తురాలు రాధగా అభినయించును. మిగిలిన వారందరు గోపికలుగా ఆ రాధాకృష్ణులచుట్టూనిలువబడి వారిని స్తోత్రము చేయుచూ, ఆనందాశ్రువుల రాల్చుతూ, భక్తితో చేతుల తట్టుచూ నృత్యము చేసెదరు.

## రసలీలా రాసక్రీడ నృత్యము

అది వసంత సమయము. నాడు పూర్ణిమ. విరహవతుల యుల్లముల కొల్లగొను తన చల్లని కాంతులతో నిండు చంద్రుడు తూర్పు కొండలలోనుండి వెలికి వస్తున్నాడు. భానుకిరణసంతాపమునకు తాళజాలక సరోవర గర్భమున దినమంతా దాగి యుండిన కలువమొగ్గలొక్కటొక్కటి పైకివచ్చి తమ వికసిత వదనములతో ప్రియుని

ఆహ్వానిస్తూ సిగ్గుతో మోమువాల్చిన తామరలను వెక్కిరిస్తున్నాయి. 'ఝుం'మని ఝుంకార ధ్వనులజేస్తూ సగమువిడిన కలువరేకుల నొక్కటొక్కటే చీల్చి వానిహృదయములోని మధుర మకరందమును గ్రోలుతున్నాయి తుమ్మెదలు. దూరమున లేమావికొమ్మపై కూర్చున్న కోయిల పంచమస్వరమున 'కో' యని కూస్తూ తన పసికూనలకు పాటలు నేర్పుతూంది.

ఆ ప్రమోద సమయములో విరహిణులు తమ ప్రియులతోడి సంయోగముకొరకు తహతహ పడుచున్నారు. పూచిన మల్లెలు, సంపెంగలు తమ పరిమళమును ప్రకృతిలోని కెగజల్లుచున్నాయి. చల్లని పిల్లతెమ్మెరలు మెల్లమెల్లగా వీచుతున్నాయి. సుమలతనుండి జలజలరాలి క్రిందబడిన కుసుమమును ఏరుకొని విరహోత్కంఠితలు తమ శిరోజముల నలంకరించుకొను చున్నారు.

చిక్కిపోయిన శరీరము, దీర్ఘకాలపు దుఃఖముచే కాబోలు ఎఱ్ఱనై ఉబ్బిననేత్రములు, విచారముతో నిండిన ముఖము గలిగిన ఒక స్త్రీ చిందరవందరగా చెక్కిళ్ళపై పడుచున్న ముంగురుల సవరించుకొనుచు ఆదారిని వెళ్లుచున్నది. ఎవ్వరూ లెక్కసేయక మట్టిలో పడివున్న పువ్వునెత్తుకుంది. అది తన ప్రియుని కత్యంత ప్రియమైన పుష్పము.— "నా జీవితముగూడ యిట్టిదేకదా!" ఆపుష్పమునుజూస్తూ నిలబడుతుంది. దానియందు తనప్రియుని ముఖబింబము కనబడుతుందామెకు. "వెఱ్ఱిదానా విచారించకు. త్వరలోనే కలుసుకుంటాను" అన్న ప్రియుని సందేశము వింటుంది. ఆనందపూరితురాలైన ఆమె వదనమండలము నుండి కన్నీటి బిందువులు రాలాయి. అటనుండి గృహోన్ముఖియై పోతుందా ప్రోషిత భర్తృక.

ఆ సమయమున యమునానదీతీరమున పూపొదరింట కూర్చొని మురళీగానము చేయుచున్నాడొక యువకుడు. ఆ గానము చెవిన బడినంతనే, కట్టుచున్న పుట్టము లటులనేవదలి వడివడిగా పరుగెత్తివచ్చిన దొకవనిత. ఒకగొల్లపడుచు సగము తొడుగుకొన్న రవికతో అతని చేరబోయింది. ఏడ్చుచున్న పిల్లవానిని తొట్టిలోవేసి ఊపుతున్న బాలుఅల్లే వదలి పరుగెత్తివచ్చింది. పతితోకూడిపరుండి సరస

సల్లాపము లాడుచున్న ఒకపడతి భర్తనుగూడ లెక్కచేయక లేచి పరుగెత్తింది. నడువలేనిస్థితిలోనున్న ఒకముదుసలి అతిప్రయాసతో ఆ ప్రదేశముజేరింది. బొక్కిదవడలనాడిస్తూ, వయసుతో నడుమువంగిన వృద్ధురాలు వణుకుచున్న చేతితో కఱ్ఱపట్టుకొని, మెల్లమెల్లగా అడుగు లేసుకుంటూ అతని చేరుకొన్నది.

"కృష్ణా, బాలకృష్ణా, గోపాలకృష్ణా" అంటూ అందరూ ఒకరి చేతులు ఒకరు పట్టుకొని గుండ్రముగా నతనిచుట్టూ తిరుగుచూ, మురళీ గీతము ననుసరించి, తన్మయత్వమున నృత్యము చేస్తున్నారు.

"మనసంసారములను నాశనము చేయుడానికి పుట్టిన ఈదొంగని హతమారుద్దాం నడవండిరా" అంటూ ఆవ్రెక్రిగొల్లలంతా గుంపులు గూడి ఆస్థలానికి పరుగులెత్తుతున్నారు. కాని ఆప్రదేశము చేరులోగా మధురాతి మధురమైన ఆ మురళీ నాదానికి వారు ముగ్ధులై కోపము మరచి "జగన్నాధా జగన్నాధా నమస్తే, నమస్తే, నమస్తే" అని నమస్కరించి ఆస్త్రీలలో కలసి వారుకూడా 'రసలీలా' నృత్యమాడ సాగారు.

ఆవెన్నదొంగ మురళీనాదమంటే ఎందుకో వారికంతపిచ్చి.

ఆ సమయమున దూరముననుండి మరియొక పొదరింటి వైపుకు ఒకయువతి సఖసమేతమై నడచివస్తుంది. ఆమె తెల్లని చలువచీరధరించి, మెడను ముత్యాలపేరు దాల్చింది. చెవులలోని రవల ఝుంకాలు పిల్ల వాయువుల కట్లిట్టాడి ధగధగ కాంతుల వెదజిగక్కుతున్నాయి. ఆమె కస్తూరి తిలకము సొగసుగా దిద్దింది. తలలోనుంచిన సన్నజాజిమొగ్గల దండలోని మొగ్గ లొక్కొక్కటేవిడి క్షణ క్షణమునకు ఆమె మోమున కొక వింత సొగసు కలిగిస్తున్నాయి.

లలితా, స్వామి జెప్పినదా పొదరిల్లేగదూ! అని వెంటనున్న యువతిని అడుగుతూ అన్యులెవరైనా చూతురేమో అన్న భయ ముతో యిటు నటు చూచుచు ఆ పొదరిల్లు చేరుకున్నది.

"జగన్నాధుని కూడబోవు నీ కెందుకమ్మా అంతభయము"

"లలితా నీకు తెలియదే. లోకము నాప్రేమనర్థముచేసుకోలేదు. నా ప్రేమ ప్రతిఫలముగా నే నపేక్షించేది క్షణిక మాత్రమైన శరీర సౌఖ్యమని లోకము భావించుతూంది. నిరంతరానందమునిచ్చే అతని యందు లీనమయ్యే పరమ రహస్యమని యెరుగదు. అందుచే నన్ను తప్పుగా తలుస్తుంది. నీచముగా చూస్తుంది."

ఇరువురూ పొదరింటిలోనికి పోతారు. కానీ జగన్మోహనుడు, ఆ మురళీ మనోహరుడేడి ?

ఇంకనూ వేళకాలేదు. వచ్చుచుండెనేమో ! ఆమె తన యలంకారములను సవరించుకొనును.

వచ్చేవేళ దాటింది. ఇంకనూరాలేదే ? అయ్యో ! వచ్చునో లేదో ? దారిలో ఎవరైన ఎదురయిరేమో ? దీనురాలై వాడిన మోముతో వచ్చేదిక్కునుచూస్తూ నిలబడింది. ప్రియుడు రానందుకు కన్నీరు కార్చుతుంది. తన ప్రియుని జాడలరయ తన చెలిని పంపుతుంది. కానీ ఆమె ఆశలన్నీ విఫలమైనాయి పంపిన చెలి ప్రియుని గానక తిరిగి వచ్చింది.

"అయ్యో ! ఎంతమోసమాయెనే!" చెలి మాటలు విని సాహసించి వచ్చితినే! ఎంత బేలనైతిని ! ఓ దేవా ! నన్నీ ఏకాంత ప్రదేశములో ఆదరించు వారెవరు ? లలితా నిన్ను నమ్మినందుకు ఎంత మోసము చేసితివే" అని దుఃఖించుట మొదలు పెట్టింది.

"నాథుని ఈ జన్మమున కలియుట కల్ల. హా ! దైవమా ! ఎంత మోసము జరిగెను ?" అని ఆమె స్మృతితప్పి పడిపోయింది.

ఇంతలో దూరమునుండి గోవర్ధనుని మధుర మురళీ నాదము వినబడుతుంది.

మెల్ల మెల్లగా ఆమె తేరుకుంటున్నది. కానీ ఆ నాదము దూరములో నున్నది. తానా యెడబాటునిక సహించలేదు. అతని యొద్దకు తానేపోవ సాహసించును.

రాధా లలిత లిరువురు ఆ మురళీనాదము నాధారముగా మురళీనాథుని వెదుకబోయిరి. చెట్లులు, గుట్టలు, యమున యొడ్డుననున్న

ఉద్యానవనములు అన్నీ వెతికాడు. "గీతము వినుపించునే గాని స్వామి కానరాడే" అని రాధ అలసి తన చెలిమీద వాలింది.

ఆ సమయములో నీలమేఘ శరీరుడు ఒకగోపికతో గూడి ఆయుద్యాన వనములో విహరించుచున్నట్లు ఆమెచూస్తుంది.

"చెలీ యింకెక్కడి నాథుడే! నా నాథుని పరులపహరించారే" అని ఆమె చెలికత్తెతో గూడి గృహోన్ముఖయై వెళుతుంది. రాధకు కోపము వచ్చినదని తెలుసుకున్నాడు. నర్తక మురళి ఆమెను వెన్నాడుతాడు.

'రాధా' అని కేకవేస్తాడు.

"ఓ మాయలవాడా! నాతో నీకేమి పనయ్యా? నీహృదయము రంజింపజేసే ఆ చెలివద్దకే పోవయ్యా" అని కఠినముగా పలుకుతుంది.

"రాధా క్షమించు. ఇదంతయు నీపవిత్ర ప్రేమను పరీక్షించుటకు పన్నిన యుక్తి" అని వేడుకుంటాడు.

"జగన్నాథా, కృష్ణా" అని చేతులు జోడించి నమస్కరించింది.

రాధ నిరంతరానంద సంధాయియగు జ్యోతి నాతనిలో కాంచుతుంది.

ఇదే రాధాకృష్ణ రసలీల నృత్యము.

ఆ వైష్ణవభక్తులు భక్తిగీతముల పాడుచూ, ఈ రసలీలానృత్యము చేయుచున్నప్పుడు మనము ఈప్రపంచమే మరచిపోయి, అదే బృందావనము, ఆ కృష్ణపాత్ర నృత్యముచేయుచున్న యువతియే బాలగోపాలుడు, వారేగోపికలు యమునానదీసైకత శ్రేణులపై నృత్యము చేయుచున్నారు అనుభావమున తన్మయత్వమునొంది ముగ్ధులమయ్యెదము.

మణిపూరినృత్యము శాస్త్రముకన్న ప్రకృతిపై నాధారపడి యుండును. వారి సంగీతము అతి విలంబితముగా, వినసొంపుగా నుండుటచే దాని ననుసరించి చేయబడు అంగచలనము అతిసున్నితము గనూ, హృదయాహ్లాదకరముగనూ ఉండును. ప్రకృతి ఆరాధకులగుటచే వారి నృత్యము సహజసౌందర్యముతో శోభిల్లుచుండును. వీరిఅభినయము భావపూరితముగా నుండును.

మణిపూరినృత్యము కేవలము దైవిక మగుటచే కనుబొమలు, నేత్రములు, కుచభాగములయొక్క సహాయము వారి అభినయమందు గైకొనరు. మనదేశములోవలె నృత్యకళ ఏకొందరోగాక ఆదేశములో ప్రతి స్త్రీ పురుషులు అభ్యసింతురు. వధువునకు నృత్యకళయందు ప్రవేశము లేకపోవుటచే పీటలమీద పెండ్లిండ్లు ఆగిపోయిన సంఘటనలు అస్సాములో మనకు కానవచ్చును. దీనిని బట్టి ఆ ప్రాంతములోని ప్రజలు నృత్యకళకు ఎంత ప్రాముఖ్యత నిచ్చెదరో తెలిసికొనవచ్చును.

## రవీంద్రుని సంగీతము

ఈ పద్ధతిని నృత్యము, గీతము విశ్వకవి రవీంద్రనాథ్ సృష్టించారు. ఈ పద్ధతి నృత్యము మణిపూర్ నృత్యపు పోలికలు కలిగియున్నను, 'నాట్యధర్మము' కన్న 'లోకధర్మము'పై యెక్కువగా ఆధారపడియున్నది. వారి 'చండాలిక' 'దేవదాసి' 'చిత్రాంగద' నృత్యములు చూచినప్పుడు ప్రేక్షకులు నృత్యముకన్న రవీంద్రుని సుమధుర కవిత్వము విని ముగ్ధులయ్యెదరు. శాస్త్రీయుక్తముగా గాక కేవలము కవియొక్క భావముపై ఆధారపడి యుండుటచే ఈ కళ సంపూర్ణత నొందలేదనియే చెపవచ్చును. అట్లే వారి సంగీతముగూడా ఇంగ్లీషు, హిందూస్థానీ సంగీతముల సమ్మేళనమై ఇప్పటి బెంగాలీ ఫిలిం సంగీతమును పోలియుండును.

## వ్రతచారి సంఘము

కీ. శే. పి. సి. దత్తుగారు దీనిని ప్రారంభించిరి. ప్రోత్సాహములేక మూలబడియున్న అనేక జానపద నృత్యములను ప్రచారములోనికి తెచ్చిరి. ప్రస్తుత కాలములో వంగదేశము యింత కళామయమై ఉండుటకు ముఖ్యముగా శ్రీ దత్తుగారి సేవయే కారణమని చెప్పవచ్చును.

మణిపూర్ నృత్యము శాస్త్రముకన్న ప్రకృతిపై యెక్కువగా ఆధారపడి యుండును. అందుచేత యిది సహజ సౌందర్యముతో విరాజిల్లు చున్నది.



# కథకళీ నృత్యము

రమణీయదృశ్యములచే నలరారు కేరళదేశమందలి ప్రాచీన నృత్యకళ 'కథకళీ' అని పిలువబడుచున్నది. ఇది నృత్యగీతములతో కూడుకొనిన నాటకము. దీనియందు రామాయణ మహాభారతాది పురాణములు ప్రదర్శించెదరు. కథకళీ ముద్రనృత్యము. ముద్రలే దీనికి జీవము.

నృత్యములో - పశుపక్ష్యాదులు - వృక్షములు - నదులు - మొదలైన వానిని అభినయింప సహాయపడు హస్త చిన్నములకు ముద్రలని పేరు.

భయానక, రౌద్ర, భీభత్సరసములకు కథళీనృత్యము పెట్టిన పేరు. ఈ నాట్యవిధానమునందు నవరసములును సంపూర్ణముగా పోషింపబడుచున్నవి.

నవరసములననేమి ? వాని నభినయించుటెట్లు ? అను విషయము లిట విపులముగా వ్రాయబడుచున్నవి.

" యతో హస్త స్తతో దృష్టి ర్యతో దృష్టి స్తతో మనః
యతో మన స్తతో భావో యతో భావ స్తతో రసః"

హస్తము ఎటుప్రక్కకు చూపబడునో అక్కడికి దృష్టి ప్రసరిస్తుంది. ఎచ్చట దృష్టియుండునో అచ్చట మనస్సు, ఎచ్చట మనస్సుఉండునో అచ్చట భావముండును. భావమున్నచో రసము పుట్టుచున్నది.

ఏదేని ఒకదృశ్యము చూచునప్పుడు మన హృదయమందు గలుగు మార్పే భావము. ఆ భావమునుండే రసముపుట్టును.

ఉదా:—స్త్రీ పురుషులలో గలుగు సంభోగచింత రతి యనబడును. రతియొక్క స్థాయిభావమే శృంగార రస మనబడును. అనగా 'రతి' యనెడి కోరికవలన పుట్టునది శృంగారరసము.

శృంగార, వీర, కరుణ, అద్భుత, హాస్య, భయానక, భీభత్స, రౌద్ర, శాంత అని రసములు తొమ్మిది.

## 1. శృంగార రసము

సంభోగాది విషయములందు కోరికవలన శృంగారము పుట్టుచున్నది. పెండ్లి మొదలగు వైభవములలో చేయు చర్యలు శృంగార రస మనబడును. పరస్పరానురాగము గల నాయికా నాయకులలో సంభోగచింత మొదలగు కోరికలు జనించుటచే, ఆ కోరికవలన శృంగార రసము ఉత్పన్నమగుచున్నది.

## 2. వీర రసము

ఇది ఉత్సాహమువలన పుట్టుచున్నది. పరుల హృదయము నెరుగని అపకారులయందీ రసము పెరుగును.

దయావీర, దానవీర, యుద్ధవీర అని వీరరసము మూడు విధములు.

## 3. కరుణ సరము

ఇది ప్రియజన వియోగములయందు పుట్టుచున్నది. ఈ రసము దుఃఖమువలన పుట్టుచున్నది.

## 4. అద్భుత రసము

మనము ఎన్నడూ చూడని ఒక దృశ్యమును చూచిన దాని యందు అద్భుత రసము పుట్టును.

## 5. హాస్య రసము

వికృతాది దృశ్యములను చూచినచో వానివలన కలుగు మనో వికారమే హాస్యరసము. ప్రజలను నవ్వించునది హాస్యరసము. ఇది నవ్వువలన పుట్టుచున్నది.

## 6. భయానక రసము

ఇది మనకు భయంకరముగ కనిపించు దానివలన పుట్టుచున్నది. భయము వలన భయానక రసము పుట్టును.

## 7. భీభత్స రసము

ముందు వెనుకలు ఆలోచింపక ఒక పనిచేసి పశ్చాత్తాపము పడుటవలన పుట్టుచున్నది. భీభత్సము విచారమువలన పుట్టును.

## 8. రౌద్ర రసము

ఇది మనలను హింసించే శత్రువులయందు పుట్టును. రౌద్రము కోపము వలన పుట్టును.

## 9. శాంత రసము

ఎట్టికోరికయునులేక వైరాగ్యమును పొందుటయే శాంతరసము

## పూర్వము నవరసములలో చేయబడిన నృత్యములు

శృంగారరసములో ఛురిత నృత్యము చేయబడింది.

నాయికా నాయకుల పరస్పరానురాగము, ప్రేమను వెలిబుచ్చుచు చేయునటువంటిది ఛురిత లేక స్ఫురిత నృత్య మనబడును.

వీరరౌద్రరసములలో లఘునృత్యము ప్రదర్శించెడివారు.

కాళ్ళమడమలు కొంచెమునెత్తి ఒకదానితరువాత యింకొకటి భూమిపై కొట్టిన లఘునృత్యమనబడును.

కరుణ రసముతో పెబాలి నృత్యము చేయబడేది. రసభావములు లేనటువంటి అంగచలనమే 'పెబాలి' నృత్యము.

అద్భుత రసముతో బహురూపనృత్యము చేయబడేది.

నాటకములో ప్రతియొక్క ఘట్టమునకు వేరువేరు విధములైన అలంకారములను ధరించి రసభావములతో కూడికొనినది 'బహురూప' నృత్యము. సాధారణముగా బహురూపలో తిల్లాన పాడబడును.

హాస్యరసమందు 'వికట' నృత్యముచేయబడేది. ప్రజల హృదయములో భయము, హాస్యము కలిగించునటువంటి దుస్తులను ధరించి చిత్ర విచిత్రముగా నృత్యమాడుట వికటనృత్య మనబడును.

మత్తావళి భయానక రసములోనూ, జకారి భీభత్సరసములోనూ చేయబడేవి.

మిక్కుటముగా మధ్యముసేవించి ఆ నిషాతో తురుష్కులు చేసిన అభియనమే మత్తావళి.

ప్రకృతి గీతములను పాడుతూ, అతి సున్నితమైన హావ భావములను ప్రదర్శిస్తూ చూచుచున్న స్త్రీ పురుషులను గూడ సిగ్గులో ముంచివేయునట్లు చేయబడిన నృత్యముపేరే జకారి.

## నవరస అభినయములోని దృష్టిభేదము

శృంగార అభినయములోని చూపులు:—

వికసించిన కనుబొమ్మలచేత అందమైనది, స్వచ్ఛమైనది, పవిత్రమైనది, రమణీయమైనది, ఆతృత, తన్మయత్వములను తెలిపేదిగా ఉండి, తనకు ప్రియమైన వస్తువుపై ఆదృష్టి ప్రసరింపజేయవలెను.

## వీర రసములో

నేత్రములను పూర్తిగా తెరవవలెను. గ్రుడ్లుకదలించక ఒకే వస్తువుపై దృష్టి ఉంచవలెను. నేత్రములు మెరయుచుండవలెను. ఒక్కొక్కప్పుడు దృష్టి యెక్కువగా ప్రకాశింపకుండుటకుగాను కండ్లను కొద్దిగా మూయవలెను.

## కరుణ రసములో

కండ్లుసగము మూసి గ్రుడ్లలో విచారము కనుపరచవలెను. కొన్ని సమయములందు కనురెప్పలను కొంచెముగా మూయవలెను. చూపును ముక్కుకొనపై నిలుపవలెను.

## రౌద్ర రసములో

ఆత్రుత వెలిబరచునట్లు అధికముగా కదులుచున్న కనురెప్పలు, ఎఱ్ఱనిగ్రుడ్లు; కఠినమైనట్టి, క్రోధమును వెలబరచునట్టి చూపు చూడవలెను. కొన్ని వేళలయందు గ్రుడ్లు నాడించక ఒకేచోట వుంచవలెను.

## హాస్య రసములో

కనుపాపలను సగముగా మూసి గుండ్రముగా గిరగిర త్రిప్పవలెను. కొన్ని సమయములందు కనురెప్పలను కొంచెముగా మూయవలెను. మరికొన్ని వేళలయందు కనుపాపలను కదల్చక ఒకేచోటనుంచి మరల యిటునటు ఆడించవలెను.

## భయానక రసములో

కొన్ని సమయములందు కళ్లు పూర్తిగా తెరువవచ్చును. పూర్తిగా మూయవచ్చును. లేక ఆత్రుత, హృదయాందోళనము తెలుపునట్లు గ్రుడ్లను కదలించుచు, తనచుట్టు ప్రక్కల భయముతో గూడిన చూపు తప్పించుకొని పారిపోవుటకు మార్గమును వెదకినట్లుచూడవలెను.

## భీభత్స రసములో

కండ్లు సగముగా మూయవలెను. కనురెప్పలు, గ్రుడ్లు ఆత్రుత వెలువడునట్లు తొందరగా ఆడించవలెను. ప్రక్కచూపులో అతిసూక్ష్మమైన దృష్టిగూడ ఉపయోగపడుతుంది.

## అద్భుత రసములో

చూపు ఆనందము, సంతోషము తెలుపునట్లు ఉండవలెను. కండ్ల నిటునటు కదల్చక దృష్టిని ఒక వస్తువుపై నే ఉంచవలెను. కొన్ని

సమయములందు సూక్ష్మదృష్టి, సగము మూయబడిన కండ్లనుగూడ ఉపయోగించవచ్చును.

### శాంత రసములో

ఎట్టి తత్తరపాటులేక స్వాభావికముగా, స్వచ్ఛముగా, సాత్వికముగా చూపును ఉపయోగించవలెను.

వృత్తులు:— కైశిక, సాత్వతి, భారతి, ఆరభటి అని వృత్తులు నాలుగు విధములు.

శృంగార హాస్య కరుణరసములలో కైశికవృత్తి; భయానక భీభత్స రౌద్రరసములలో ఆరభటి వృత్తి; వీర, రౌద్ర, అద్భుత రసములలో సాత్వతి, భారతి వృత్తులు ఉపయోగించబడుతాయి.

నర్తకీ నర్తకులు చక్కని సంగీతము పాడుచూ అతిరమణీయముగా, హృదయాహ్లాదకరముగా నృత్యమాడుటయే కైశిక వృత్తి.

సత్వగుణము ప్రధానమై, వీరత్వము, దయ, నిరాడంబరత్వము, విచారము లేక మన హృదయమునకు ఆనంద మిచ్చునట్టిది సాత్వతి వృత్తి.

గంభీరోపన్యాసములతో నిండి యుండి, పెద్ద పెద్ద పండితులతో సంస్కృతములో మాట్లాడుట, చర్చించుట మొదలగునవి భారతివృత్తి యనబడును.

మాయ, కనుకట్టు, యుద్ధము, క్రోధము, చెరయందుంచుట మొదలగు విషయములతో కూడి యుండునదియే ఆరభటివృత్తి.

### నవరసములకు అధిదేవతలు

శృంగారమునకు మహావిష్ణువు, వీరరసమునకు ఇంద్రుడు, కరుణకు యముడు, రౌద్రరసమునకు రుద్రుడు, హాస్యమునకు ప్రమాత, భయానక రసమునకు కాళి, భీభత్సమునకు మహాకాళి (శివునియొక్కస్వరూపమే), అద్భుతరసమునకు గంధర్వుడు, శాంతమునకు నారాయణుడు అధిదేవతలు.

## నవరసములలో పూర్వము ఉపయోగించటడిన గీతములు

శృంగారములో అమృత బంధకము,
వీరరసములో లహరి, కరుణలో
కంబూక, రౌద్రరసములో వినోదక,
హాస్యములో చుట్లల, భయానకలో
ధ్రువపదము, భీభత్స రసములో
త్రిపుట గీతములు నుపయోగించబడెడివి.

## నవరసములకు ఉపయోగించ వలసిన తెరలు

శృంగారములో తెల్లది, కరుణలో పొగరంగు, హాస్యరసములో అనేక రంగులు గలది, భయానకలో నీలవర్ణము, భీభత్సలో పొగరంగు, అద్భుతలో నలుపు, రౌద్రరసములో ఎరుపు రంగుగల తెరల నుపయోగించిన ఆ యా రసముల అభినయమునకు ఇవి చాలవరకు సహాయపడును.

## నవరసములయొక్క రంగులు

శృంగారరసము – ముదురు గోధుమ రంగు (Dark brown) లేక గులాబి రంగుతోను

వీరరసము – బంగారుఛాయతోను
కరుణ – నీలి మబ్బులేక బూడిద రంగుతోను
రౌద్రరసము – ఎరుపు లేక రక్తవర్ణముతోను
హాస్యము – తెలుపుతోను
భయానక – నలుపుతోను
భీభత్స – నీలిరంగుతోను
అద్భుత – పసుపుతోను
శాంత – కుందపుష్పము వంటి తెలుపుతోను
పోల్చబడినవి.

ఇట్టి సిద్ధాంతముల ననుసరించే 'కథకళీ' నృత్యములో వచ్చు పాత్రలు వారి వారి గుణములనుబట్టి ముఖమునకు రంగువేసికొందురు.

పూర్వకాలమున మలబారులో చేయబడిన రామనటనమే ప్రస్తుతపు కథకళీ నృత్యము.

'కథకళీ' ముద్రనృత్యము. ముద్రలే దీనికిజీవము. ముద్ర లేనిచో 'కథకళీ' నృత్యమే లేదు. ముద్రలనగా నృత్యములలో పశుపక్ష్యాది జంతువులు, వృక్షములు, నదులు మొదలగువానియొక్క అభినయమున కుపయోగపడు హస్తచిహ్నములు. 'కథకళీ' అనగా నృత్యగీతములతో కూడుకొనిన నాటకము. వీరు సాధారణముగా రామాయణ, మహాభారతాది పురాణములను ప్రదర్శిస్తారు. ఇది తాండవనృత్యమగుటచే దీనిలో పూర్వము స్త్రీలు పాల్గొనేవారు కారు. స్త్రీపాత్రలుగూడ పురుషులే అభినయించెడివారు.

కీచకవధ, దుశ్శాసన, మయూర నృత్యములు కథకళిలో ముఖ్యముగా చూడవలసిన నృత్యములు.

## మోహినీ ఆట్టము

ఇది కథకళీ కన్న పురాతననృత్యము. కథకళీ ప్రత్యేకముగా పురుషుల నృత్యమగుటచే మోహినీ ఆట్టము స్త్రీలు చేసేవారు. ఇది లాస్యనృత్యము. ఇది దాదాపు తమిళులలోని అభినయ కత్తును (అభినయమును) పోలియుంటుంది. భరతనాట్యమువలె యిది ఒక్కరిచే చేయబడుతుంది. ఈ నృత్యములో శాంత, భీభత్సరసములు తప్ప అన్ని రసములు అభినయించబడును.

కుట్టారకర సంస్థానాధీశునిచే చక్కియార్ కుత్తు','కుట్టియాటమ్' ప్రచారములోనికి తేబడినవి. ఇవి 'కృష్ణాటము' కన్న పురాతనమైన నృత్యములు. 'కృష్ణాటము' గీతగోవిందమును చాలవరకుపోలియుండును. కేరళనృత్యమును మూడు భాగములుగా విభజింపవచ్చును.

(1) దైవికము.

(2) దైవ సంబంధమై పాండిత్య ప్రదర్శనముతో కూడుకున్నది.

(3) సామాన్యముగా జనులను రంజింప జేయుటకు ప్రదర్శింప బడునవి.

భగవతిపాటు, తియట్టు, పన,పాటు మొదలైనవి దేవళములలోని ఆలయప్రాంగణములలో భగవతిని స్తోత్రముచేయుచూ చేయబడునవి.

కుత్తు, కృష్ణాటము, శెంగకళి మొదలైనవి దైవసంబంధనృత్యము లయిననూ పాండిత్య ప్రదర్శనముతో కూడుకొన్నవి. సంస్కృత శ్లోక మయమయిన పురాణ నృత్య గాథలు.

తుల్లల్, మోహినీ ఆట్టము, కయికొట్టికల్, పతకము - యివి సాధారణముగా జనులను రంజింపజేయుటకు చేయు నృత్యములు. కథకళీ కేవలము వినోదార్థము చేయబడు ప్రదర్శనమగుటచే యెక్కువగా ప్రజాదరము పొందుతున్నది.

కవికొత్తు:—డప్పులువాయించుచు ప్రజలకు నృత్యప్రదర్శనము జరుగునని తెలుపుటకు కవికొత్తు అందురు.

సేవకళి:—ఊరిలో ప్రదర్శనముచేయుటకుముందు దేవళములో భగవంతు నారాధించుచు నృత్యమాడుట. ఇది ఆ గ్రామదేవతను సంతోషపరచుటకు ఆరాధించుట. ప్రజలకు తమ నృత్యకళలోని పాండిత్యమును జూపుచు వారిని ప్రదర్శనము జూచుటకు ప్రోత్సహించు టకు ఉపయోగపడును.

పురప్పాడు:— మొదటిసారి స్టేజిపై నర్తకులు కనబడుట. ఇందు అందరూ నిలబడుదురు. పాటకుడు 'మంజతర' గీత గోవిందము లోని కొన్ని అష్టపదులను పాడును.

తొటాయము:—ఇది భరతశాస్త్రములోని పూర్వరంగమును పోలియుండును.

తొటాయము పురఫల్లునందు నర్తకులు తెర ముందుకు వచ్చి నృత్యమాడుదురు. ఇది మన నాటకములోని 'నాంది'ని పోలియుండును.

ప్రతిఘట్టము ముగించునపుడు గుండ్రముగా తిరుగుతూ నృత్య మాడుదురు. ఇది 'కళాశా' అనబడుతుంది.

కథకళీ ముద్రనృత్యమని చెప్పబడింది. కథకళీలో ప్రతి ఒక ముద్ర ఒక నృత్యమగుతుంది. ప్రతి ముద్రకు దానికి సరిపోవు అంగ చలనము, నేత్రచలనము ఉంటుంది. ఒక సామాన్యవిషయమునుగూడ అతిరమణీయముగా, హృదయాహ్లాదకరముగా ప్రదర్శించుటయే కథకళీలోని ముఖ్యవిశేషత.

కథకళీనృత్యము ఆంధ్రదేశములోని వీధినాటకము వంటిదే అయినను దానిని ప్రస్తుతకాలపు రంగస్థలమునకు (stage) పనికివచ్చు కళగా తయారుచేసిన వారిలో స్వర్గీయ గురుశంకర, నంబూద్రి, వల్లతోల్ మహాకవి ముఖ్యులు.

ఉదా:—పూచిన తామరపువ్వులపై తేనెటీగ వ్రాలి దానిలోని మకరందమును త్రాగుతుంది.

ఈ చిన్నవిషయమును ఎలా అభినయిస్తారో చెప్పబడుతుంది.

ముందు నర్తకుడు సమభంగిమలో నిలబడి రెండుచేతులనుచేర్చి బొడ్డునకెదురుగా పట్టును. రెండుచేతులను దోస్నెలవలెచేర్చి పట్టుటచే అది అచ్చముగ తామరమొగ్గవలె ఉంటుంది. అతని దృష్టిగూడ వికాసము లేక అతి సూక్ష్మముగా కన్నులుమూసి యుండును. తాళ లయ ననుసరించి పాదములు వేయును. కొలనులో దాగొనియుండిన తామరమొగ్గ లెటుల ప్రభాతసమయములో నీటిపైకి వస్తాయో ఆ విధముగనే ఆ కపోతహస్తము నెత్తి వక్షస్థలమున కెదురుగా తెచ్చి యుంచును. తరువాత కమలరేకులు ఒక్కొక్కటే సూర్యకిరణములకు విడునట్లు చేతివ్రేళ్ళను ఒక్కటొక్కటే విప్పును. దానిననుసరించి దృష్టి గూడ క్రమేణా ప్రకాశవంతమైయుండును. అన్నివ్రేళ్ళు విప్పి పుష్పములాగున పట్టినప్పుడు కనులుగూడ పూర్తిగ తెరువబడును. ఇక్కడికి పద్మనృత్యమైనది. తరువాత అతడు భ్రమరి వచ్చుట నభినయించును. ఎడమచేతితో ఆ పద్మహస్తమును చేపట్టిఉంచి కుడి చేతితో భ్రమరహస్తము పట్టును. దృష్టిగూడ కుడిచేయిపై నుండును.

తేటి మకరందము గ్రోలుటకు పుష్పముకొరకు వెతికినట్లు అతడు చేతిని ఇటు నటు నాడించును. దానితో అతని నేత్రములుగూడ కదలును.

కడపటికి అదికొలనులోని తామరపువ్వులను చూస్తుంది. ఎక్కడా ఆగక సరాసరి ఆ పువ్వును చేరుతుంది. ఆపువ్వు రెక్కలపై వ్రాలుతుంది. ఎడమచేతితో పట్టిన పద్మహస్తము వ్రేళ్ళపై కుడిచేతితో పట్టిన భ్రమరహస్తము మోపుతాడు. ఒక క్షణము అది సంతోషముతో తేనెను త్రాగుతుంది. అతడు నేత్రములలో ఉల్లాసము కనపరచును. కాలిగజ్జెలు 'చనన చనన చన్ చనన చనన' అని మ్రోగుతాయి. కడుపునిండా తేటి మకరందాన్ని గ్రోలుతుంది. అతడు నేత్రములలో సంతోషము వెలిబుచ్చును. తర్వాత ఆ తేనెటీగ తనరెక్కల కంటుకొనిన పుప్పొడిని దులుపుకుంటూ ఎగిరిపోతుంది.

కథకళీప్రదర్శనములో వెనుకనుండి వారుచేయు నృత్యకథ పాడబడును. దానిననుసరించి, దాని భావమును నర్తకుడు అభినయించును. ముందువేయబడిన తెరగూడ ఇప్పటి మననాటకములలోవలె నుండదు. దానిని రెండుకొనల యందిరువురు పట్టుకొని నిలువబడెదరు. ఇది చాల ముఖ్యమైన విషయము. వారు నర్తకులుచేయు అభినయమునుబట్టి తెరను ఎత్తుతూ దించుతూ వుంటారు.

నృత్యములో శరీరములోని అన్నిభాగములనుగాక ప్రత్యేకముగా ఒకముఖమునే ఒక సన్నివేశములో నర్తకుడు వుపయోగించు చున్నాడనుకొందము. అప్పుడు వారు తెరను పూర్తిగా అతని అవయవములు కనబడకుండాయెత్తి, అతని శిరమును మాత్రము చూపెదరు. కొన్ని సమయములందు కాళ్ళతోపనిలేక కేవలము నడుముకు పైభాగము నుండే నర్తకుడు కదల్చుచున్నాడనుకొందము. అప్పుడు వారు తెరను నడుమువరకే ఎత్తియుంచెదరు. చూపరులకు కటి పై భాగమే కనబడును.



# కూచిపూడి సిరైకేళా నృత్యములు

ప్రపంచములోని లలితకళ (కావ్యము, గీతము, వాద్యము, నాట్యము, నృత్యము, చిత్రలేఖనము) లన్నిటిలోను ఒక్క నృత్య కళనే సంపూర్ణముగా పేర్కొనవచ్చును.

మనము చక్కని కావ్యము చదివితే ఆ కావ్యములోని దృశ్యము మన నేత్రముల కెదురుగా కనబడక పోవుటచే, అది హృదయమునకు మాత్రమే ఆనందమునిస్తుంది. అటులనే గీత వాద్యములు చెవులకు మాత్రమే ఆనందము కలుగచేయుచున్నవి. చిత్రలేఖనము మన నేత్రములకు ఆనందము నిచ్చిననూ, అది జీవములోని బొమ్మ. గీత వాద్యయుతమైన నృత్యకళ అటుగాక చెవులకు, నేత్రములకు, హృదయమునకు - సర్వేంద్రియములకుగూడ ఆనందము నిచ్చు చున్నది.

మండు వేసవికాలమున భూమి చుర చుర కాలుతూంది. రోడ్డుపైన తారు కరిగి కాళ్లకు అంటుకొని నిప్పుత్రొక్కినట్లు మండు చున్నది. ఆసమయములో ఒక నిరుపేద అతికష్టముతో వగుర్చుతూ 'రిక్షా' లాగుతున్నాడు. అందులో ఒక లావుపాటి మనుష్యుడు కూర్చొని వున్నాడు. రిక్షావాని శరీరమునుండి చెమట ధారలుగా కారుతున్నది. వాని కడుపు వెన్నుకంటుకుపోయి ఉన్నది. శరీరములోని ప్రతీయెముక కనబడుతోంది. వాడు కొనఊపిరితో పరుగెత్తుతూ రిక్షా లాగుచున్నాడు. వాడు మధ్య మధ్య కొంత మెల్లగా నడుస్తుంటే "ఊ-తొందరగా పరుగెత్తవోయ్, ఏమిటీ పెండ్లినడక"అని ఆలావుపాటి మనిషి కసరుతున్నాడు.

ఈ దృశ్యము చూచినచో ప్రతి మానవునికి జాలి కలుగుతుంది. కరుణరస ముద్భవిస్తుంది. ఆ దారిని పోతూ ఆ దృశ్యమును చూచిన ఒక ప్రజాకవి ఆవిషాదఘట్టాన్నే పద్యరూపమునో, గద్యరూపమునో వ్రాసి ఆ విషయమును ప్రపంచము ముందుంచును. ఒకగాయకుడు గీతమునకు స్వరమును వ్రాసి కరుణరస మొలుకునట్లుగా గానము

చేయును. వాద్యగాడు వాయిద్యములతో దానిని ప్రదర్శించును. ఆ విషాదమును ఒక చిత్రకారుడు చిత్రాకృతిని చిత్రించును.

అట్లుగాక ఆదృశ్యమునే పాటపాడుచూ దాని భావము నభిన యించునప్పుడు గాని, దాని నొక కథగావ్రాసి గీత వాద్య సహాయ ములతో ఒక నర్తకుడు నాట్యమాడునపుడుగాని గలుగు సంపూర్ణ ఆనందము చిత్రము చూచినప్పుడుగాని, వినినపుడుగాని గలుగదు. అందువల్ల గీతవాద్య చిత్రలేఖనములతో గూడుకొనిన ఒక నృత్య కళయే సంపూర్ణ కళగా చెప్పవచ్చును.

అట్టి ఉదాత్తమైన కళ మనదేశములో ఇంతటి హీనస్థితి వచ్చుటకు, ఇటుల నీచముగా చూడబడుటకు కారణమేమి ?

కళకు స్వరూపములేదు. గంగా జలమువలె అది పవిత్రమైనది. జలము ఏ పాత్రలో పోసిన ఆ పాత్ర రూపమును దాల్చును. పవిత్ర లలిత కళల నారాధించెడు కొంధరు కళారాధకులయొక్క నిత్య జీవిత విధానమే ఐన ఈకళ మనదేశమున ఇట్టిహీనదశకు వచ్చుటకుకారణము. మన దేశమును అనేక చీలికలుగాచేసి, పరస్పర విరోధములను పెంపొం దించి దేశ వినాశమునకు కారణమైన 'జాతి' సిద్ధాంతమే కళయొక్క వినాశనమునకుగూడా కారణము. పూర్వము వృత్తుల ననుసరించికులము లేర్పరుచ బడినవి. ఒక వృత్తి గౌరవమైనదీ, ఇంకొక వృత్తి నీచమైనది అను సిద్ధాంతము స్వలాభపరులునూ, స్వార్థపరులునూ, దేశ వినాశ కారకులును అయిన దేశద్రోహులచే కల్పింప బడినది. కానీ మన గుడ్డి ప్రజానీకము వారి బోధనలకు మోసపోయి మన సంఘాన్ని ఈ విధంగా తయారుచేసారు. ఏ నాడైతే సంఘమార్గ దర్శకులలో స్వలాభ, స్వార్థపరత్వములూ కలిగాయో, నాడే సామాన్యజనులు తమ కర్తవ్యములను మరచిపోయారు. వారుగూడ ఈ తప్పుసిద్ధాంతములను నమ్మి పెడదారి పట్టారు. నీతి, అవినీతి అను విచక్షణలేక ప్రవర్తించ మొదలుపెట్టారు. తామే సంఘము, తమలో ప్రతిమొక్కని చర్యలే సంఘగౌరవమునకు, శ్రేయస్సునకు లేక సంఘ వినాశనమునకు కారణ మవుతాయన్నది మరచిపోయి తమ శ్రేయస్సుకొరకే పాటుపడ మొదలు పెట్టారు. ఈ దోషమే నృత్యకళ నారాధించే దేవదాసీలలోగూడ

ప్రాకింది. వారు స్వలాభమున కాశపడి కళకు చేయుచున్న దోషమును గ్రహించక తమ జీవితము నవినీతికరముగ గడుపుటకు మొదలుపెట్టారు. సంఘము ఆ కళారాధకులను దూషించక ఆదోషము కళకే రుద్దింది. ఇదే మన సంఘముచేసిన గొప్ప పొరబాటు.

ప్రతిసంఘము కొన్ని ఆదర్శ సిద్ధాంతములపై ఆధారపడి యుంటుంది. వాని ననుసరించి ప్రజలనిత్య జీవితముగూడ యుంటుంది. పూర్వము గ్రీసుదేశమువారు వీరత్వమునకెక్కువ ప్రాముఖ్యతనిచ్చారు. అందువలన వారి చిత్రలేఖనమును చూచినగాని, వారి పురాతన చరిత్రి చదివినగాని అది పూర్తిగ వీరులతో నిండియుంటుంది. వీరత్వము తెలుపని కవిత్వముగాని, శిల్పముగాని, నాట్యముగాని వారు బహిష్కరించేవారు.

అలాగే ఇండియా, చైనా, యూదులకు తమమతమే ఆదర్శముగా నుండుటచే వారి కావ్యములుగాని, నృత్యములుగాని, గీతములుగాని అన్నీ భగవత్సంబంధమై వుండినవి. ఇతరులనేవారు బహిష్కరించేవారు. అందువల్ల మనదేశములో నృత్య కళగూడ మన పూజలలో ఒక భాగమైయుండినది. దానిని దైవచింత గలిగి విషయ వాంఛలతో సంబంధములేని దేవదాసీలు ఆరాధించేవారు. కాని కాలము మారుతూ రాగానే వారు ధనమున కాశపడి, వేశ్య వృత్తిలోనికి దిగి పవిత్రి నృత్య కళకొక కళంకము తెచ్చారు. మన సంఘము ఈ నిజమును గ్రహించి శిథిలావస్థలోనున్న లలితకళల నుద్ధరించవలెను.

ప్రపంచము ముందుకు నడుస్తూంది. రోజు రోజుకూ ప్రపంచములో ఎన్నోమార్పులు కలుగుతున్నాయి. దానిననుసరించి మన దేశము ముందుకు నడచినా, మనకళమాత్రము యింకా వెనుకబడి యున్నది. దీనికి రెండు కారణములు గలవు. మనము ఉన్నదానితోనే సంతృప్తిచెందుట, నూతన విషయ పరిశోధనకు పూనుకొనకపోవుట – ఈ కారణముల వల్లనే మన సంఘము వెనుకబడి ఉన్నది.

పూర్వము రెండువేల సంవత్సరములక్రింద 'ధన్వంత్రి' ఆయుర్వేద శాస్త్రమును వ్రాసాడు. అతడు అప్పటి కాలములో ప్రబలి

యున్న వ్యాధులు, వాటికి తగుచికిత్సలను గురించి వ్రాసాడు. కాని, ఈ రెండువేల సంవత్సరములలో ప్రపంచము ఎంతో మారిపోయింది. ఎన్నో క్రొత్తక్రొత్త వ్యాధులుగూడ ప్రబలినవి. కానీ మన ఆయుర్వేద పండితులు ధన్వంతరివ్రాసిన గ్రంథముతోనే తృప్తిపడుటచే క్రొత్తక్రొత్త జబ్బులను ఎటుల చికిత్సచేయవలయునో తెలిసికోలేక పోయారు. దీనికి కారణము వారు శాస్త్రపరిశోధన చేయకపోవుటయే. మనవారు ధన్వంతరి వైద్యశాస్త్రములో ఆ వ్యాధికి చికిత్సలేదనిచెప్పి తృప్తి చెందక, శాస్త్ర పరిశోధనగూడ చేయవలెను.

ఆ మాదిరిగానే నృత్యకళలో కూడ యిప్పటి కాల పరిస్థితులను బట్టి మన కళను ఎటుల వుపయోగించుకొనవలయునో మనకళావేత్తలు ముఖ్యముగా గమనించవలెను. పూర్వము 'ఎలక్ట్రిక్' పంకాలు, టెలిఫోన్లు, మిల్లులు మొదలైనవి మనదేశములోలేవు. అందువల్ల ఇట్టి వాని కన్నిటికి మనము క్రొత్తముద్రలు కనిపెట్టవలసి ఉంటుంది. మనము కాలముతో సరిగా వెళ్ళకపోతే కళ నిర్జీవమవుతుంది. భరతశాస్త్రము వ్రాసిన సమయమునకు, ఇప్పటి నూతన యుగమునకు ఎంతో మార్పు ఉన్నది. ఆమార్పుకు తగినట్లు మన శాస్త్రములోగూడ కొన్ని క్రొత్త అంశములను చేర్చవలసి వుండును. ఇప్పటి నాట్యకళావేత్తలు ఈవిషయమును గ్రహించినట్లులేదు. వారికి ముందుకుపోవుటకు యిష్టములేదు. ఉన్నదానితోనే తృప్తిపడుచున్నారు. ఒక్క ఉదయశంకరుడుతప్ప మనకళకు మరెవ్వరూ నూతనత్వము కల్పించడానికి ప్రయత్నించినట్లు కనబడదు. ఏ నృత్య కళారాధకుడుచేసినా, అవే నృత్యములు, అవే కథలు. ఎవ్వరూ కళను యిప్పటి మనదేశ పరిస్థితులకు సరిపడునట్లు వుపయోగించకపోవుట విచారకరము. పురాతన పద్ధతులను వదలివేయమని నా ఉద్దేశముగాదు. మన పురాతన ఆదేశములను ఆధారముగా నుంచుకొని ఇప్పటి దేశకాల పరిస్థితులననుసరించి కళకుగూడ ఒక నూతనత్వము తీసుకొనివస్తేనే దానిని సజీవపరచిన వారమయ్యెదము.

ఈ లోకమే మన 'కూచిపూడి' నృత్యకళ హీనస్థితికి వచ్చుటకు కారణము. కాలము మారింది. మనుష్యులుమారారు. దేశము మారినది. దానికి తగినట్లు కళనుగూడ క్రొత్తపోకడలలో నడపవలసివుంటుంది.

అటుల చేయకపోవుటచే దానికి ప్రజాదరణ తగ్గింది. ప్రజాదరము పొందని కళ ఎన్నాళ్లు మనగలదు ? కొన్నిసంవత్సరముల క్రింద మలబారులోని 'కథకళీ' నృత్యముగూడా ఈ స్థితిలోనే వున్నది. కాని వల్లథోళ్ మహాకవి ఆకళకు ఒక క్రొత్తమెరుగు పెట్టుటచే ఆకళ యిప్పుడు ప్రపంచ ప్రఖ్యాతి నార్జించింది. కాని కూచిపూడివారు అట్టిదానికి నోచుకోలేక పరిగదా, వారు ఎప్పుడూ అందరూకలసి కళోద్ధారణకు పాటుపాటులేరు. ఇదే అంతచక్కని కూచిపూడికళ పేరు ప్రతిష్ఠలు లేకుండా ఉండుటకు కారణము.

కూచిపూడి కృష్ణాజిల్లాలోని ఒక గ్రామము. ఇచ్చటి ప్రజలచే ఆరాధింపబడిన కళ యగుటచే దీనికి కూచిపూడి నృత్యమని పేరు వచ్చినది. ఈ కూచిపూడి నృత్యముకూడా భరతశాస్త్రము ననుసరించి చేయబడిన దగుటచే తంజావూరు నృత్యమును చాలామట్టుకు పోలి యుండును. భరతనాట్యమందువలె దీనిలోగూడ పదవర్ణములు, తాన వర్ణములు, స్వరజతులు, పదములు, జావళీలు, కీర్తనలు, తిల్లానలు అభినయింతురు.

'శృంగారలహరి శ్రీతజన సుభకరి'

ఇది కూచిపూడివారి అభిమాన కీర్తన. ఈ నృత్యములోని కొన్ని ముఖ్య అంగములివి:—

(1) తద్దిం – దాదరి – దణత – జెఋందరి
దరేహి – ఋంతరి – రేహిణ – ణంతరి – ణంతరి
హంతరి – కుంతరి – తదణ – దణాం – దరణం
కిణణం – తరితహ – దణత ధిమి – తగణం
దిత్తక – జగణక – ణంత – కుం తదిగిణతోం

ఇతర నృత్య పద్ధతులలో లేనివి పై జెప్పినటువంటి 'శొల్లుకట్టు' జతులు నృత్యమాడుట కూచిపూడి నృత్యపద్ధతిలో ఒక విశేషము.

(2) శబ్దనృత్యము – శ్రీ నారాయణ తీర్థులవారి తరంగములను నృత్యమాడుటయందు వీరు సిద్ధహస్తులు.

"బాలగోపాల మా ముద్ధర కృష్ణా
పరమ కల్యాణ గుణాకర"

ఈ తరంగము నృత్యమాడినపుడు వీరి ప్రావీణ్యము తెలిసికొన వచ్చును.

'బాలగోపాల మా ముద్ధర' అని పాడుచు కృష్ణుని బాలలీలలను అభినయించి తరువాత నీళ్లతో నిండిన పళ్లెము అంచులపైన నిలబడి సప్త తాళములను పళ్లెములోని నీరు తొలగకుండా నృతమాడుదురు.

(3) దశావతారములు – మహావిష్ణు జగదోద్ధారణకై ఎత్తిన పది అవతారముల వర్ణనా గీతము.

(4) భామ కలాపము లేక పారిజాతాపహరణము:—

ఇది సత్యభామవిరహమును వర్ణించునృత్యము. శ్రీకృష్ణుడు రుక్మిణికి ఒకపారిజాత పుష్పమును తెచ్చియిచ్చెను. నారదునివల్ల ఆ వృత్తాంతము సత్యభామవిని కోపగించుకొనును. కృష్ణుడు ఆ వృక్షమును ఆమె మహాల్ ఆవరణలో నాటి ఆమెకోర్కె నెరవేర్చును.

భామకలాపమునందు అష్టవిధ నాయికాభినయము చక్కగా పోషింపబడును. నాయికలు, వారిచేష్టలు, వ్యాపారములు, రసపోషణ మొదలగు అంశములన్నియు చక్కగా యిమిడ్చి 'పారిజాతాపహరణ' నాటకము వ్రాసెను సిద్ధేంద్రయోగి – సిద్ధయోగి శ్రీకృష్ణలీలా తరంగిణి రచించిన నారాయణ తీర్థుల శిష్యుడు భగవత్ప్రేరితుడై పారిజాతాప హారణము వ్రాసి కూచిపూడి బ్రాహ్మణులకు నేర్పెను.

భామ కలాప స్వాధీన పతిక నాయికతో ప్రారంభమగును. చెప్పినట్లు విని, కోరినట్లు నడుచుకొను పతిగలది స్వాధీనపతికఅనబడును.

శ్రీకృష్ణుని ప్రేమకు పాత్రులు తనకుమించి ఎవ్వరూ లేరని ప్రగల్భములు పలుకుతుంది సత్య. పదహారువేల గోపికలలో తనకుసాటి ఎవ్వరూలేరని గర్వించును. నాథుడు తనకు దాసుడని సంతోషముగా చెలులతో ముచ్చటించును. తన నాథునితో గడపిన మన్మథ క్రీడలు,

శృంగార జీవితము సఖికి వర్ణించును. కాని, ఆసమయమున తన నాథుడు తన వద్దలేడు. అతడు కోపగించుకొని పోయెను.

ఇచట కలహాంతరిత నాయికను అభినయించును. పతి నవ మానించి నందుకు ఖేదపడును. ప్రియుని కఠినముగా మాట్లాడి వెడల గొట్టినందుకు విచారించును. ప్రియుడు తన యొద్దలేడు. అతడు లేనిది జీవించుటెట్లు? మరల నాథుని అనుగ్రహము ఎట్లు సంపాదించు కొందునాయని పరితాపము చెందును.

ప్రియుడు లేడని విరహతాపముచే దుఃఖించును. ఇదే విరహో త్కంఠిత ప్రియునికి రాయబారమంపును. తన ఏడు వారముల సొమ్ములను యిచ్చెదనని దూతికకు వాగ్దానముచేసి ప్రియుని గొనిరమ్మని ప్రార్థించును.

తననాథుడు అలసట దీర్చుకొనునప్పుడు, విడియము సేవించు నప్పుడు, అద్దములో చూచుకొనునప్పుడు, ఉల్లాసముగా ఉన్నప్పుడు, పుష్పపరిమళమును అనుభవించు చున్నప్పుడు, చక్కని సంగీతము వినుటకు విసుగుజెందినప్పుడు, ధర్మమునుగూర్చి చర్చించునప్పుడు-ఇట్టి సమయములలో తన దీనస్థితినెరింగించ మని బ్రతిమాలును. ఎట్టకేలకు దూతిక అంగీకరించును. కాని, శ్రీకృష్ణుని వద్దనుండి తిరిగి వచ్చిన చెలికత్తె శరీరముపై సంభోగ చిహ్నములు చూసి దూతిక తన నాథుని గూడి వచ్చినదని గ్రహించి దాని మోసపు బుద్ధికి దూషించును. తరువాత జయంత, వసంత, చిలుక, కోకిల, భ్రమరములను పంపించును. ఆఖరుకు ప్రియుడు వచ్చుటకు అనుగ్రహించును. అతడు రాగా సత్య అతనిని దూషించును. మోసగాడాయని నిందించును. అంతనాతడు పారిజాతవృక్షమును తెచ్చి సత్య పెరటిలో నాటుటకు వాగ్దానము చేయును. అంతలో రుక్మిణి ప్రవేశించును. సవతు లిద్దరు పోట్లాడు కొందురు. ఆఖరికి శ్రీకృష్ణుడు యిద్దరికి సఖ్యము గూర్చి ఆశీర్వదించును.

జడచరితము:—భామ సభలోనికివచ్చి తనజడ తెరపై వేయును. "తనకు సకల శాస్త్రములందు, సమస్త విద్యలయందు పాండిత్య మున్నట్లును, సభలో ఎవరైనా పండితులున్నచో తనతో చర్చించ వచ్చు" నని గర్వముతో సవాలుచేయుటయే దీనిఅర్థము.

పూర్వము కూచిపూడినుండి కొన్ని భాగవతము పార్టీలు ఆంధ్ర దేశములోని నలుమూలలు తిరిగి సంచారముచేసి 'ప్రహ్లాద', 'ఉషా పరిణయము' మొదలగు నృత్యనాటికలను ప్రదర్శించేవారు.

## సిరై కేళా 'చవ్వో' నృత్యము

సిరై కేళా సంస్థానాధీశునిచే పోషించబడుచున్న నృత్యకళయిది. దీనిలో ఆ సంస్థాన రాకుమారులే పాల్గొందురు. ఇది తాండవనృత్యము. ఇంచుమించు 'కథకళీ'ని పోలియుంటుంది. ఇందులో నృత్యము చేయు నపుడు నర్తకులు ముఖమునకు తొడుగులను (Masks) ఏ ఏ నృత్యములో ఆయా పాత్రకు సరిపోవునటువంటిది తగిలించుకొని నృత్యమాడుదురు. అభినయమునకు జీవమైన ముఖము కప్పబడుటచే వీరు రస భావములను సంగీతముయొక్క ఆధారముతో అంగచలనము ద్వారా ప్రదర్శింతురు.

వీరు చేయు నృత్యములలో కొన్నిటిని గురించి యిచ్చట వ్రాయబడును.

రాధాకృష్ణ – కాళీయమర్దన – లను గురించి ప్రతి ఒక్కనికీ తెలిసిన విషయమే.

## జీవితము ఒక మాయ

## (Life is an Illusion)

మానవుడు ప్రపంచములోనికివచ్చాడు. అసలు తానీ ప్రపంచములోనికి ఎచ్చటనుండి వచ్చాడు ? ఎందుకు వచ్చాడు ? జీవితాంతమున మరల ఎచ్చటికి వెళ్ళవలయును! ఇవిఅన్నియు ఎవరికీ అర్థముగాని పరమ రహస్యములు. ఈ పరమ రహస్యములను తెలిసికొనుటకు ఆత్మ తహాతహా పడుతుంది. దారులు వెదుకుతుంది. ఋషులు అరణ్యములో సంవత్సరముల తరబడి తపస్సు చేసారు. ఈ రహస్యము ఛేదించే కొరకు అనేక సాధనాలు కనిపెట్టారు. కాని జీవము మాయలోబడి ఏమీ తెలుసుకోలేదు. ఏదో ప్రపంచములోనికి వచ్చాడు. ఏదో జీవిస్తున్నాడు.

జీవితాంతములో తన భౌతిక దేహాన్ని వదలి వెళ్ళిపోతున్నాడు. భార్యా బిడ్డలు తనవారు కారు. తాను గడించిన ధనరాసులు తనవిగావు. చివరకు 'నేను' అనుకొనిన శరీరముగూడ మరణకాలము రాగానే అతన్ని వదిలిపెడుతుంది. మళ్ళీ తానెక్కడికి వెళ్ళిపోతున్నాడు – ఈ వేదాంత విషయమే 'జీవితము ఒక మాయ' అను నృత్యకథ యొక్కసారము.

## బంధజీవి (Prisoner of Life)

ప్రకృతిలో స్వేచ్ఛాగానముచేసే ఒక పరమాణువు – 'ఆత్మ'– మానవశరీరమనబడు పంజరములో బంధింపబడుతుంది. తనస్వేచ్ఛ కొరకు రెక్కలుకొట్టుకొనుచూ పెనగులాడుతుంది. పంజరములోనుంచి బయటబడి కోల్పోయిన స్వాతంత్ర్యమును మరల సంపాదించుకోగోరి తల్లడిల్లుతుంది. కాని దారి ఎక్కడ ? రోజు రోజుకి సంసారబంధములను మరింత బలపరచుకొంటుంది. ఇట్లు దుఃఖజీవియై కాలముగడిపి, ఆఖరుకు మరణకాలములో శరీరమును వదలి మరలస్వేచ్ఛా ప్రపంచములోనికి ఎగిరి పోతుంది.

## జీ వ నా వ

ప్రపంచమొక మహాప్రవాహము. మానవుని జీవితమొక నావ. ఆ నావ ప్రవాహంలో ప్రయాణంచేస్తుంది. భయంకరములు దాన్ని గమ్యస్థానమును చేరనీయకుండా ఆటంక పరుస్తాయి. సముద్రములో తుపాను రేగుతుంది. నావికుడు తనస్త్రీతోకలిసి ప్రయాణముచేస్తూ ఆ సంకటము లన్నింటినీ ఎదుర్కొంటాడు. కొన్నిసమయములలో దారి కష్టములులేక చక్కగా వుంటుంది. మరికొన్ని సమయములందు పెద్ద పెద్ద అలలు నావను బ్రద్దలుచేయుటకు ప్రయత్నిస్తాయి. కొన్ని వేళలందు ఆకాశము అంతా కారుమేఘాలతో కప్పబడి భయంకరమైన తుపాను చెలరేగుతుంది. ఆ అంధకారములో ఎటుబోవలయునో తెలియక పోయినా, నావికుడు మాత్రము తననావను జాగ్రత్తగా నడుపుతునే వుంటాడు. ఆఖరుకు జీవితాంతములో నావ తన గమ్యస్థానము చేరుతుంది.

## వేటగాడు (Hunter's Dance)

ఇందులో వేటాడుటకు అరణ్యములకుపోవుట, వేట, జంతువు లను చంపుట మొదలగు దృశ్యములు నాట్యము చేయబడును.

ఈనృత్యముచూస్తుంటే 'టాల్‌స్టాయ్' (Tolstoy) 'what is art' అనుపుస్తకములో వ్రాసిన రెయిన్‌డీర్ నృత్యము జ్ఞాపకము వస్తుంది.

"ఇద్దరు నర్తకులు రెయిన్‌డీర్ మృగము, దాని పసికూనగా దుస్తులుధరిస్తారు మూడవవాడు వేటగాడుగను, నాలుగవవాడు రెయిన్ డీర్ అపాయమునుగూర్చి తెలుపు పక్షిగాను దుస్తులు ధరిస్తాడు వేట గాడు రెయిన్‌డీర్, దాని పసికూనఅడుగు జాడలనుబట్టి వానినివేటాడు టకు పోతూవుంటాడు. రెయిన్‌డీరు తొందరగా పరుగెత్తుకొని పోతుంది. వేటగాడు దానివెంటవెడతాడు. మరలా రెయిన్‌డీరు ప్రవేశిస్తుంది. దానిపసికూన అలసిపోయి తల్లిపైకి ఒరుగుతుంది. తల్లికూడ ఆగి, ఊపిరి పీల్చుకుంటుంది. అంతలోనే వేటగాడువస్తాడు. విల్లునెక్కుపెట్టి అమ్ము వదలబోతాడు. వెంటనే ఆపక్షి "వెఱ్ఱిదానా, నిన్నుహతమార్చే వాడు దగ్గరకువచ్చాడు – ఊఁ! ప్రాణాలను కాపాడుకోటానికి తప్పించు కొని పారిపోండి" అన్నట్లు కూస్తుంది. తల్లీ, బిడ్డ తప్పించుకొని పారి పోతాయి. మళ్ళీవేటగాడు వానిననుసరించి పరుగెత్తుతాడు. పసికూన అలసిపోతుంది. వేటగాని అమ్ము పసికూన శరీరములో గ్రుచ్చుకొని రక్తము కారుతుంది. తల్లి ఆ గాయమునుండి రక్తము కారకుండా నాకుతుంది. వేటగాడు మరియొక బాణమువేస్తాడు. తన వూటబత్తె మునకు దొరికిన జంతువులను ఎత్తుకొని సంతోషముతో నృత్య మాడుచూ యింటికి పరుగెత్తుతాడు."

సిరైకేళా వేటగాని నృత్యముగూడా దాదాపు దీనిని బోలి వుంటుంది.

కళ అంటే ప్రకృతి. ప్రకృతి నారాధించే యోగియే కళారాధ కుడు. అతనికి జాతి మతములతోగాని, ప్రాపంచిక విషయములతోగాని సంబంధములేదు. అతడు ఈ ప్రపంచబంధములచే కట్టబడడు.

ఇప్పటి ప్రపంచములో కళను ఆరాధించే కళోపాసకులెందరూ - కళారాధకులుకారా !

"నేను హరిదాసునుగానయ్యా ! సిరిదాసును" అని కీ॥ శే॥ శ్రీ నారాయణదాసుగా రన్నట్లు కళ నాధారముగాగొని లేక కళనొక వృత్తిగాపెట్టుకొని జీవితము గడిపేవారే గాని, నిజమైన కళోద్ధారకులు గారు. ప్రపంచములో ధర్మమునశించి, అధర్మము వెలిగినప్పుడు ప్రపంచ మును మంచిత్రోవలో నడుపుటకు బుద్ధుడు, ఏసుక్రీస్తు, గాంధీజీవంటి మహాపురుషు లప్పు డప్పుడు ప్రపంచమున అవతరించినట్లే, స్వచ్ఛమైన కళ ప్రపంచమున నశించినప్పుడు కళోద్ధారకు లుదయించి కళోద్ధారణ చేయుచున్నారు. అట్టివారే నిజమైన కళోద్ధారకులు, నిజమైన కళాపిపాసులు.

అట్టి మహనీయులే త్యాగరాజు, తాన్‌సేను, క్షేత్రయ్య మొదలైనవారు.



# విశాలాంధ్రలో నృత్యకళ

"హిందూదేశము బానిసత్వములోనుండుట ప్రజల హీనతే, అనైక్యతలవలనగాదు. ప్రజలు తమ విజ్ఞాన సంస్కృతులను మరచి పోవుటవల్లనే" అని ఒక మహాకవి కొన్నిసంవత్సరాల క్రిందట అన్నాడు.

ఈ సత్యాన్ని మన కళాభివృద్ధికి పాటుబడే ప్రతికళాసేవకుడు గ్రహిస్తాడు.

మన సాంప్రదాయములను, మన సంస్కృతిని, మన ఆచారములను చులకనగా చూచుట మనకలవాటైనది. అది పరిపూర్ణజ్ఞానము వల్లగాక కేవలము అర్ధజ్ఞానమువల్లనే! మనసంస్కృతియొక్క విలువను మనము గ్రహించలేకపోయాము. కానీ, నేము స్వతంత్రులమైనప్పటికీ సగర్వముగా తలయెత్తితిరగాలంటే మన విజ్ఞాన సంస్కృతులను గూర్చి తెలిసికొనుట అత్యావసరము.

"అజంతా, ఎల్లోరా, అమరావతీ, నాగార్జునస్థూపములలోని లలితకళ మనదేరా" అను గీతము వ్రాసి పాడి ఆనందించుటమో, మన పురాతన ఆంధ్ర సామ్రాజ్య శిథిలములనుచూచి కన్నీరుకార్చుటమో నేర్చుకొన్నారుగాని ఆ కళలను పోషించుటగాని, అట్టికళలను పోషిస్తున్న కళారాధకులకు ప్రోత్సాహమిచ్చుటగాని మన ఆంధ్రులు తమ ముఖ్య కర్తవ్యముగా గ్రహించక పోవుట మన దురదృష్టము.

కథకళీ, మణిపూర్ నృత్యములంటే ప్రపంచానికంతా తెలియును. కాని కూచిపూడి నృత్యమంటే మన ఆంధ్రులకే తెలియక, అది వీధి భాగవతమని కొందరూ, కూచిపూడి కళలో రసభావపోషణలేదని కొందరూ అపోహపడుతున్నారు. మన కళోద్ధారణకు మనము పాటుబడకపోవుటయే దీనికంతా కారణము. కూచిపూడి నృత్యముగూడ భరతనాట్యమే అయినా అది ఆంధ్ర సాంప్రదాయముల ననుసరించి చేయబడు నృత్యము.

**"Feeling is the same whether in an yellow or a white, Indian or American."**

భావము ఒక్కటైనా ఆయా ప్రదేశములను, వారి ఆచార వ్యవహారములను, భాషనుబట్టి ఆ భావ ప్రకటనలో కొంతభేదము కనిపిస్తుంది. శాస్త్రమంతా ఒక్కటే. అది పుస్తకములుచదివి తెలిసికోవచ్చును. సాంప్రదాయములట్లుగావు. అవి మన తల్లి ఉగ్గుపాలతో మనకు యిచ్చునటువంటి విశేషత. ఒకజాతియొక్క ప్రత్యేకతను తెలిపేది సాంప్రదాయము. తంజావూరు నృత్యమూ (దక్షిణదేశ భరతనాట్యము), కూచిపూడి నృత్యమూ, భరతమేలయినా దేశాన్ని, ప్రజలనూ బట్టి మార్పు కనబడుతుంది.

ఆంధ్రజాతి సజీవముగానుండాలంటే మన లలితకళలు జీర్ణించకుండా కాపాడుటకు ఆంధ్రులందరూ పాటుబడాలి.

పోషణలేని విద్య, వాసన లేని పువ్వువలె నిష్ప్రయోజనము. ఇకనైనా మన ఆంధ్ర సోదరులు నిజాన్నిగ్రహించి ప్రోత్సాహము లేక మూలబడియున్న మన పురాతన కళలను – మలబారులోని మహాకవి వల్లథోల్ గారివలె, బంగాళములో బ్రతాచారి సంఘము స్థాపించిన దత్తుగారివలె, రవీంద్రనాథటాగూర్ గారివలె – ఉద్ధరించుటకు పూనుకొందురుగాక.

ఆంధ్రదేశములోని కొన్ని జానపద (పల్లెటూరివారి) నృత్యముల గూర్చి ఈ శీర్షికలో ముచ్చటిస్తాను.

ముందు హైదరాబాదులోని నృత్యములనుగూర్చి తెలుపబడుతుంది.

## ౧. జోగాట

హైదరాబాదులో మాల మాదిగ మొదలైన జాతులకు చెందినవారు చనిపోయిన శవములను స్మశానానికి తీసుకొని పోవునపుడు దారిపొడుగునా నృత్యముచేస్తూ తీసుకొని పోతారు. అట్లు నృత్యము చేయువారిని 'జోగు' వారని పిలుతురు. వారు డప్పులమీద నృత్యము చేస్తారు. ఆ నృత్యములలో నేను చిన్నతనములో చూచినదానిని గురించి వ్రాస్తాను.

ఇద్దరు స్త్రీలు శవముముందు నిలబడి డప్పువాయిద్యపు తాళము ననుసరించి నృత్యముచేస్తున్నారు. ప్రేక్షకులలోనుండి ఒకడు వారిమీద ఒక తువ్వాలు విసిరాడు. వారిద్దరు ఆ తువ్వాలు రెండుకొనలూ పట్టుకొని ఒకరి కెదురుగా ఒకరు నిలబడి – "సతీపతులు గూడినపుడు శుక్లంబు ఋతువైన పవనమందు పదునైదు దినములకునది గట్టిపడి పిండరూప మవును "– ఈ భావము వెలివడునట్లు తువ్వాలును మనము తాడును పేనునపుడు పురియెక్కించినట్లుచేసి ఒక స్త్రీ రెండవ స్త్రీకి తన చేతిలోనున్న కొననందించింది. ఆ స్త్రీ దానిని నులివేసి ఒకబొమ్మ మాదిరిగాచేసి భూమిమీద నుంచింది. వారిద్దరు దానిచుట్టూ నృత్యము చేసారు. రెండవ స్త్రీ ఆ బొమ్మ నెత్తి దానికి కన్నులు, ముక్కు, నోరు మొదలగునవి చిత్రించినట్లభినయించి దానిని క్రిందనుంచింది. మొదటి స్త్రీ దానికి చేతులు, కాళ్లు యేర్పడినట్లు; అది తల్లిగర్భములో తన అవయవములను కదలించుచున్నట్లు ఆ బొమ్మతో అభినయించింది. నవమాసములునిండి తల్లి శిశువును కనినట్లూ, పురిటిమంచము వదలి బయటికి పోవునపుడు గాలి తగులకుండా తల్లి తలపైకొంగు కప్పుకొను నట్లు, యేడ్చుచున్నబిడ్డను చేతితోపట్టుకొని ఆడిస్తున్నట్లు వారిద్దరూ ఒకరితరువాత ఒకరు అభినయించారు. తరువాత బాల్యక్రీడలు, వివాహజీవితము, ఆఖరుకు చనిపోవుటవరకు నృత్యముసాగి అంతటితో నృత్యము ఆగిపోయింది, శవము స్మశానమువైపుకు కదలింది.

(ఇది సంగీతరత్నాకరములోని 'పిండోత్పత్తి'ని పోలిన నృత్యము)

## ౨. బతకమ్మలాట

దీనిని మన ఆంధ్రలోని గొబ్బిఆట, తమిళదేశములోని కుమ్మి, గుజరాతులోని గర్బానృత్యములతో పోల్చవచ్చును.

దేవీనవరాత్ర సమయములో (అనగా దసరా నవరాత్రులు) హైదరాబాదుస్త్రీలు పూలను పళ్లెరములలో గోపురాకారముగ పేర్చి, తమఇండ్లముందు అలికి ముగ్గువేసిన ప్రదేశములో వుంచి, దానిచుట్టూ చేరి చేతులు తట్టుతూ, తిరుగుతూ,

"ఉయ్యాల వూసిపోయె వుయ్యాలో
కట్టతెగిపోయె వుయ్యాలో
కట్టకింది మైసమ్మ ఉయ్యాలో
వరమడిగినాది వుయ్యాలో

పెద్దకొడుకూనైన వుయ్యాలో
ఇచ్చేవో రాజ వుయ్యాలో
పెద్దకొడకూనిస్తే వుయ్యాలో
పేరు కెవ్వారమ్మ వుయ్యాలో"

ఈ విధమైన పాటలు పాడుతూ నృత్యము చేయుదురు. ఇది మన గొబ్బి ఆటను పోలివుంటుంది. నృత్యము ముగిసిన తరువాత అందరూ చెరువువద్దకుబోయి, పూజచేసి ఆ పుష్పములను నీటిలో వదలి వత్తురు. ఇటుల తొమ్మిది దినములు నృత్యము చేయబడును. తొమ్మిదవ దినము (ఆఖరు దినము) సద్దుల 'బతకమ్మ' అని మరీవైభవముగా సంబరము జరుపబడును. ఆ దినము పుష్పములను మనిషియెత్తుగాగూడ పేర్తురు. ఈ తొమ్మిదిరోజులు రాత్రులందు స్త్రీలు వివిధములైన జానపద గీతములు పాడుదురు. కోలాటము మొదలైన వినోదములతో పురుషులుగూడ పాల్గొందురు. ఇది ఒక విధముగ 'గౌరీదేవి ఆరాధన' యని పేర్కొన వచ్చును.

## ౩. వీర నాట్యము

ఇది కాకినాడ రాయలసీమ ప్రాంతములలో వీరభద్రుని సంబర సందర్భములో వీరముష్టివారు చేసే నృత్యము. వీరభద్రుని సంబరములో ప్రభల నూరేగించినపుడు 'ఖడ్గములతో' వారీ నాట్యమును చేయుదురు.

"డివి డివిట – డివ్వో
డివిట డివ్వో
డిడివిట – డివ్వో – డివిట డివ్వో
డివిట డివి – డివిట డివి
డివిట – డివిట – డివిట"

వీరణమువాయిద్యకుడు శబ్దములు పలికించును. నృత్యము ముందు విలంబిత లయలో మొదలగును. నాట్యగాండ్రు వాయిద్యముల ననుసరించి గజ్జెల ధ్వనించుచు, వీర రస మొలుకునట్లు తమ శరీరమును కదలించుచు నృత్యము మొదలు పెట్టుదురు. నాట్యము జరుగుచున్న కొలది తాళ లయ విలంబితములోనుండి మధ్య మధ్య ద్రుత లయకు మారును. తాళము ననుసరించి వారుగూడ త్వర త్వరగా నృత్యమాడుదురు. చూచెడి వారిలో ఒక విధమైన ఉద్రేకము, వీరావేశము పుట్టుతుంది. వీరత్వము వెలువడేటట్లు చేసే నృత్యము గనుక వీర నాట్యమని పేరువచ్చి వుండవచ్చును. ఇది తాండవ (అనగా పురుష పద్ధతికి సంబంధించిన) నృత్యము.

ఈ నృత్యము చూచినప్పుడు యుద్ధభూమిలో వీరులు స్వేచ్ఛా విహారము చేస్తూ, శత్రువుల ఛండాడుతున్నట్టి భావము మనలో కలుగుతుంది.

## ४. సేవ

"హరిహరినారాయ – ణాది నారాయణ
కరుణించి మమ్మేలు – కమలలో చనుడా
యాధవుని గోవులను – మాధవుడు గాయంగా
మాధవుడు మత్స్యావ – తారమెత్తినాడో
తారమెత్తినాడో"

ఈ మాదిరిగా పాడుతూ, నూనె కాగడాలను పట్టుకొని, పెద్ద తాళములను వాయిస్తూ సింహాద్రి అప్పన్న సేవచేయటం ప్రతి ఒక్కరూ చూచేవుంటారు. ఇది ఒక విధముగా నృత్యగీతములతో కూడిన – భగవంతుని–అగ్ని ఆరాధన (Fire worship). ఇట్టి ఆచారము మహారాష్ట్రదేశములో గూడ ఉన్నది. ఒక పెద్ద మట్టి మూకుడులో అగ్నివేసి, దానిమీద గుగ్గిలమో, నూనెయో పోసి; ఆ మండుచున్న మంటల మూకుళ్ళు రెండూ రెండు చేతులతో పట్టుకొని, కాళ్ళకు గజ్జెలు ధరించి, మేళతాళములతో యిప్పటికీ కొన్ని ప్రదేశములలో మహారాష్ట్ర ప్రజలు దేవిముందు నృత్యము చేస్తారు.

## ౫. అర్ధనారీశ్వరుడు

ఆంధ్రదేశములో పగటివేషము లన్నిటిలో అర్ధనారీశ్వరవేషము పేర్కొన దగినది. వేషగాడు సగము శరీరము అనగా ఎడమభాగమున పార్వతి అలంకారముగాను, కుడిభాగమున శివస్వరూపముగాను అలంకరించుకొని మధ్యనుండి ఒక తెరగట్టి సగముభాగము ఆ తెరలో మూసి యుంచును. వేషగాడు సాధారణముగా శివ పార్వతీ కలహగీతములను (డైలాగ్స్) పాడును. శివుని పాట పాడినపుడు పార్వతిభాగము (ఎడమ భాగము) ను గుడ్డతో కప్పి కుడిభాగముతో శివపాత్ర నభినయించును. మరల పార్వతిగీతముల పాడునపుడు ఆ తెరను అతి చమత్కారముతో మనకు తెలియకుండగనే మార్చివేయును. ఇదే యీ నృత్యములో చూడవలసిన విశేషము. ఈ విధముగ నతడు శివపార్వతి ద్వంద నృత్యము చేయును. అనగా లాస్యతాండవ నృత్యభేదములను చక్కగా పోషింపవలయు నన్నమాట.

## ౬. తోలు బొమ్మల భాగవతము

"కోన్ని గోసేదా పిల్లోడా
 కొంగని గోసేదా పిల్లోడా
  కొంగని గోసేదా"

"కోన్ని గోస్తే కులమోలొస్తరు
 కొంగని గొయ్యత్తో - ఓ యత్తమ్మా
  కొంగని గొయ్యత్తో"

"బూరెలు వండేదా పిల్లోడా
 గారెలు వండేదా పిల్లోడా
  గారెలు వండేదా"

"బూరెలు వండితె బురబుర మంటయి
 గారెలు వండితె గరగర మంటయి
  అరసెలు వండత్తో ఓ యత్తమ్మా
   అరసెలు వండత్తో"

జుట్టుపోలిగాడు, బంగారక్క-యొక్క- ఈ హాస్యగీతమును విని కడుపుబ్బునట్లు నవ్వని ఆంధ్రులుండరు.

**తోలుతో** చేయబడిన బొమ్మలతో భాగవతము ఆడుటచే దీనికి **తోలు**బొమ్మల భాగవతమని పేరువచ్చినది. (దీనిని గూర్చి 'నృత్యాంజలి' మూడవ భాగము తూర్పుదీవులలోని నృత్యకళ శీర్షిక క్రింద వ్రాయబడిన 'వాయాంగ్' నందు విపులముగా చెప్పాను.) వీరి మాతృభాష మరాఠీ. వీరు రామాయణము, భారతము మొదలైన పురాణగాథలను ప్రదర్శింతురు.

వీరుగాక వీధి భాగవతులు, కూచిపూడి భాగవతులు, గొల్ల భాగవతులు, బుట్టబొమ్మలాటగాండ్రు, గరగల నృత్యగాండ్రు, కోలాటము, కారువా మేళము (దీనిని గురించి "మన పురాతన నృత్య పద్ధతులు" అను శీర్షికలో విపులముగా చెప్పబడినది), కఱ్ఱసాము, కత్తిసాము, జంగంకథలవారు, పల్నాటి వీరకథలవారు - మొదలైన వారెందరో వున్నారు.



# ఓరియంటల్ నృత్యము

ఇది "నేటి కాలము ననుసరించి నవీన పద్ధతులలో చేయబడే ప్రాచ్య నృత్యము."

## బౌద్ధ భిక్షువుల అమృత జీవనం

(Oriental Dance — Modern Style of Dancing)

(ప్రాచ్యనృత్య సాంప్రదాయాల ద్వారా నాటికను ప్రదర్శించే విధానము)

ప్రాచ్య ప్రపంచ నృత్యము అనేక సాంప్రదాయాలలో వర్థిల్లింది. అభినయము భరత నాట్యమును పోలియుండవచ్చును. అంగసంచలనము మణిపుర పద్ధతివలె రమణీయంగా, కోమలముగా నుండవచ్చును పాద సంచలనము కథక్ నృత్యమువలె చిత్రగతులను కలిగి యుండవచ్చును. నృత్య నాటిక కథకళీ పద్ధతిలో చేయవచ్చును. కథననుసరించి అచ్చ టచ్చట చవ్వు నృత్యమునందువలె ముఖములకు తొడుగులను కూడా ధరించి కొందరునృత్యమాడుదురు. ఆహార్యము,ఆభరణములు, దుస్తులు, సిగకట్టు, రంగాలంకారము అజంతా చిత్రకళ ననుసరించుటకు అభ్యంతరము లేదు. ఇకసంగీత విషయమునందు గూడా క్రొత్తపద్ధతుల నవలంబించుటకు స్వేచ్ఛగలదు.

ఉదయ శంకరుడు మొదలగు ప్రఖ్యాత నర్తకులు తమనృత్య ప్రదర్శనములలో ఈ పద్ధతిని అమలులోనికి తెచ్చిరి. ఓరియంటల్ పద్ధతిని చేయబడు ఒక నృత్య నాటికను యిట ఉదహరింతును.

### "బుద్ధం శరణం గచ్ఛామి"

ప్రపంచములో తన దివ్యబోధనతో ప్రేమ వాహినులు ప్రవహింపచేసిన బుద్ధదేవుని యుగమునందలి ప్రజల హృదయములందు బుద్ధదేవుని దివ్యసందేశములు నాటుకున్నవి. వేలకొలది సామాన్య ప్రజలు సంసార బంధములనుండి విముక్తి చెంది ఆ పరమ పురుషుని స్మరిస్తూ తరించారు. రాజులు తమ రాజ్యములను వదలి సన్యసించారు.

పసికందులు ఆ జ్ఞానమూర్తిని స్మరిస్తూ మోక్షము నొందారు. అప్పుడు అజాతశత్రువు మగధను పాలిస్తున్నాడు. అతడు బౌద్ధ మత విరోధి. తనురాజైన వెంటనే తన రాజ్యములోని బుద్ధుని ఆరాధన నిషేధిస్తూ శాసించాడు. 'బుద్ధం శరణం గచ్ఛామి' అని స్తుతిస్తూ మందహాస వదనములతో ఎందరో భిక్షువులు అతని క్రూరహింసలకు బలియైరి. బుద్ధదేవుని స్మారకోత్సవమునాడు బోధివృక్షముకడ అనేక వేలమంది జనులు చేరిరి. అజాతశత్రువు దర్బారునర్తకి యగు శ్రీమతి గూడ వుత్సవమునందు పాల్గొనకుండునట్లు రాజు బోధివృక్షము క్రింద దర్బారు జరిపి అందు శ్రీమతి నృత్యము చేయునట్లు ఆజ్ఞాపించాడు. శ్రీమతి రాజాజ్ఞను ఎదురాడక అలంకరించుకొని బోధివృక్షము క్రిందకు వచ్చి భగవంతుని తన నృత్య కళతో ఆరాధించినది. అజాతశత్రువు ఆమె నృత్యమునుచూచి ఆనందించెను. కాని శ్రీమతి చేయునది నృత్యము మాత్రమేకాదు ఆమె సమాధిదీక్షలో బోధివృక్షముక్రింద కూర్చుని ఉన్న బుద్ధుని జీవితలీలలు తన నేత్రముల యెదుట గాంచుతుంది. నృత్యము చేస్తూ ఒక్కొక్క దుస్తును, అలంకారమును తీసివేయుచూ, నృత్యము ముగియులోగా బౌద్ధబిక్షుకిగా మారింది. ఆమె బోధివృక్షమునకు నమస్కరించి,

"బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి"

* * *

అని బుద్ధదేవుని కీర్తించింది.

ఇందు అజాతశత్రువుని దర్బారు, బుద్ధుని జీవితము ఒకే స్టేజిమీద ప్రదర్శింపబడును. బుద్ధుని జీవితమును శ్రీమతి, ప్రేక్షకులు చూచెదరు. కాని ఆ సమయములో అదేస్టేజిపై అజాతశత్రువు వున్నను మనకు కనబడడు. ఆస్టేజి యేర్పాటులను గూర్చి కొంత వ్రాస్తాను.

ఇట్టి ప్రదర్శనములో 'ట్రిక్‌లైట్లు' వుపయోగించబడును. స్టేజికూడ మన నాటకములందు వలె చౌకముగా గాక అర్థచంద్రాకార

ముగ నుండును. దానిని రెండుభాగములుగాచేసి, ఒక భాగములో అజాతశత్రువు దర్బారు యేర్పాటుచేయబడును. రెండవభాగములో బుద్ధుని జీవితం చూపబడును. ముందు రంగస్థలమంతయు చీకటి చేయబడును. కనుక బుద్ధుని జీవితము చూపబడిన ప్రదేశముపై మాత్రము 'స్పాట్‌లైట్' వేయబడును. మధ్య మధ్య శ్రీమతి ఆ దృశ్యమును చూస్తున్నట్లు చూపించుటకు మరొక చిన్న 'స్పాట్ లైట్' ఆమె ముఖముపై వేయుదురు.

బుద్ధుని జీవితలీలలు చూపించుట ముగిసినతరువాత రంగస్థల మంతయూ లైట్లు వేయబడును. అప్పుడు అజాతశత్రువుని దర్బారు ప్రేక్షకులకు కనబడును. కొన్ని సమయములందు 'రొటేటింగ్' లేక 'రివాల్వింగ్' స్టేజి ఉపయోగపడుతుంది. ఇందులో స్టేజి చక్రమువలె గుండ్రముగా తిరుగును. ఒకస్టేజిని రెండుభాగములుచేసి ఒక భాగములో బుద్ధుని, రెండవప్రక్క అజాతశత్రువుని దర్బారు చూపబడును. బుద్ధుని చూపవలసి వచ్చినపుడు స్టేజి త్రిప్పగా బుద్ధుడు ఉన్న భాగము ముందుకువచ్చును. మరల అజాతశత్రువును చూప వలసి వచ్చినపుడు అటులనే చేయబడును. కొన్ని సమయములందు మరొక విధమైన స్టేజి యేర్పాటు చేయబడును.

బుద్ధుడు అరణ్యములో సంచారము చేస్తున్నట్లు చూపవలె ననుకొందము. అట్టితరి, ముందు ఆ ఘట్టమునకు కావలసిన అరణ్య దృశ్యములు, వృక్షములు, నదులు, కొండలు మొదలగునవి తెరమీాద చిత్రించి స్టేజికి యిరుప్రక్కల రెండు స్తంభములకు ఆ పొడుగుపాటి తెర రెండుకొనలూ చుట్టుతారు.

బుద్ధుడు అరణ్యములలో సంచారముచేస్తున్నట్లు చూపవలసి వచ్చినపుడు ఆ పాత్రధారి రంగస్థలముపై తెరకు ముందువచ్చి ఒక చోట నిలబడును. ఆ తెరను ఒక ప్రక్కనుండి చుట్టుదురు. అప్పుడు అరణ్యములోని వివిధదృశ్యములు కదలుచుండుటచే చూచువారికి బుద్ధుడు అరణ్యములో సంచారముచేస్తున్నట్లు కనబడును. ఇటువంటి కొత్తరకము స్టేజి ఏర్పాటులు జపాన్, ఫార్మోజా మొదలగు ప్రదేశ

ములలో ఎక్కువగానున్నవి. మనదేశములో కలకత్తాలో కొంతవరకు ఇట్టి స్టేజి యేర్పాట్లు చేస్తున్నారు.

పై కథను నాటికగా అభినయించు క్రమము వర్ణిస్తాను.

ఢ్ఢంగ్ ... ... ... ...

ధంగ్‌తర ధంగ్ ధంగ్ ...
ధంగ్‌తర ధంగ్ ధంగ్ ...
ధంగ్‌తడ ధంగ్‌తడ ధంగ్ ...

తడధంగ్

ఈ గత్‌ను 'నగారా' పలికినది.

దిననక దిననక – దినక దినక దినక
దిననక దిననక – దినక దినక దినక

దినక దినక దినక
దిదాన తక తకదా

'నగార' గత్‌లోచేర్చి 'నగబోత్' పై ముకడా వాయించబడినది. ఇది ముగియగనే,

ధిరక్ ధిరక్ ధిరక్ – ధి త్రాంతన్
త్రాంధిరక్ – ధిత్రాంతక్
తళాంగ్‌తక – తడాంగ్ తకతక
తద్ధితళాంగ్ – తాంధి తళాంగ్
గిటగిటగిట – త్రాం ధిరక్ త్రాం

ఇట్లు కథకళీ "చెండ" వాయిద్యము గర్జించినది. వెంటనే,

దాకిట కిట – ధీకిట కిట
దినకిటకిట – తటకిట కిట
దాకిట – ధీకిట – దినకిట – కిటకిట – దా
దాదీ దినకిట – కిటకిట – తిట తిట – దా –
తిటకిట – కిట తిట

ఇట్లు 'కోలు' వాయిద్యము పైనముప్పై మొక్కజొన్న పేలాలు వేయించినట్టి శబ్దమువలె చిటపట ధ్వనులుచేసినది.

దాగే తిరకిట – తూనాకత్తా – తిరకిట – తూనాకత్తా – తిరకిట

తాగే తిరకిట – తూనాకత్తా – తిరకిట – డా –

తూనాకత్తా – తిరకిట

ఇట్లు 'తబలా' అతి సుకుమారముగా ఈ మొహరాను పలికినది. తరువాత,

రింఝు రింఝు రిపా – రింఝు రింఝు రిఖ

రింఝు రింఝు – రిరి రింఝు – రిక రింఝు

రిరి రిరి రింఝు – రిరి రింఝు

రిరి రింఝు రిరి – రిరి రింఝు రిరి రింఝూ రిం

రిరి రింఝు – రిరి రింఝు

ఈ విధంగా 'గాంజల' రొద పెట్టినది. ఆఖరికి,

దితగి ఝ్త తరికిట తక

దిరు తగి డ్త తరికిట తక

దితగి త్రి తకిట తక

తద్ధిత్తాం తధిగిణ తధిత్తాం తధిగిణత తాం

తధిగిణతోం తధిగిణతోం తధిగిణతోం

మద్దెల ఈ తీర్మానము పలికినది.

తెర యెత్తగానే అయిదు నిమిషాలు చర్మవాద్యములన్నీ ఒక దాని తరువాత ఒకటి ఈ విధముగా పలికినవి. హాలు నలుమూలలు ఈ నాదమే ప్రతి ధ్వనించుచున్నది. హాలులోని ప్రేక్షకులు నిశ్శబ్దముగా చూస్తున్నారు.

తడ్ ద్దంగ్ ... ...

స్టేజిమధ్యవున్న సన్నని నీలిరంగు తెర తొలిగిపోయినది. రంగస్థలముపై అరణ్య దృశ్యమును, ఒక బోధివృక్షమునుచూపు తెరయున్నది.

(అరణ్యమని సూచించుటకు ఇంగ్లీషు ఆర్కెస్ట్రా); తూర్పుదీవుల సమ్మేళన మందువలె పక్షుల సంగీతములు, జంతువుల అరుపులు బృంద గానమునందు పలికించ బడినవి).

తరువాత కాషాయ వస్త్రములను ధరించి చేతులలో జ్యోతులను పట్టుకొని కొందరు బౌద్ధ సన్యాసులు వచ్చి వృక్షమును పూజించి నిష్క్రమించిరి.

"నిందసి యజ్ఞ విధేరహహా శ్రుతి జాతం
సదయ హృదయ దర్శిత పశుఘాతం
కేశవ ధృత బుద్ధశరీర జయ జగదీశ హరే"

తెరలోపల పదిమంది స్త్రీ పురుషులు ఆర్కెస్ట్రా సంగీముతో కంఠముజేర్చి పై పాట పాడిరి. గీతాంతమున,

"ధంగ్ - ధంగ్ త - తంగ్ త - తంగ్
ధంగ్ - ధంగ్ త - తంగ్ త - తంగ్"

అని నగారా వాయిద్యము మోగుతున్నది. ఆ నాదముతో మిళిత మగునట్లు శంఖము పూరింప బడినది.

రంగస్థలమునకు ఒక ప్రక్కనుండి పదిమంది బాలికలు, అజంతా గుహలలోని చిత్రములవలె అలంకారములు ధరించి, ఆర్కెస్ట్రా సంగీతము ననుసరించి నృత్య మాడుతూ,

"జయదేవ జయదేవ జయబుద్ధదేవ
అహింసాతత్వ స్వరూపా నిరూపా"

అను గీతమును పాడుతూ బోధి వృక్షము సమీపించారు. ఇది గౌతముని ఆరాధన నృత్యము.

ఒక బాలిక చేతనున్న వింజామరతో విసురుతున్నది. ఇంకొక నర్తకి హారతి నిచ్చుచున్నది. మరియొక కోమలి పూవులతో పూజించు చున్నది. నాల్గవ యువతి ఫలముల నివేదించుచున్నది. ఐదవ లతాంగి బౌద్ధధర్మ గ్రంథము సూత్ర పీఠికను కన్నుల కద్దుకొనుచున్నది. ఆరవ భక్తురాలు నృత్యపూజతో ఆరాధిస్తున్నది. ఇట్లు వీరందరూ నృత్యము పూర్తిచేసి వెళ్ళిపోయిన పిదప ఒక నిమిషము నిశ్శబ్దముగా గడచినది.

“ప్రయా శీఘ్రేతే వ్యాస హింసాస్తు లోకే
సదాస్తి స్వశాంతి స్వసేతి స్వదాశి
స్వారాది ప్రసక్తిః పునర్జన్మహేతు
ర్భ జదరి నిరాకార నిర్వాణమేకమ్”

ఈ శ్లోకం కాషాయాంబర ధారియైన బౌద్ధభిక్షువు లోపలనుండి పాడుచూ వేదికపై ప్రవేశించెను. శ్లోకము ముగియు లోపల రంగస్థల మధ్యమునకు వచ్చి బౌద్ధమత గ్రంథము సూత్రపిటకలోని

“కమ్మనా వత్తతీ లోకో
కమ్మనా వత్తతీ పజా
కమ్మని బంధనాసత్తా
దదస్యాణీవ యాయతో”

పై శ్లోకము చదువుచు దాని భావము ‘కథకళి’ నందువలె ప్రతిమాటను ముద్రలతో అభినయించి ప్రేక్షకులకు అర్థమగునట్లు బోధించి అదృశ్య మయ్యెను.

తెరలో మంగళవాయిద్యములు ధ్వనించినవి. ఇద్దరు భటులు రాజలాంఛనములను చేతగొని రంగస్థలము ప్రవేశించి

శ్రీ శ్రీ అజాతశత్రువు మహారాజుగారు వేంచేయుచున్నారని ప్రేక్షకులకు తెల్పి పోవుదురు.

ఆర్కెస్ట్రా విలంబిత లయలో పాడుచున్నది.

అజాతశత్రువు, అతని పరివారము రాజఠీవితో సంగీతము ననుసరించి అడుగులువేయుచూ బోధి వృక్షమును సమీపించి తమకై అమర్చబడిన ఆసనములపై కూర్చున్నారు.

ఇంతలో నటుడు,

“తక్క దిమ్మితక – తత్తైత తక తక
తక్క దిమ్మితక – తత్తైత తక తక”

అని మృదంగము పలుక ఆ గతిననుసరించి నృత్తమాడుతూ సభలోనికివచ్చి రాజుకు నమస్కరించి ‘ఆజ్ఞ’అను భావము నేత్రములతో స్ఫురించునట్లు నిలబడ్డాడు.

"ఇక నృత్యము ప్రారంభించ వచ్చును" అనునట్లు ముద్రలతో రాజు అభినయించెను.

"ధిమ్ ధిమ్ ధిమ్ కిటతక
ధిమి కిట కిట కిట తక"

అని 'ఢోలు' పలుకుతున్నది.

ముగ్గురుస్త్రీలు మణిపుర పద్ధతిలో అడుగులు వేయుచూ రంగస్థలముపైకి వచ్చారు.

'ధిమికిట కిట దా'

అని సభకు నమస్కరించి సమభంగిమములో నిలబడ్డారు. వారు సిరైకేళా నృత్యమునందు వలె ముఖములకు తొడుగులను ధరించి యున్నారు.

"దాగే తిరకిట దా తిరకిట దినక దినక దిన్
తానే తిరికిట తా తిరకిట తినక తినక తిన్"

అని 'కథక్' పద్ధతి ననుసరించి ఈ 'తబలా' గత్‌ను నృత్తమాడుతూ ముగ్గురు యువకులు వచ్చి ఆ జవ్వనుల ముఖములపైనున్న తొడుగులను తీసికొని లోపలికి పోయిరి. అంత నా జవ్వనులు సభకు నమస్కరించి,

"తైతై దిత్తైతై, తై
తై దిత్తైతై, తై దిత్తైతైతై" అని పాడిరి.

పిమ్మట, భరత నాట్యమందు "అలంకరింపు" నృత్యమాడిరి.

"తాంజితాం – తైతతై – తాంజితాం – తైతతై
తాంజితాం తైతతై – తాంజితాం తైతతై
తత్తై తాహా – దిత్తై తాహా
తత్తై తాహా – దిత్తై తాహా
తాంకిణ్ ణక ణక – తక తధిగిణ తోం"

దీని తరువాత నటుడు,

"నా హృదయ పీఠిపై నాట్య మాడే దేవా

నన్నేలు కోరా నాదేవా"

అని పాడుచూ తాళము వేయుచుండగా ఆ ముగ్గిరిలో మధ్య నిలబడిన నర్తకి శ్రీమతి అభినయించు చున్నది.

గీతము ముగియగానే,

శ్రీమతి మణిపురి పద్ధతిలో ఆర్చషష్ట్రా ననుసరించిచేయు పూజా నృత్యమును చూచి ఆనందిస్తున్నాడు. శ్రీమతి చేయునది అతనికి నృత్యమువలె గాన్పించుచున్నదిగాని ఆమె సమాధి దీక్షలో బోధి వృక్షము క్రింద కూర్చుని ఉన్న బుద్ధుని జీవిత లీలలను తన నేత్రముల ఎదుట గాంచుచున్నది.

అంతః పురములో పాలరాతితో కట్టబడిన సభామందిరము మధ్య బంగారు సింహాసనమున గౌతముడు ఆసీనుడై యున్నాడు. అతని ప్రక్కన యశోధర ఉన్నది. ఒకదాసీ పాదము లొత్తు చున్నది. ఇద్దరు దాసీలు వింజామరలు వీచుచున్నారు.

వారికి ఎదురుగా కొందరు గణికలు వున్నారు. అందొకగణిక,

"మనవి గైకొనరా, నా చక్కని సామి

మమతమీర యున్నానురా, వినరా

శ్రీ కపిలవస్తీశా, గౌతమ నరేశా"

అని పాడుచూ, మిగిలిన స్త్రీలు వీణ, మృదంగము, వేణువు వాయించుచుండగా, తన వెనుకనిలడి ఇంకొక స్త్రీ పాడగా అభినయించు చున్నది.

ఇది శ్రీమతి జూచిన రెండవ ఘట్టము.

గౌతముడు సర్వాభరణములను తీసివేసి, కాషాయాంబరములను ధరించి చెన్నుని యింటి కంపి అరణ్యములలో సంచారము చేయుచున్నాడు.

బోధివృక్షముక్రింద తపస్సు చేయుచున్న బుద్ధుడు నిద్రాహారములు మాని అనేకదినములు తపస్సుచేయును. చిక్కి శల్యమగును. ఒక భక్తురాలు వృక్షమును పూజించుటకు తెచ్చిన పాయసము నతని కర్పించి భక్తితో ప్రణమిల్లెను.

## జ్ఞానోదయము

దీర్ఘసమాధిలోనున్న గౌతమునియందు గగనమునుండి ఒక ప్రకాశము దిగివచ్చి అతనిలో లీనమగును. అంత,

"కాయ మస్థిరము
సత్కర్మ చరణయే మోక్షమునకు త్రోవ
సర్వ దుఃఖములకు తృష్ణయే కారణము"
"ప్రేమచే క్రోధమును
మంచిచే దొసగును
పేరాసను ధాతృత్వముచేతను
అనృతమును సత్యముచేతను
జయింపవలయును"

అని ఈ దివ్యసందేశమును లోకమునకు చాటుటకు ప్రయాణమగును. నాటినుండి సిద్ధార్థుడు 'బుద్ధుడని' పిలువబడెను.

బింబిసారుని బుద్ధుడు యజ్ఞశాలలో కలియును.

"రాజా ! అహింస పరమధర్మము.

హింసయే సర్వదుఃఖములకు కారణము. విషయ వాంఛను జయించలేని మానవుని వస్త్రవిసర్జనము, జటామండల ధారణ, ఉపవాస దీక్షలు, ధూళి ధూసరిత దేహము, నిశ్చల సమాధి, కఠినశయ్యలు పవిత్ర మొనర్ప జాలవు."

బుద్ధదేవుని ఈ దివ్యబోధన బింబిసారుని ఆకర్షించును. అతడు వెంటనే బౌద్ధమతము స్వీకరించును.

వేలకొలది స్త్రీలు, పురుషులు ఈ దివ్యసందేశముచే ఆకర్షింపబడి సంసారములను వీడి సన్యసించిరి.

అట్టితరి,

ఒక తల్లి చనిపోయిన తన పుత్రుని గొని బుద్ధునియొద్దకు విలపిస్తూవచ్చి బ్రతికింపుమని వేడుకొనగా,

"బిడ్డా! జనన మరణములు ప్రాణులకెల్ల స్వాభావికములు. దుఃఖముచే నార్తి నొందని జనులీ లోకమునలేరు. దీనికై యడలుట యవివేకము" అని బుద్ధుడామెను ఓదార్చి ఆమెకు జీవిత రహస్యమును దెల్పును.

## బు ద్ధ ని ర్వా ణ ము

"బుద్ధం శరణం గచ్ఛామి"

చేత పూవులగొని, స్తుతిస్తూ భక్తులు ఆ దేవదేవుని భౌతిక దేహముపై పూలనుంచి పోతున్నారు.

శ్రీమతి నృత్యముచేస్తూ తన నేత్రముల ముందు ఆ దృశ్యము లన్నీ చూచింది. తను ధరించిన అలంకారములన్నిటినీ ఒక్కటొక్కటే నృత్యముచేస్తూ తీసివేసి నృత్యాంతమున బుద్ధభిక్షుకి దుస్తులతో ప్రత్యక్షమైంది.

"రాజా! బాహుబలము, ఆయుధశక్తి, మానవుని బహిశ్శరీరమును బంధించగలవు. అతనిని వశపరచుకొనునది అహింసాధర్మ మొకటే" అని రాజునకు తెలిపి,

"బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి"

అని బుద్ధదేవుని కీర్తిస్తున్నది.

(వెంటనే యిద్దరు రాజభటులువచ్చి ఆమెను బంధింతురు. శిరచ్ఛేదము చేయునట్లు రాజు సౌంజ్ఞచేయును.)

తక్షణమే బౌద్ధ సన్యాసి ప్రవేశించెను. "రాజా ! హింసవల్లను, మరణదండనవల్లను జీవియొక్క స్వాతంత్ర్యేచ్ఛను రూపుమాపగలవా? ఇది కేవలం మూఢత్వం. మరణదండన ఈ శరీరమును అంతమొన రించును గాని, ఆత్మను అంటగలదా? అహింసాత్మకులు, నిరాయుధులు అగు బుద్ధసన్యాసులను జయించితినని ఆనందించుచున్నావు. కాని, జీవుడు ఈ ప్రపంచములోనికి వచ్చినదిమొదలు ప్రతిక్షణము అతనిని మ్రింగుటకు కాచుకొనియున్న గర్భశత్రువగు మృత్యువును జయించ గలిగితివా ?" అని

రాజు నేత్రములలోనికిచూస్తూ సంబోధించాడు ఆ బౌద్ధసన్యాసి.

అజాతశత్రువు ఒక్కనిమిషము రెప్పనార్పక తీక్షణముగా భిక్షువును చూచుచు, ఎడమ చేతితో భటునకు 'కర్తరీముఖ' ముద్ర పట్టి చూపును.

రెప్పపాటు కాలములో బౌద్ధసన్యాసి శిరము అజాతశత్రువు కాళ్ళముందు పడింది. ఆత్యాగజీవి రక్తము బౌద్ధమతద్వేషి పాదములను తడిపినది. చూచుచున్న ప్రతివానిలో బీభత్స భయానకరసము లుద్భ వించుచున్నవి. సభ నిశ్శబ్దముగానున్నది. రెండు నిమిషములు తదేక దృష్టితో సభను తిలకించి,

'ఆహాహా' అని పెద్దగా అజాతశత్రువు నవ్వాడు.

"ధంగ్ తర ధంగ్ ధంగ్
ధంగ్ తడ ధంగ్ ధంగ్
ధంగ్ తర ధంగ్ ధంగ్
ధంగ్ తడ ధంగ్ ధంగ్"

అని విజయభేరి మ్రోగింది. (అవనికజారును.)

## సాధారణముగా మన నృత్యములలో ఉపయోగించు వాద్యములు

**భరతనాట్యము:—** మద్దెల, తాళము, ఫ్లూటు, వీణ, వయొలిన్, ముఖవీణ, క్లారనెట్.

కథకళీ:—చండ, మద్దెల, ముఖవీణ, వీణ, ఫ్లూట్, పెద్ద తాళ ములు, వయోలిన్.

కథక్:—తబలా, సారంగి, ఫక్, వాజ్, డోలక్, ఫ్లూట్, దిల్ రుబా.

మణిపూర్:—కోల్, ఇస్ రాజ్, మృదంగ్, తబలా, మాదల్, ఫ్లూట్, తాళము.

గాత్రము అన్నినాట్యములకు ముఖ్యము.

ఆర్కెష్ట్రాలో ప్రుపయోగించు వాయిద్యములు:-మద్దెల, మాదల్, ఫక్ వాజ్, కోలు, చండ, డోలక్, కంజీర, నగారా, డోలు, తబలా, ముఖవీణ, ఫ్లూట్, తాళము, జలతరంగము, కాష్టతరంగము, గంటల తరంగము, తబలా తరంగము, సరోద్, వీణ, సితార, సారంగి, దిల్ రుబా, ఇస్రాబ్, శంఖము, క్లారనెట్, సాక్సఫోన్, గుల్లచేయబడిన కొబ్బరి కాయలో గులకరాళ్లువేసి ఉపయోగింతురు.

నాట్యములో వేయుతాళములు ఒకటి ఉక్కుదీ, రెండవది కంచుదీ అయి వుండాలి.

చర్మ వాయిద్యములన్నిటిలో పురాతనమైనది శంకరుని ఢమరుకము.

# నృత్య ప్రదర్శనము

## నర్తకునకు సూచికము

తెరయెత్తినవెంటనే హాలులో రంగస్థలముపైనున్న లైట్లన్నియు ఆర్పి వేయవలయును. నృత్యమందిరమంతయూ చీకటియగును. మూడు నిమిషములు మృదంగము వాయించవలయును. తాళగతిగాక, ఆవృత్తంలో వాయించే ముగింపు, కీర్తనము వాయించవలయును. హాలు నలుమూలలా ఈ నాదమే ప్రతిధ్వనించును. ప్రేక్షకుల హృదయమందుగూడ ఒక విధమైన ఉత్సాహము, ఉల్లాసము ఉత్పన్నమగును.

ముదురు నీలిరంగు లేక నలుపు రంగు తెరలు వీనికి ఎక్కువ సహాయకారిగా నుండును.

తిరిగి లైట్లువేయగనే నర్తకుడు సమభంగిమలో, సమదృష్టిని ప్రేక్షకులపై నిలిపి, నిలబడి ప్రేక్షకులముందు ప్రత్యక్షమవ వలయును. నేత్రములు అర్ధ నిమీలితములై మెరయుచువానియందు ఉత్సాహము, ఆనందము వెల్లివిరియవలెను.

ఇట్లు శిలవలె ఒకనిమిషము నిలబడి, ఆ శిలయందు చలనము కలిగినట్లు ఎడమనుండి కుడిప్రక్కకు వికసిత వదనముతో ప్రేక్షకులను తిలకించి కుడిప్రక్కనేయున్న ఆర్కెష్ట్రాను చూచిన తక్షణమే,

ఆర్కెష్ట్రావారు భరతనాట్యమైనచో
''తాం తెయ్యాం, దత్తాం లేక తాతైతైతా''

అని ఒక పురుషకంఠము, స్త్రీకంఠము చేర్చి విలంబితలయలో అన్ని వాయిద్యములు సమశ్రుతిలో ప్రారంభించవలెను. అప్పుడు 'ఓం' కారనాదముతో నృత్యగృహమంతయు నిండిపోవును. ప్రదర్శనము ఎప్పుడూ ఆదితాళమందే ప్రారంభించవలెను. ఆదితాళము సంపూర్ణ తాళము.

నృత్య ఆర్కెష్ట్రాలో అన్ని వాయిద్యములలోను ముఖ్యమైనది మృదంగము.మార్దంగికుడు తాళగతి ననుసరించుటలోనే తృప్తినొందక

నృత్యమందలి రసభావములను అవగాహనచేసుకొని వాటికి సరిపడే శబ్దములను పలికించనిచో మనకుకావలసిన భావగంభీరతను నృత్యమందు ప్రదర్శించలేము. అందుచేత నృత్యమునకు జీవమైన మృదంగ వాద్యకుడు తాళగతి లయలనేగాక, నాట్యశాస్త్ర రసభావములను గురించి పరిపూర్ణవిజ్ఞానము గలిగినవాడై గూడ వుండవలెను.

ఉదాహరణ:—"చిలుకలు కలకలమని కూయగ విని తాళ వశమా?"

ఈ గీతమునకు రూపక తాళ శబ్దములు పలికించినప్పుడు ఆ నాద ప్రభావమునకు,

చిలుకల కలకలనాదములు మృదంగముపై ధ్వనింపజేసి,

"తాళ వశమా?"

అన్నప్పుడు నాయకి హృదయాందోళన, ఆవేదన, ఉల్లాసము, ఉత్సాహము, పారవశ్యత మొదలైన భావములన్నియూ ధ్వనులలో ప్రదర్శించునప్పుడు ప్రేక్షకులుపొందే ఆనందమునకు ఎంతో భేద ముండును. అందుచే మార్దంగికుడు రసభావములతో తనకు సంబంధం లేనట్లు తాళగతిననుసరించక నర్తకునినాట్యములో లీనమై అతడు నేత్ర, అంగ, ప్రత్యంగములతో ప్రదర్శించు భావములను ధ్వని రూపములో పలికించవలెను. కనుక కొన్నివేళలందు నర్తకుని కంటె మార్దంగికుడే ఎక్కువ శ్రమపడవలసి వుంటుంది. నిర్జీవమైన చర్మవాయిద్యముపైన నవరసములను పలికించుట సామాన్యమా!

ఎల్లప్పుడు ప్రదర్శన ప్రారంభములో స్వచ్ఛమైన తెల్లదుస్తులను ధరించవలయును. తెలుపు సత్వగుణమైనందు వలన శాంత స్వభావము కలిగి యుండును. అందుచే ప్రజలను ఉద్రేక పరచదు. వారు ప్రశాంత హృదయులై ప్రదర్శనమును చూసే అవకాశమును ఏర్పడును. విలంబిత లయలో ప్రారంభించి, మధ్య ద్రుతలయలలోనికి ప్రదర్శనము గొని పోయిన నర్తకునికి యెక్కువ శ్రమ ఉండదు. కొందరు మధ్య, ద్రుత లయలలో ప్రారంభింతురు. అట్లు ప్రారంభించిన అది ఎక్కువ ఆకర్షణీయ ముగ ఉండి, ప్రేక్షకులను బహు తొందరగా ఆకర్షించినను

ఆ పరిణామమును చివరివరకు నిలుపుట బహుకష్టము. కొన్ని సమయములలో ప్రదర్శనము రాణించక పోవుటకిదియే కారణమగుచున్నది. విలంబిత లయ ప్రారంభములోనే ఎక్కువమంది ప్రేక్షకులను ఆకర్షించదు. అది నిద్రపోతున్న ప్రేక్షకుల హృదయములను మేల్కొలిపి తన వైపుకు త్రిప్పుకొని ఆకర్షించును. అందువల్ల విలంబిత లయయే నర్తకునికి ఎక్కువ ఉపయోగకారి.

నర్తకునకు ప్రేక్షకుల మనస్తత్వము (Mass Psychology) తెలిసి ఉండవలెను. పూర్వకాలమందువలె గాక యిప్పటి ప్రేక్షకులకు శాస్త్ర పరిచయము తక్కువ గనుక నర్తకుడు ప్రేక్షకులనుబట్టి అప్పటి కప్పుడే ఆంగిక, సాత్విక అభినయమందు శాస్త్ర సమ్మతమైన తగు మార్పు చేసుకొనినచో ప్రదర్శనము విజయవంతముగా చేయవచ్చును.

స్థల, కాలములను బట్టి ప్రదర్శనములో సమయోచితమైన నృత్యములను ఏర్పాటు చేయవలెను.

దీనికి ఉదాహరణ:—

1944-45 సంవత్సరములలో సైనికుల వినోదార్థమై మౌ, ఇండోర్, జబ్బల్‌పూర్, కాంఠీ మొదలగు ప్రదేశములలో ప్రదర్శనము లివ్వబడినవి. అది యుద్ధకాలము గనుక మేము 'యుద్ధభూమినుంచి' అనే క్రొత్త నృత్యం ప్రదర్శించాము. దానిలో కథ యిది:—

## మొదటి అంకము

బహుకాలముగా ప్రేమించుకొన్న యిద్దరు ప్రేమికులగు సుజాత, అశోకులకు పెండ్లి అయినది. నాడు వారి మానసిక, శారీరక సంయోగముల సుదినము. ఆ రాత్రి ఆమె పడకగదిలో అలంకరించుకొని భర్తకొరకై వేచియున్నది. కాని అతని జాడలు కనిపించలేదు. ఆ గదిలో మూలనున్న నిలువు టద్దమువద్దకు బోయి తన అలంకారము సవరించుకొంటున్నది. ఆ అద్దమువద్ద తన భర్తఫోటో, ఒక ఉత్తరం చూచినది. దానిలో,

"సుజాతా ! నేను యుద్ధభూమికి పోతున్నాను. యుద్ధానికి పోయే వీరుడు తన స్త్రీని చూచుట తగదని శాస్త్రములు శాసిస్తున్నాయి. అందుచే నిన్ను చూడకుండా వెళ్ళిపోతున్నాను" అని ఉన్నది.

లేఖ చదివిన వెంటనే ఆమె స్పృహతప్పి పడిపోయినది. కొంత సేపటికి ఈ విధముగా విలపించినది.

"గేలా దరియా వార్ ఘురదనీ
ఫురతీ ఓంక్ – నహ్వాతి జావీ
ఆంగా చీనా – హాలదని ఘాలీ
అజుని నాహా – దేవక ఉరల
నాహీ ఉతరలా – గౌరీహాల్
ఫలటన గేఫుణి – బోట చాలవీ
పరతుని నిరాయా – కదియేణార్
అసీచ కారే – విరవిరణాల్."

ఈ గీతముయొక్క అర్థము :

"మాయిద్దరి జీవితములో ప్రథమ పరిచయమైనా కలుగలేదు; శరీరమునకు ఉన్న పసుపుఅయిననుపోలేదు. అరువేణికుండలు, గౌరీదేవి నైననూ ఎత్తలేదు. నా నాథుడు నన్నువదలి యుద్ధభూమికి వెళ్ళారు."

"సైనికులను తీసికొని అదుగో ఆ ఓడ ఎక్కడికో ప్రయాణము చేస్తూంది. మరల ఎప్పుడు తిరిగి వస్తుందో? సంసారమును గురించి నేనుకన్న మధుర స్వప్నములన్నీ స్వప్నములుగానే నిలచిపోయినవి."

## రెండవ అంకము

ఆమె రేడియో వద్దకూర్చుని అశోక్ వ్రాసిన ఉత్తరం చదువుతుంది. 'వారు వస్తారు' అని అందు వ్రాసియున్నది.

వెంటనే అక్కడనుండి లేచి ఆనందముతో నృత్యము చేస్తూ అలంకారములను ధరిస్తుంది. స్టేషనులోని మిలటరీ ఆఫీసునకు ఫోన్ చేసింది. కాని వారిజాడ తెలియలేదు. మరల వలవల ఏడుస్తుంది. కొంతసేపైన తరువాత ఆ వుత్తరం తీసి చదువుతుంది. అందు వేరొక బండిలో వస్తారని వున్నది. ఆమె మరల ఆనందముతో నాట్య మాడుతుంది.

అతడు వచ్చాడు.

ఇక ఆమె హృదయానందము వర్ణించ శక్యమా ! అతను నడిచే ప్రదేశమంతయూ మల్లెపూవులుజల్లి అతనిని ఆహ్వానిస్తుంది. మంగళ హారతినిచ్చి అతనినొసట 'విజయటిక్కా' పెడుతుంది.

ఈ నృత్యము మేముమిలటరీ క్యాంపులలో చేసినప్పుడు యిది పొందినంత ఆదరణ మరేనృత్యమూ పొందలేదు. ప్రతిమిలటరీ ఆఫీసరుకు దూర దేశములలో వున్న తమభార్యా బిడ్డలు, తలిదండ్రులు కళ్ళ ముందు నిలబడ్డట్టు వుండేది. కొన్ని ప్రదేశములలో ఈ నృత్యమునే ఐదారుసార్లు చేయమని కోరేవారు. యుద్ధకాలంలో మాకు వుత్తర హిందూస్థాన మంతటా పేరు తెచ్చినది ఈనృత్యమే.

అందుచే నర్తకుడు సమయమునకు తగిన నృత్యములను ప్రదర్శించ వలెను.

ప్రతీనర్తకుడు – భరతనాట్యమైనచో,

అవే వర్ణములు, తిల్లానలుచేయును. ఆంగికాభినయములో క్రొత్తదనమేమీ కనబడకపోవుటచే ప్రేక్షకులకు కొన్ని వేళలలో విసుగుపుట్టుచున్నది.

కనుక నర్తకుడు ఎప్పుడూ క్రొత్తకరణులను, రేఖలను తన నృత్యములో విధిగా ప్రదర్శించుటకు ప్రయత్నించవలెను. ఒకే ప్రదేశ మందు రెండు ప్రదర్శనములిచ్చినప్పుడు రెండింటిలోను మార్పు కనుపించవలెను.

## గజ్జెలు

చాలామందినర్తకులు చర్మమునకు కుట్టిన గజ్జెలను నృత్యములో వుపయోగించుచున్నారు. అట్లుచేయుటవల్ల నాదము తగ్గు చున్నది. 'వల'వలె అల్లించినగజ్జెలు స్వేచ్ఛగా కదిలించుటకు వీలుండును. అప్పుడు వానినుండి వీనులకు విందుకూర్చేనాదము వెలువడును. మద్దెలవాని నైపుణ్యము శృతి చేయుటలో కనిపెట్టినట్లు నర్తకుని విద్యానైపుణ్యము 'గజ్జెకట్టుట'లో కనుగొనవచ్చును.

ప్రదర్శనము ఆనందముగా,ఉత్సాహవంతముగాముగించవలెనన్న 'తరానా' మధ్యలయలో ప్రారంభించి పైకాలములో జతులనాడవలెను.

లేక దృశ్యము చిరకాల ముద్రాంకితము కావలెనన్న విషాదాంతమైన నృత్యముతో ముగించవలెను.

నర్తకులు మయూర, మరాళ, హరిణ నృత్యములను చేయుదురు. శాస్త్రోక్తముగా ఆ నృత్యములను గురువువద్ద నేర్చుకొని ప్రదర్శించినా, తనలో ఎంత ఊహాజ్ఞానము, కల్పనాశక్తి ఉన్ననూ జీవితములో ఒక్కసారి అయినను సజీవమైననెమిలినృత్యమాడుట నర్తకుడు చూచియుండవలెను. కళారాధకుడు ఆ నృత్యమును చేయునపుడు–ఒకనర్తకుడుగాదు ఆ నృత్యమును చేయుచున్నది – నెమిలివచ్చి తనముందు నృత్యమాడుతున్నదనే భావము ప్రేక్షకులలో కలుగవలెనన్న–నర్తకుడు ఆ నృత్యము చేయు సమయములో – మయూరము – అదినృత్యముచేసే పద్ధతిని తన హృదయమందు చిత్రించుకోవలెను. అప్పుడే తననుతానుమరచి ఆనాట్యమందు లీనము కాగలడు. అట్లు లీనమయినప్పుడే సహజసౌందర్యముతో నిండిన చిరస్మరణీయమైన నృత్యమును ప్రదర్శింపగలుగును. లేనిచో అది 'నృత్యమే' అవును గాని మయూర నృత్యము మాత్రము కానేరదు.

## లోకధర్మి

లోకధర్మి అభ్యాసములేని లోపము:—

తంజావూరు భరతమందు ప్రతి ప్రదర్శనములోను మనకు కనబడును. 'లోకధర్మి' పాటించకపోవుటచే ఎక్కువ ప్రదర్శనములు అసహజముగాను, ప్రకృతికి దూరమై విరుద్ధముగాను వుంటున్నవి.

చారి, కరణ, అంగహార మండలములను ప్రదర్శించుటలో నాట్యధర్మముపై ఆధారముపడినను, రసభావములతో కూడినపదములు, అష్టపదులు మొదలైనవాని అభినయమందు నర్తకుడు వానిని లోకధర్మ సహాయముతో ప్రదర్శించి నప్పుడే సహజముగా వుండును.

ప్రచారములో లేని ఒక క్రొత్తనృత్యమును ప్రదర్శించినప్పుడు ఆ నృత్యము జరిగే సమయములోనే దానిలోని ముఖ్యాంశములను ప్రేక్షకులకు తెరవెనుకనుండి తెలిపిన (Running Comentary) ప్రేక్షకులు ఆ నృత్యమును పూర్తిగా అర్థము చేసుకొని ఆనందించుటకు అవకాశముండును.

క్రోధము, క్రూరత్వము, రౌద్రము అభినయించునప్పుడు లైట్లు స్టేజి క్రిందభాగమునుండి నర్తకుని ముఖముపై ప్రసరింపజేసిన ఆకాంతి కిరణములకు అతని ముఖముపై కొన్ని ముడుతలు (రేఖలు) ఏర్పడును. అప్పుడు నర్తకుడు ఎక్కువ శ్రమలేకనే ఆ భావములను పోషించ గలుగును. నృత్యములందు రంగు రంగుల లైట్లు ఉపయోగించినను పదములు, కీర్తనలు అభినయించునపుడు స్వచ్ఛమైన తెల్లలైట్లనే ఉపయోగించవలెను. దానివల్ల అభినయములోని ప్రతి అంగము కూడ చక్కగా చూడ గలుగుదురు.

ప్రతి నర్తకుడు అలంకరింపు, జతిస్వరము, మయూరనృత్యము, శివతాండవము, రాధాకృష్ణ నృత్యములు చేయుటలోనే తృప్తిపొందక మూలబడివున్న మందూక భరతము మొదలైన గ్రంథములలో గుప్త పరచిన అమూల్య విషయములను, వ్యయ ప్రయాసలకోర్చి నేర్చుకొని, ప్రదర్శించి ఇప్పుడు ప్రచారములో లేక కాలవాహినిలో కలసిపోతున్న కొన్ని అపూర్వ నృత్య పద్ధతులను ప్రేక్షక లోకమునకు చూపవలసి వుంటుంది. ఈ బాధ్యద నేటి కళో పాసకులపై నున్నది.

కళ ప్రజల విజ్ఞాన వికాసములకు తోడ్పడ వలెను.

ప్రస్తుత కాలములో జానపద నృత్యములు ప్రతీ ప్రదర్శనము లోనూ చేయుట పరిపాటైనది. జానపద నృత్యములు వివిధ ప్రాంతము లలో జీవించే ప్రజల జీవితముతో సంబంధము కలిగి ఉండును.

ఆంధ్రదేశములోని 'గొబ్బి', నైజాములోని 'బతకమ్మలాట', గుజరాత్ లోని 'గర్బ', తమిళనాడులోని 'కుమ్మి' కొన్ని ప్రత్యేక సమయములలో పండుగలకు చేయబడును. ఇట్టి ప్రదర్శనములద్వారా ప్రేక్షకులకు ఆయా దేశములలోని ప్రజలు వారి ఆహార్య, ఆచార వ్యవహారములను గూర్చి నృత్యముద్వారా తెలిసికొనుటకు వుపయో గించును. మన నృత్యసాహిత్యమంతయూ అంతఃపురములలో విహరించే మహారాజులు, లతాంగులు వారి ప్రణయ కలహములు, ప్రేమగాథలు మున్నగు వానిని గురించిన వర్ణనలతో కూడి వున్న దేకాని సామాన్య ప్రజానీకము, వారి నృత్య జీవితములోని కష్ట సుఖములు, వారి ప్రేమ, జీవితాదర్శములను గురించి తెలుపునవి బహు తక్కువ. ఈ లోటును

జానపద నృత్యములు, గీతములు తీర్చును. అందుచే నేటి నర్తకులు జానపద నృత్యములపట్ల ఎక్కువ ఆసక్తితో కృషిచేయవలసివుంటుంది.

పూర్వపు కళారాధకులు తమ ప్రదర్శనము ద్వారా మనదేశమందేగాక చైనా, టిబెట్టు, బలి ద్వీపము మొదలగు దేశములలో కళాప్రచారమేగాక విజ్ఞాన కాంతులను వెదజల్లి మన సంస్కృతి ఉత్కృష్టతను ప్రపంచమునకు చాటిరి. అజంతా, ఎల్లోరాచిత్రలేఖన, శిల్పకళసృష్టికి తోడ్పడిన రాజులు మరణించినప్పటికీ, ఆ కళాసేవకులు అదృశ్యమయినప్పటికీ మనదేశము సాటి రాజ్యములతో మేటియను గర్వముతో తలయెత్తుకొని నిలబడుటకు ఆ కళారాధకుల అపూర్వ కృషియే కారణము.

అట్లే నేటి కళాసేవకులు ప్రదర్శనముల నిచ్చుటయందే సంతృప్తి చెందక, మన సంస్కృతి, కళలలోని విశిష్టతను ప్రజాకోటికి ప్రస్ఫుటీకరించ వలెను.

ఇట్టి కళా ప్రచారము ఆంధ్ర దేశములో ప్రస్తుతము ఎక్కువ అవసరము. తెలుగుదేశము లలితకళలకు పుట్టినిల్లే. అయిననూ ప్రస్తుత కాలములో లలితకళలను, కళారాధకులను ఆదరించేవారు, గౌరవించే వారు బహుతక్కువ. నృత్యసాహిత్య మంతయూ తెలుగులో ఉన్నను నృత్యకళ మాత్రము దాక్షిణాత్యుల సొమ్మయినది.

సంగీతమునకు సంబంధించిన యావత్తు సాహిత్యము తెలుగులో వున్నప్పటికీ, తమిళ సోదరులు జీవితములో సంగీతమునకు యిచ్చిన ప్రాముఖ్యము మనమిచ్చుటలేదు. దీనికంతటికీ కారకులు కళారాధకులే. కనుక వారు కేవలము ప్రదర్శనములిచ్చుటతోనే తృప్తిచెందక, కళా ప్రచారమునకై పాటుబడి, ప్రజలలో సంపూర్ణ కళావిజ్ఞానము కలిగించిన నాడే లలిత కళలను ప్రజలు ఆదరించి పోషించెదరు.

అందుచే కళారాధకుడు తన ప్రదర్శనములను ప్రజలలో విజ్ఞాన ప్రచారమునకు సాధనములుగా వుపయోగించ వలసి ఉన్నది.

# పంచమ వేదము

## భరతనాట్యశాస్త్రమందలి విచ్ఛిన్నప్రకరణముల వివరణ

"అభినయ దర్పణమ్," "భరతనాట్యశాస్త్రము", "హస్త లక్షణదీపిక" ప్రస్తుతము ఈ మూడు గ్రంథములు మన దేశములో ఎక్కువ ప్రచారములో ఉన్నవి.

హస్తలక్షణదీపిక కథకళినృత్యమునకు ముఖ్యగ్రంథము. భరతనాట్య శాస్త్రము, అభినయ దర్పణమ్ ఆంధ్రదేశము, తమిళనాడు, బెంగాల్, మణిపూరులందు ఎక్కువగా ఉపయోగములో నున్నవి. భరతనాట్యశాస్త్రము కల్పతరువు వంటిది. దానియందు నాట్యకళకు సంబంధించిన ప్రతి చిన్నవిషయమునుగురించి కూడా వ్రాయబడినది. 6000 శ్లోకములు, 37 అధ్యాయములుగల మహా గ్రంథమిది.

### 1-వ అధ్యాయము

నాట్యశాస్త్రముయొక్క పుట్టుకగూర్చి, దానియొక్క విశిష్టతను గురించి వ్రాయబడినది. హృదయమునకు, ఆత్మకు ఆనందమిచ్చునట్టిది, చతుర్వర్ణములవారికి అందుబాటులో నుండునట్టిది అయిన పంచమవేదము నాట్యశాస్త్రము-(నాలుగు వేదములనుండి వాద్యము, గీతము, అభినయము, రసములను గ్రహించి బ్రహ్మ సృష్టించి) ఈ విద్య భరతునికి నేర్పెను.

### 2-వ అధ్యాయము

"నృత్యమందిర" నిర్మాణము గురించి వ్రాయబడినది. అవి మూడు రకములు.

వికృత (రెక్టయాంగ్యులరు), చతురస్ర (స్క్వేర్), త్రియానా (ట్రయాంగ్యులర్)-ఇవి తిరిగి వాటివాటి కొలతలనుబట్టి జ్యేష్ఠ, కనిష్ఠ, మధ్యమ అని మూడు తరగతులుగా విభజింపబడినవి. మధ్యమ రకము పురుషులకు ఉపయోగించును. జ్యేష్ఠ 54 గజములు, మధ్యమ

32 గజములు పొడ వుంకును. అభినయమును చక్కగా చూచుటకు, గానవాద్యములను వినుటకు భరతుడు మధ్యమరకమే శ్రేష్ఠమని పేర్కొనెను.

నేపథ్యము (గ్రీన్‌రూమ్) ఎనిమిది గజములు, రంగశీర్ష నాలుగు గజములు, రంగపీఠము నాలుగు గజములు, ప్రేక్షకగృహము 16 గజములు.

గ్రీన్ రూమ్‌కు రెండుతలుపులు, ప్రేక్షకగృహమునకు మూడు ద్వారములు ఉండవలెను. రంగశీర్ష రంగపీఠములకు మధ్య తెర ఉండవలెను. నర్తకులు రంగశీర్షమందు పూజచేయుదురు. ఇది రంగపీఠముకన్న కొంచెము ఎత్తుగా ఉండవలెను.

చుట్టూ గోడలుపెట్టి, సున్నమువేసి లతలు, జంతువులు మొదలైన వానిని గోడలపై చిత్రించవలెను. ప్రేక్షకులు కూర్చొనుటకు గ్యాలరీలను ఏర్పాటు చేయవలెను. రంగపీఠమునకు అద్దమువలె నున్నగా మెరుగుపెట్టవలెను. స్టేజి ఒకగుహవలె ఉండవలెను.

### 3-వ అధ్యాయము

ఇందు రంగదేవతారాధననుగూర్చి వివరముగా వ్రాయబడినది.

### 4-వ అధ్యాయము

'అమృత మంథన్' అను రూపకము 'సమహాకార్' పద్ధతికి చెందినది. దీనిని బ్రహ్మ లిఖించెను. భరతుడు నాట్యమండపములో అభినయించెను. తరువాత 'త్రిపురదాహ' డిమ పద్ధతిని భరతుడు ప్రదర్శించెను. అదిచూచి ఈశ్వరుడు తాండవనృత్యమును భరతునికి నేర్పుమని తండుని ఆదేశించెను.

నృత్యకరణులు – అంగహారములు. నృత్యమందు హస్తమును, పాదమును సంయోగముజేసి కదల్చిన 'కరణ' మగును.

(హస్తపాదసమాయోగో నృత్యస్య కరణం భవేత్)

ఆరు లేక ఆరుకంటె ఎక్కువ కరణములు కలిగిన అది ఒక అంగహార మగును.

## 5-వ అధ్యాయము

పూర్వరంగము - తెరయెత్తకముందు నర్తకులు వాద్యములను శ్రుతి జూచుకొనుటను గురించి. అశ్చెష్టాశ్రి కూర్చొను విధానమును గురించి, పూజావిధానమునుగురించి తెలుపబడినది.

తరువాత తెరయెత్తబడును. ప్రార్థన ముగిసినపిదప సూత్రధారుడు, విదూషకుడు, పారిపార్శ్వకుడు రంగస్థలముపైకివచ్చి చతుర్దిక్పాలకులను ఆరాధింతురు నాల్గవ నర్తకుడు ప్రవేశించి ఇంద్రుని పతాకమునకు వందనము లర్పించును. పిదప సూత్రధారుడు 'నాందిని' పఠించును. 'పరోచన' మందు కథనుగూర్చి, రచించిన కవినిగూర్చి తెలుపుతూ ప్రేక్షకులను ప్రశాంతముగా చూడమని ప్రార్థించి నిష్క్రమించును. 'శుద్ధపూర్వరంగ' మందు స్త్రీలుగూడా రంగస్థలముపైకివచ్చి తాండవ నృత్యమాడి — అంగహారములు, రేచకములు, ప్రదర్శింతురు.

## 6, 7-వ అధ్యాయములు

ఇందు అభినయమునకు జీవమైన రసభావములను గురించి చర్చింపబడినది.

శృంగార, రౌద్ర, హాస్యాది నవరసములు - స్థాయిభావములు, సంచారి భావములు, వ్యభిచారి భావములు, చతుర్విధ అభినయములు, నాట్యధర్మి, లోకధర్మి, వృత్తులు, ప్రవృత్తి,మృదంగములు, గానము వీనినిగూర్చి తెలుపబడినది.

నర్తకుడు రంగస్థలముపై ప్రవేశించునప్పుడు, నిష్క్రమించునప్పుడు, రంగముపై అటు నిటు సంచారము చేయునపుడు, రసభావములలో మార్పు కలిగినపుడు, ఎట్టి సంగీతము పాడవలయునో వివరముగ తెలుపబడినది.

## 8-వ అధ్యాయము

ఆంగికాభినయము - అంగ, ప్రత్యంగ, ఉపాంగముల సంచలనము గురించి, నాట్యమందు వాని ఉపయోగము గురించి తెలుపబడినది.

## 9-వ అధ్యాయము

సంయుత, అసంయుత హస్తములు:—వానిని ఉపయోగించు పద్ధతినిగూర్చి వ్రాయబడినది. అగ్రజాతులకు లలాటముముందర హస్తములు పెట్టవలెను. సరిసమానులకు వక్షమునకు యెదురుగను, తక్కువ జాతులకు క్రిందుగాను పెట్టవలెను.

ఇందు వక్షము, ఇరు పార్శ్వములు, ఉదరము, కటి మొదలగు అవయవముల సంచలనమును, వానియొక్క వినియోగము మొదలైన విషయములను గూర్చి వ్రాయబడెను.

మూర్ఛ, నిరాశ, నిస్పృహ, విచారము, అలసట, నిదుర, లజ్జ మొదలగువాని అభినయమందు హస్తములతో చూపక ఒక్క సాత్వికాభినయముతోనే ప్రదర్శింప వలయునను విషయము వివరింపబడెను.

## 10, 11-వ అధ్యాయములు

చారీ:—ఒక్క కాలు కదలించిన 'చారీ' అనబడును. రెండు కాళ్లు కదలించిన 'కరణ' మగును. కొన్ని కరణములుచేరి 'ఖండ' మగును. మూడు లేక నాలుగు ఖండములు చేర్చినయెడల మండల మనబడును. 'చారులు' యుద్ధమందు, బాణము సంధించుటయందు ముఖ్యముగా ఉపయోగపడును.

మండలములు 24. ఇవి సంగీతముయొక్క సహాయముతో ప్రదర్శించవలెను.

## 12-వ అధ్యాయము

గతి ప్రచారము:—ఇందు రంగస్థలముపైన నడచు విధానమును గురించి తెలుపబడినది. రాజులు, సేవకులు, స్త్రీలు, వివిధ దేశీయులు ఎటుల వ్యవహరించవలయునన్న విషయము; వివిధభావములను ప్రదర్శించునప్పుడే యే గతి ననుసరించవలెనో తెలుపబడినది. నడక— ఒకటి, రెండు, మూడు, నాలుగు గతులను కలిగి ఉండును.

నర్తకుడు శృంగార, రౌద్ర, శోకములందును; రథమునెక్కినప్పుడు, విమానము నెక్కినప్పుడు, మేడమెట్లు దిగునపుడు; అశ్వారోహణమందును అభినయించు విధానమును; ముసలివానిగా, విటునిగా, నిస్సహాయునిగా, మరుగుజ్జుగా, విదూషకునిగా ఎట్లు అభినయించవలెనో వ్రాయబడినది.

స్త్రీలగమనము - యువతులు కోపమునందు, శృంగారమునందు యెటుల నిలబడవలెనో విశదమొనర్చిరి.

ఇవి చెప్పుచూ మిగిలిన విషయములను నర్తకుడు లోకమునందుచూచి నేర్చుకోవలయును అని భరతుడు ఈ అధ్యాయమును ముగించెను.

### 13-వ అధ్యాయము

ఇందు వివిధప్రాంతములలోని (అవంతి, పాంచాల, దక్షిణ దేశము, మగధ మొదలగు) ప్రజలు ఆ పాత్రల అభినయవిధానమును గూర్చి విపులముగా వ్రాయబడెను.

### 14, 15-వ అధ్యాయములు

ఛందస్సు కావ్యమునకు రమణీయకతనుగూర్చు వృత్తములను గురించి వ్రాయబడినది.

### 16, 17-వ అధ్యాయములు

కావ్యమునకు భూషణములగు 'లక్షణము' లను గురించి వర్ణించిరి. ఉపమా, దీపకము, రూపకము, యమకములు ఉదాహరణలతో వివరించబడెను.

నాటకము ప్రేక్షకులకు అర్థమగు సులభశైలిలో ఉండవలెను.

ప్రాకృతభాషలు, వానిని ఉపయోగించు విధానము; బ్రాహ్మణుని, రాజును, పట్టమహిషిని, సమానులు మొదలగువారిని సంబోధించువిధములు వ్రాయబడినవి.

18-వ అధ్యాయము

రూపకములు పది విధములు - నాటక, ప్రకరణ, భాణ, ప్రహసన, డిమ, వ్యాయోగ, సమవాకార, వీధి, ఉత్సృష్టాంక, ఈహామృగ.

ఇవి కథానాయికనుబట్టి, కథనుబట్టి, ప్రధాన రసమునుబట్టి మారుచుండును.

19, 20-వ అధ్యాయములు

కావ్యము చతుర్వృత్తులనుగూర్చి తెలుపబడినది.

21-వ అధ్యాయము

ఆహార్యాభినయము:—రంగాలంకారములు, పాత్రలుధరించు అలంకారములను గురించి వివరములన్నియూ వ్రాయబడినవి. ఇందు జంతువులను, ఆయుధములను, రథములను, విమానములను, కాండ లనుకూడా రంగస్థలముపై ప్రదర్శింప వచ్చునని తెలుపుతూ, వానిని చేయు విధానమును వర్ణించారు.

22-వ అధ్యాయము

సామాన్యాభినయమునుగూర్చి చర్చింపబడినది. సత్వాభి నయము - హావ, భావ, హేల, శృంగారమందు స్వభావసిద్ధమగు అనుభవములు; లీల, విలాసా, విభ్రమ, కిలికించిత, మొట్టాయి తము, కుట్టమితము, బిబ్బోకము, లలితము, విహారి మొదలగు వానిని గూర్చి వ్రాయబడెను.

23-వ అధ్యాయము

దూతకలను తెల్పుతూ, స్త్రీ తన ప్రియుని అనుగ్రహము బడయుట, స్వాధీన పరచుకొనుట, సాధించుట మొదలగు విషయ ములను చర్చించారు. ఆకార, గతి, చేష్ట, భాష, నేత్ర, వక్త్ర, వికారాదులతో పరులమనములను ఎటులగ్రహించగలమో వర్ణించిరి.

24-వ అధ్యాయము

నాయకీ నాయకులు, విదూషకుడు, సూత్రధారుడు, నర్తకి మొదలగు నాట్యమందు వచ్చు పాత్రల లక్షణములు విశదీకరించ బడెను.

## 25-వ అధ్యాయము

చిత్రాభినయము:—రాత్రి, పగలు, వెన్నెల, సంతోషము, ఉత్సాహము, సూర్యుడు, సింహము, కోతి, పెద్దపులి, పెద్దలకు నమస్కరించు విధానము, పక్షులనభినయించుట, చనిపోవుటకు సిద్ధముగానున్న మనుష్యుని అభినయించుట మొదలగు విషయములను చర్చించిరి.

## 26-వ అధ్యాయము

ప్రకృతివికల్పము - (1) అనుపము (2) విరూపము (3) రూపానురూపము అని మూడు విధములు.

స్త్రీ - స్త్రీ వేషము, పురుషుడు - పురుష వేషము ధరించుట అనుపము.

కుర్రవాడు వృద్ధుని వేషము, వృద్ధుడు యువకుని వేషము ధరించుట విరూపము.

పురుషుడు స్త్రీ వేషము వేయుట రూపానురూప మగును.

ప్రతినటుడు ఒక పాత్ర నభినయించవలసి వచ్చినప్పుడు తనను మరచి ఆ పాత్రయందు లీనమగుట ముఖ్యము.

## 27-వ అధ్యాయము

ప్రదర్శనము విజయవంతముగాచేయు విధానము - నర్తకులు ప్రేక్షకుల మనస్తత్వములను గ్రహించి రంగస్థలముపై అభినయించవలెను.

ఒక ప్రదర్శనమును విమర్శించునపుడు (1) సమత్వము (2) అంగ మాధుర్యము (3) పథ్యము (4) ప్రాకృతి (5) రస (6) గణ (7) వాద్య (8) నేపథ్యము - ఈ ఎనిమిది అంశములు ముఖ్యముగా గమనించవలెను.

కైషిక వృత్తి, శృంగార రసము ప్రధానమై నృత్యగీతములతో పూర్తిగా నిండియున్న నాట్యము ప్రదోష కాలమందు ప్రదర్శించవలెను.

పాత్ర, ప్రయోగము, సమర్థన శక్తి - ఈ మూడు గూడా ప్రదర్శన విజయమునకు కారణ మగుచున్నవి.

28 - 33-వ అధ్యాయములు

సంగీతము - స్వర, రాగ, తాళ, వాది, సంవాది, స్వరములు, తాళ జతులు, గ్రామ, జతి - వీనిని రసములందు వినియోగించు విధానము, వాద్యములను ఉపయోగించు పద్ధతి, తాళ పరిమాణము, లయ, ధ్రువములు మున్నగువానినిగూర్చి వివరించబడినది.

34-వ అధ్యాయము

ఏయే రసమునకు ఎట్టి వాద్యములు ఉపయోగించ వలెనో, వాద్యకులు, గాత్ర పాఠకులు రంగస్థలముపై కూర్చునే విధానము వివరించబడినది.

35 - వ అధ్యాయము

నాట్యమునకు పాత్రలను నిర్ణయించు విధానము గురించి చర్చించిరి.

36 - వ అధ్యాయము

ఇందు పూర్వరంగ ప్రయోజనము గూర్చి వ్రాయబడెను.

పూర్వరంగము - రంగస్థలము నుంచి క్షుద్ర దేవతలను పారద్రోలి రంగస్థలమును పవిత్రపరచును.

నాట్యము, వాద్యము - వేదములతో సమానము.

37 - వ అధ్యాయము

పూర్వము నహుషుని కాలములో నాట్యకళ ప్రపంచములోనికి ఎట్లు తీసుకొని రాబడినదో తెలుపబడినది. భరతశాస్త్రమును కీర్తిస్తూ భరతుడు గ్రంథమును ముగించెను.

---

ద్వితీయ భాగము

౧

# ఒరియాల నృత్యకళ

# ఓరియనుల నృత్యకళ

ఓరియనులు ముఖ్యమైన ఒక ద్రావిడ తెగ. ఛోటానాగ్‌పూర్ పీఠభూమిలోను, జాష్‌పూర్ సిర్‌గుజా సంస్థానములోను వీరు నివసింతురు.

'నృత్య జాత్రలు' వారి తెగయొక్క నృత్యపండుగలు. ఈ పండుగలప్పుడు వేనకు వేలు ఓరియనులందరు ఒకేస్థలములో చేరి నృత్యము చేయుదురు. ఇటువంటి జాత్రలు హిందూదేశమున మరి ఏ ప్రాంతములోనూ మనము చూడలేము. సంవత్సరమున కొకసారి పురాతన పల్లెలకు దగ్గరగానున్న మామిడి తోటలలో ఈ జాతలు జరుగును. వీరిలో ఓరియను తెగకు చెందిన స్త్రీ పురుషులు, యువతీ యువకులు, బాలురు, వృద్ధులు అందరూ పాల్గొందురు.

వేనకు వేలు జనులు ఒకేసారి, ఒకే విధముగా, ఒకే కంఠముతో పాడుచూ నృత్యమాడు ఈదృశ్యమును చూచిన ఏ కళారాధకుడు తన జీవితములో ఆ దృశ్యమును మరచిపోగలడు ?

వారి నృత్యజాత్ర యొకటి క్రింద ఉదహరిస్తున్నాను చూడండి:—

తెల్లవారుతూంది.

'జాత్ర', 'నృత్యజాత్ర' అనిసుమారు పదిమంది కుఱ్ఱవాళ్లుమామిడి తోటకు పోవుదారిలో నాటబడిన జండాలను చూచి ఆనందముతో వెర్రికేకలు పెడుతూ పల్లెలోనికి పరుగెత్తుతున్నారు. ఆ చుట్టు ప్రక్కలవున్న అన్ని గ్రామములవారికి తెలియుటకుగాను, ఆ పల్లెల యొక్క జెండాలను తెచ్చి నృత్యము జరుగు ప్రదేశము (మామిడి తోట) నకు పోవుదారిలో నాటబడినవి.

'జాత్ర', 'నృత్యజాత్ర' పల్లె లన్నిటిలోనికి ప్రాకిపోయింది. అయిదు నిమిషముల క్రింద నిశ్శబ్దముగాఉన్న ఆ ప్రదేశమంతా 'జాత' 'జాత' అన్న శబ్దములతో ప్రతిధ్వనిస్తూంది. ప్రతియువకుని

నోటిలో 'జాత్ర' - ప్రతి స్త్రీ నోటిలో 'జాత్ర' - ప్రతి ముసలివానీ నోటిలో 'జాత్ర' - ఎక్కడ చూచినా ఈ శబ్దమే. ఎవరు మాట్లాడినా నృత్య జాత్రలను గురించే —

కొందరు తమ దినకృత్యములను తొందరగా ముగిస్తున్నారు. కొందరు తమ పెట్టెలలో భద్రముగా దాచుకొనిన దుస్తులను తీసి మూటగట్టుకొని యున్నారు. (సాధారణముగా జాత్ర స్థలము దూరముగ నున్నవారు దుస్తులను మూటగట్టి తీసుకొనిపోయి అచ్చట ధరిస్తారు. దగ్గరగానున్నవారు యిండ్లవద్దనే ధరించి వెళ్తారు) గుంపులు గుంపులుగా జనులు ఆ తోటను చేరుతున్నారు. అందరూ ఆ తోట దగ్గరనున్న చెరువుగట్టున చేరారు.

సుమారు రెండు గంట లవుతుంది. వారు తమ ముస్తాబు మొదలు పెట్టారు.

స్త్రీలందరూ ఒకస్థలమునచేరి కిలకిల నవ్వుచూ, ఒకరితో నొకరు హాస్యము లాడుచూ, ఆనందముతో కూనరాగములు తీయుచూ తమ తమ అలంకారములను ధరించుచున్నారు. యువకు లందరూ కొంత దూరములోకూడి తయారవుతున్నారు. వారి ముస్తాబు ముగిసింది.

'డాయిడెడడా, డారెడడా, డారెడడ, డా' మద్దెలలు మ్రోగడం మొదలు పెట్టాయి. కొమ్ము వాయిద్యములు పూరింపబడ్డాయి.

ఒక్కొక్క పల్లెవారు ఊరేగింపులతో ఆ నృత్యస్థలమునకు తరలి వస్తున్నారు. అందరికీ ముందు యువకులు కత్తులు, డాలులు మొదలైన ఆయుధములు; తమ తమ పల్లెలకు చెందిన జండాలు పట్టుకొని నడుస్తున్నారు. చిన్న చిన్న బాలురు వింజామరలు; కొందరు పెద్ద పొడుగుపాటి కర్రలకు పూలమాలలు మొదలైన వానితో అలంకరించి పూర్వము రాజులకుపట్టు గొడుగులవలె పట్టుకొన్నారు. ఒకపల్లెనుండి వచ్చిన వారిలో ఒకడు రాజువలె దుస్తులు ధరించి కర్రగుర్రమును స్వారీచేస్తున్నాడు. మరికొందరు యువకులు ఆ గుర్రముతో చేర్చి ఆ మనిషిని గూడా మోయుచున్నారు.

వారి ముందు కొందరు వేటజంతువువలె అలంకరించుకొని నడు స్తున్నారు. వారి వెనుక స్త్రీ పురుషులు పంక్తులు దీర్చినడుస్తున్నారు.

అందరూ మామిడితోట చేరారు. వారందరూ కలసి ముందుకు వంగుచూ మళ్లీ వెనుకకు వెళ్లుతూ సముద్రతరంగముల వలె అందరూ ఒకే సారి కాళ్లు ఎత్తి అడుగులువేస్తూ, చక్రాకార ముగ తిరుగుచూ నృత్యముచేసి, మరల నిలువబడి అతి రమణీయ ముగా శరీరములను కదిలిస్తూ కొంతసేపు నృత్యమాడారు. దీనిపేరే 'ఖరియా' నృత్యము. సుమారు రెండువేలజనము స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు అందరూ వరుసగా నిలబడి, అందరూ ఒకేసారి మద్దెల ననుసరించి, కాళ్ళనెత్తి భూమిపై కొట్టారు. తరువాత నృత్యములో వారికి వాయిద్యములతో పనిలేదు.

వేలాది జనులు ఒకేకంఠముతో పాడుచూ కాళ్ళతో తాళ లయను చూపుతూ ఒకరినొకరు అంటుకొని నిలబడి గుండ్రముగా తిరుగుతూ నృత్యమాడారు. వారు కొంతసేపు ఆ నృత్యమాడి అలసి పోగానే అందరూ హర్ర్......అను శబ్దము చేశారు. వెంటనే అందరూ శరీరములను ముందుకు వంచి రెండుకాళ్ళను చేర్చి పైకి ఎగిరి భూమి దద్దరిల్లేటట్లు అడుగువేసి కూర్చున్నారు. ఇది నృత్యము యొక్క ఆఖరి అభినయ మన్నమాట. అలాగు ఒక నిముసము విశ్రాంతి తీసికొన్నారో లేదో ఒక మూలనుండి ఒకడు ఉద్రేకపూరితముగా ఓ......అని పిలచినట్లు పాడుట మొదలుపెట్టాడు. ఆ రాగము నందుకొని అందరూ మళ్ళీ నృత్యముచేయ మొదలుపెట్టారు.

పచ్చని ఆకులతో నిండిన ఆ మామిడితోటలో వేలాది యువతులు, యువకులు రంగురంగుల దుస్తులను ధరించి ఏక కంఠ మున పాడుతూ చేసిన నృత్యమును ఏకవి వర్ణించగలడు? ఏ చిత్ర కారుడు చిత్రించగలడు? రంభ, ఊర్వశి, తిలోత్తమ మొదలగు అప్సరసలు, తుంబురుడు మొదలగు గంధర్వగాయకులు, కిన్నెరలు మొదలగు నృత్యకళా కోవిదులతో నిండియుండిన నాట్యకళావేత్త మన పురాణములలో వర్ణించిన ఇంద్రుని ఆస్థానమును కూడ ఆ ప్రకృతిబిడ్డలు చేసిన నృత్యము మరుగుపరుస్తుంది.

అట్లు వారు అలసిపోవునంతవరకు నృత్యముచేసి, తరువాత అన్ని పల్లెలవారు విడిపోయి సంధ్యవేళవరకు వేరువేరుగా నృత్యము చేసి పాడుచూ నృత్యముచేయుచూ యిండ్లకు పోయారు. కొన్ని సమయములందు వారు రాత్రిఅంతయు నృత్యముచేస్తారట.

వీరి 'సార్‌హుల్' పండుగ లేక ఉత్సవము విప్పచెట్టు చిగిర్చినప్పుడు చేయుదురు. 'ఖర్మనృత్యము' (May day) వరి నాటుటకు సిద్ధముగానున్నప్పుడు చేయుదురు. ఈ సమయములలో ఖర్మనృత్యము చేసిన వరిపైరు చక్కగా ఫలించునని వీరి దృఢవిశ్వాసము. 'కనిహారి' పైరులు పండి కోతలైన తరువాత చేసికొను పండుగ.

ఖర్మ పండుగప్పుడు కొందరు యువతీ యువకులు అరణ్యానికి వెళ్ళి 'ఖర్మ' వృక్షపు (విప్పచెట్టు) కొమ్మను తీసుకువచ్చి పల్లెలోని 'అకారా' (యువకులు సాముచేయుస్థలము) మధ్య నాటెదరు. మరునాటి ప్రొద్దున్న పిన్నలూ, పెద్దలు, అందరూ పండుగదుస్తులను ధరించి 'అకారా'కు చుట్టూవున్న చింతచెట్లక్రింద చేరుదురు. యువతీ యువకులు చేతులుపట్టుకొని గుండ్రముగా ఆ ఖర్మవృక్షము చుట్టూ తిరుగుచూ నృత్యముచేయుదురు. ఆ చెట్టును రంగు రంగుల గుడ్డతో, గాజులతో, రంగు రంగుల వరిగడ్డిదండల పూలదండలతో అలంకరిస్తారు. అట్టి అలంకారములతో కూడుకొనిన చెట్టుచుట్టూ నవ్వుతూ, ఉత్సాహముతో ప్రకృతిగీతములను పాడుచూ స్త్రీలు, పురుషులూ నృత్యముచేయుచున్న సమయములో ఆ వృక్షమును చూస్తే మన పూర్వులు చెప్పిన 'కల్పవృక్షము' జ్ఞప్తికి వస్తుంది. దీనిని ఆంగ్లేయుల 'May Pole' తో పోల్చవచ్చును.

'సార్‌హుల్' పండుగ – సూర్యదేవునికి, భూమాతకు పెండ్లి చేయుట. విప్పపూలు ఈ పూజకు ముఖ్యముగనుక విప్పచెట్టు పుష్పించినంతవరకు వీరు ఈ పూజ చేయరు. సాధారణముగా ఈ పూజ ఏప్రెల్ నెలలో జరుగుతుంది.

ఒక తెల్లని కోడిపుంజు సూర్యదేవునిగా, ఒక నల్లని కోడిపెట్ట భూదేవిగాపెట్టి ఈ రెంటికీ పెండ్లిచేయుదురు. అనగా పసుపుకుంకుమలతో పూజించెదరు. పూజ ముగిసినపిదప ఆ రెంటినికోసెదరు. తరువాత

ఆ పల్లెలోని వారందరూచేరి వారి పూజకు 'బైగా' లేక 'పహన్'తో కలిసి 'సర్న' పవిత్రభూమికి వెళ్ళెదరు. [ఇది సాధారణముగా పాతవిప్ప మొదలగు చెట్లతోగూడిన అరణ్యప్రదేశమై వుంటుంది] అది 'సర్నబురీహి' లేక ఒక ముసలి స్త్రీయొక్క నివాసస్థలమనియు, ఆ స్థలమాహాత్మ్యము వర్షమును స్వాధీనమున నుంచుకొనుననియు (Control) వీరి నమ్మకము. అరణ్యములు వర్షములను శాసించునను సిద్ధాంతము పూర్వము తెలియదు గనుక ఆ అరణ్యములోని దేవత ఆ వర్షమును తనచేత నుంచుకొనుననియు, ఆమెను పూజించి తృప్తిపరచినచో వర్షములు బాగుగ కురియుననియు వీరి నమ్మకము. ఈ పండుగలో వీరు సూర్యుని, ధరిత్రిని, వర్షమును పూజింతురు. పంటలు చక్కగాపండుటకు వర్షము అవసరము. చెట్లు చేమలు జీవించుటకు సూర్యరశ్మి (వేడి) అవసరము. ఆ పంటలను పండించుటకు భూమి అవసరము. అందువలన ఈ ముగ్గురిని సంతోషపెట్టుటకు వీరు ఈ పండుగ చేస్తారని తలచవచ్చును.

చంపిన రెండు కోళ్లను ఆ పవిత్రస్థలమున పాతిపెట్టుదురు. ఆ అరణ్యదేవతకు మరి అయిదు కోళ్లను బలియిత్తురు. తరువాత వారా కోళ్లను విందారగించి, నృత్యగీతములతో దిన మంతయు అచటనే గడిపి, ఖర్మ పూగుత్తులను చేతులతో పట్టుకొని నృత్యము చేస్తూ ఇండ్లకు వస్తారు. మరునాడు 'బైగా' (పూజారి) విప్ప పువ్వులు చేతపట్టుకొని ప్రతి యింటికి వచ్చును. స్త్రీ లెల్లరూ తమ తమ గుమ్మములలో, రెండుచేతులలో రెండు దొన్నెలు (ఒకటి ఖాళీది, రెండవ దానిలో బియ్యము నుండి తీసిన సారా, బైగా కొరకు) పట్టుకొని నిలువబడుదురు. ఖాళీ దొన్నెలో అతని యొద్దనుండి పవిత్ర జలము (తీర్థము) తీసి కొందురు. 'బైగా' ప్రతి యింటి ముందు నిలువబడి, ఆ యింటిపై కొన్ని పూలువేసి, ఆస్త్రీల తలలో కొన్నిపూలు ఉంచును. జలమును ధాన్యముపై జల్లుచూ, "మీ యిండ్లు, గోతములు ధాన్యముతో నిండుగాక! బైగా దోనె ఫలించుగాక" అని మంత్రము పఠించును. తరువాత ఆ యింటిస్త్రీ అంతవరకు అతి భక్తి గౌరవములతో చూచిన 'బైగా' పై విలాసముగ నవ్వుచూ కుండెడు నీలు పోసుంది. ఇది ఒక విధమైన వర్ష తంత్రముగా

చెప్పవచ్చును. తరువాత అందరూ విందారగించి, తమ మబ్బు వన్నె శరీరములకు, జీడిగింజనలుపు తలవెండ్రుకలకు శోభనిచ్చు లేతగోధుమరంగు విప్పపూలతో అలంకరించుకొని, 'అకారా' వద్ద చేరి నృత్యగీతములతో రాత్రంతా గడిపెదరు.

మన దేశమందలి అతి పురాతనమైన ఒక తెగ ప్రజల సంఘాచారములు, వారి నృత్యకళ - వీనినిగూర్చి ఇంతవరకూ వర్ణించబడినది.

౨

# కోలులు మొదలైన ఆటవికుల నృత్యములు

# కోలులు మొదలైన ఆటవికుల నృత్యములు

కోలులు ద్రావిడులలోని ఒక తెగవారు. వీరు ముఖ్యముగా ఛోటానాగపూర్, సింగభూమి, మధ్యరాష్ట్రము, మధ్య హిందూ స్థానములలో నివసిస్తారు. ఇప్పటి మన 'నాగరికత' సంఘములోవలె నృత్యము ఏ కొందరిసొమ్మో గాక ఆటవికుల నిత్య జీవిత కృత్యములలో నృత్య మొకవిశేషము కోలులకు. కోలులకు నృత్యమంటే అత్యంత ప్రీతి. ఈ తెగవారందరూ ఒకచోట కూడినప్పుడుగాని, ఒక పల్లెలోనివారు ఇంకొక పల్లెలోని తమ బంధువులను చూడబోయినప్పుడుగాని, వీరు నృత్యగీతములతో కాలము గడిపెదరు. ప్రతియొక్క ఋతువు సమయమునకు సరిపోవు నృత్యములెన్నియో వీరు చేయుదురు. వీరి నృత్యములు అతి నెమ్మదిగానూ, స్వాభావికమై సుకుమారముగా ఉండును. తాళ లయలలో వీరికి మంచి ప్రావీణ్యముండుటచే వీరినృత్యములు తాళము తప్పక చక్కగా లయననుసరించి చేయబడుటచే చూచుటకు హృదయరంజకముగ నుండును. వీరి నృత్యములలో 'వరికోతల నృత్యము' (Harvest Dance) ముఖ్యముగా చూడదగినది.

మద్దెలలు మోగుతున్నాయి. కర్రఫ్లూట్‌లో తాళముననుసరించి కడుచక్కని పాట వినబడుతూంది. స్త్రీలంతా వరుసగా నిలబడ్డారు. వారు ఏదోఒకగీతమును పాడుచూ తాళలయల ననుసరించి కాళ్ళుయెత్తి అడుగులను వేస్తూ అందరూ ఒకేసారి వంగి చేతులతో కొన్ని సంజ్ఞలు (Movements) చేశారు. అది అచ్చముగ పొలములలో వరినాటిన ట్లనిపించింది. తరువాత కోతలుకోయుట, కోసినపైరును కట్టలుగట్టి దానిని రాతిపైకొట్టి దులిపి, కుప్పలువేయుట మొదలైన వన్నియు తాళలయలు తప్పకుండా మధురముగా పాడుతూ అభినయించారు. కుప్పలుగావేసిన వరిలోని ధాన్యమునేర్పరచి చేటలతో చెరుగుతూ, శుభ్రపర్చి పోశారు. తాను ఏడాది చెమటలూడ్చి కష్టపడిన శ్రమ ఫలితమును కనులార చూచినప్పటి రైతురాజు ఆనందమెంతని చెప్పగలము! ఆ సంతోషమునే త్వరత్వరగా ప్రతి అవయవమును కదల్చుతూ, ఉల్లాసముతో తిరుగుచూ నృత్యము

చేయుచూ అభినయించారు. ఇట్లు వారు వర్షఋతు ప్రారంభములో పొలముదున్నుట మొదలు ఆ ఏట కృషిఫలితమైన క్రొత్తవడ్ల విందార గించువరకు జరుగు దృశ్యములను వివిధ ఘట్టములుగా నృత్యము చేశారు.

శాస్త్రమంటేయేమో తెలియకపోయినా, మన నృత్యకళా రాధకులవలె ఏండ్ల తరబడి నృత్యము నభ్యసించక పోయినా, వీరి నృత్యము ఎంతో సున్నితమై, భావప్రకటన మిక్కిలి సహజముగా నుండినది వారి పాటలు అర్థము గాకపోయినా, వారి చక్కని అంగ చలనమువలన వారేమి చేస్తున్నారో కడు సులభముగా అర్థమయ్యేది. నృత్యము చేస్తున్నవారు కేవలము తాము నృత్యము చేస్తున్నట్లు తలపక ఆ భావములో లీనమగుటయే దీనికి ముఖ్యమైన కారణము. శాస్త్రము తెలియకపోయినా, వారు దానిని సమగ్రముగా, సహజ ముగా చేయుటచేతనే ఆ నృత్యము ప్రతి ఒక్కనికి సులభముగా అర్థమవుతుంది. అతికష్టమై సామాన్యుల కర్థముగానటువంటి ఒక విషయమును లేక ఒక భావమును, మిక్కిలి సులభముగా సామాన్యు లకు, పసిబిడ్డలకు కూడా అర్థమయ్యేలాగున ప్రదర్శించుటే శాస్త్రము యొక్క ముఖ్య ఆదర్శమనియు, అది సామాన్యమైన భావమును అతి చిక్కగా అన్యులకు అర్థముగాని విధమున ప్రదర్శించుట కాదనియు, వీరి నృత్యము చూచినతరువాత నేను గ్రహించితిని.

మధ్యరాష్ట్రములోని కోలులు 'గోండుల' ఖర్మనృత్యము చేయుదురు. కానీ వీరి నృత్యము 'గోండుల' ఖర్మనృత్యముకన్న సున్నితముగాను, చక్కగాను ఉంటుంది.

* * * *

స్త్రీ పురుషులుఒకరికెదురుగా ఒకరు పంక్తులుదీర్చి నిలబడ్డారు. వాయిద్యగాండ్రు ఒకడు స్త్రీల ప్రక్కకు తిరిగి, మరియొకడు పురుషుల ప్రక్కకు తిరిగి నిలబడ్డారు. నృత్యము చేయువారు, ముందుకు వచ్చిన ముందుకూ, వెనుకకు పోయిన వెనుకకు పోవుచూ, వారి ననుసరించి నడచుచూ జంత్రగాండ్రు వాయిద్యములను వాయిస్తున్నారు.

కొంతసేపు వారు ఆ విధముగా నృత్యముచేసి, తరువాత స్త్రీ పురుషు లతో కలసి చక్రాకారముగ తిరుగుచూ నృత్యము చేశారు. అప్పుడు వాయిద్యగాండ్రు మధ్యలో నిలబడి తమ వాయిద్యములను వాయిం చారు. స్త్రీలు పురుషులు కలిసి చేయునటువంటి దివొక నృత్యము.

మరియొకటి:

ఒక పెద్ద చక్రమువలె ఒకరికొకరు దగ్గరగా అతుక్కుపోయి నట్లు నిలబడి చేతులతో వివిధ ఆయుధములను, ఎడమచేతిలో విల్లు, కుడిచేతిలో తళతళ మెరయు గొడ్డళ్లు పట్టుకొని నృత్యము చేస్తారు. వీరే కోలారియన్ తెగకు చెందిన 'కోరువాలు'.

వీరు ఛోటానాగపూర్ పీఠభూమిలో నివసింతురు. కొందరు రణభేరినాదమువంటి నాదముచేయు మద్దెలలు వేస్తున్నారు. స్త్రీలు ఆ పురుషుల చక్రములో ఇంకొక చక్రముగా నిలబడ్డారు.

వీరు ఒకరిని అంటిపెట్టుకొని ఒకరు అతుక్కు పోయినట్లు అతి దగ్గరగా నిలబడడం చూస్తే చుట్టచుట్టుకొని పండుకొన్న పాము జ్ఞాపకానికి వస్తుంది. అందరూ పాడుతూ నృత్యము చేస్తున్నారు. అందరికీ మధ్యలో 'బోరగన్' కూర్చొని ఒక తంతివాయిద్యమును వాయించుచూ పాడుచూ, తన అభినయముతో నృత్యముచేసి అలసి పోయినవారి నుత్సాహపరుస్తూ, వారి నృత్యమునకు జీవము పోస్తున్నాడు. నృత్యముచేయు పురుషులు కొందరు తమ పొడుగాటి వెండ్రుకలను సిగ ముడివేసి దానిలోఅమ్ములుంచారు. వారు నృత్యము చేస్తూ కదలునపుడు అవికూడా వారితోకలిసి బహు చక్కగా ఊగుతున్నాయి. మరికొందరు వెండ్రుకలను జడలుగా వేసుకొని దానిలో ఒక్కొక్క అమ్మునుంచారు. వారు నృత్యము చేసినపుడు ఆ జడ ఆడుతుండి. దానితోపాటు, ఆ అమ్ము అటు ప్రక్కకు, ఇటు ప్రక్కకు ఆడుట చూస్తుంటే హృదయాహ్లాదకరముగా ఉంటుంది. స్త్రీలు సంతాల వనితలవలె ఎఱ్ఱరంగుతో అద్దిన ప్రత్తిపూవులతో తమ శిరోజముల నలంకరించుకున్నారు. ఇవి తప్ప మరేసొమ్ములు వారి శరీరములపై లేవు.

వీరు ఖర్మ నృత్యమును గ్రీష్మఋతువులో చేయుదురు. ఆ నృత్యముచేసినచో పంటలు బాగుగా పండునని వారియుద్దేశ్యము. వీరికిది ఒక విధమైన ఆరాధన నృత్యము. ఈ నృత్యమును భగవంతుని స్తోత్రగీతముల పాడుచూ చేయుదురు. వర్షములులేనిచో వీరీ నృత్యమును ప్రతిరాత్రి చేయుదురు. ఈ విధముగా నృత్యగీతములతో భగవంతు నారాధించిన, అతడు సంతృప్తుడై వర్షము కురిపించునని వారి దృఢ విశ్వాసము.

## కవురులు

చత్తీస్‌ఘర్ జిల్లాలోనూ, మహానదికి ఉత్తరముననున్న ప్రదేశములలోనూ వీరు నివసింతురు.

వీరి నృత్యములకు సంతాలు, కోలుల నృత్యములకు ఏ విధమైన సంబంధములేదు. కొందరు పురుషులు చక్రాకారముగ నిలబడి మనదేశములోవేయు కోలాటమువలె తిరుగుతూ, తిరుగుచున్నప్పుడు చేతులలోని కర్రలను కొట్టుచూ, మద్దెల లయ ననుసరించి పాడుచూ, దానికి తగినట్లు అడుగువేయుచూ, ఆ తాళమునకు తగినట్లు చేతిలోని కర్రలను కొట్టుచూ నృత్యమాడుదురు.

కొన్ని నృత్యములలో ప్రతిఒక్కరూ ఒక పెద్ద చిన్నడప్పుల వంటి వాయిద్యములను చేతపట్టుకొని గుండ్రముగా తిరుగుచూ చేతులలోని బాజాలను వాయిస్తూ బహుసుభమైన, సున్నితమైన గీతమును పాడుచూ, నృత్యమాడుదురు. వారికెదురుగా స్త్రీలు నిలువబడి శిరములను కప్పుకొని, శరీరములను ఒక ప్రక్కకువంచి ఒకరినొకరు యుద్ధభూమికి తరలు సైనికులవలె తగులుచూ నిలువబడి (చేతులుమాత్రము పట్టుకొనరు, కోలులవలె చేతుల నాడించరు,) నృత్యముచేస్తారు. ఇది 'బైగాల' 'సేల' 'రినా' నృత్యములను చాల మట్టుకు పోలియుంటుంది. 'బైగాలు' కొన్ని ఆటవిక జాతులకు పూజారులు.

'సేల' నృత్యము 'బైగా' పురుషులు చేయునది. వీరుకూడా గుండ్రముగా తిరిగి నృత్యము చేసినా కవ్రులవలె డప్పులు వాయించక చేతులలో కర్రలు పట్టుకొని కోలాటము వేయుచూ నృత్యమాడెదరు

అదేవిధముగా 'బైగా' స్త్రీలు 'రినా' నృత్యము చేయుదురు. స్త్రీలు ఒకరికి దగ్గరగా ఒకరు నిలువబడి, చేతులుమాత్రము పట్టుకొనక ముందుకువస్తూ, వెనుకకు వెళ్తూ, వంగుతూ నృత్యముచేసెదరు. ఇటీవల గోండులుకూడ 'సేల', 'రినా' నృత్యములను చేయుచున్నారు. కానీ, అవి తాము బైగాలవద్ద నేర్చుకున్నామని చెప్పుదురు.

★ ★ ★

కోయజాతుల నృత్యమొకటి గమనించండి !

సుమారు ఇరవైమంది పురుషులు మెడలలో పొడుగుపాటి పెద్ద పెద్ద మద్దెలలను వ్రేలాడ వేసుకొని నిలబడ్డారు. తలవెండ్రుకలను గోపురము లాగున శిరముపై గట్టి, దానిపై తలపాగచుట్టి, తలకు రెండుప్రక్కల ఎద్దుకొమ్ములను అలంకారములుగా ధరించారు. శరీరముపై ఏమీ వస్త్రములను ధరించలేదు. మోకాళ్ళ వరకు పంచె మాత్రము కట్టుకున్నారు. పురుషులు మద్దెలలను వాయిస్తూ, గుండ్రముగా తిరుగుచూ నృత్యము చేస్తున్నారు. స్త్రీలు వారికి కొంతదూరములో నిలబడి ఒకరి చేతుల నొకరు పట్టుకొని నృత్యమాడుతున్నారు. ఈ మాదిరిగా కొంత సేపు నృత్యముచేసి ఆగారు. అప్పుడు పురుషులు రెండుభాగములుగా చీలి, ఒకరికెదురుగా ఒకరు నిలబడ్డారు. ఒక నిముసము నిశ్శబ్దము.

"ధంగ్ ధంగ్ త ధంగ్ తకిడ, ధంగ్ ధంగ్ అని ఇరవై మంది యిరవై మద్దెలలను ఒకేసారి తుఫాను సమయములోని మేఘగర్జన లాగున పలికించారు. అందరిలోను ఒకవిధమైన ఉత్సాహము, ఉద్రేకము, ఆవేశం పుట్టింది. వారు శరీరములను కదలిస్తూ, మద్దెల మ్రోగిస్తూ నృత్యముచేయుచూ వెనుకకువెళ్లి అతితొందరగా అడుగులు వేస్తూ, చిన్నపరుగువలె ముందుకువచ్చి ఆబోతుల పోట్లాటలో

ఆబోతులు ఢీ కొనునట్లు ఢీకొని తమతలలను దగ్గరగా జేర్చి కొమ్ము లతో పొడుచుకొనున ట్లభినయించారు. ఈవిధముగా యిద్దరిద్దరి తల లను కొమ్ములతో పొడుచుకొనున ట్లభినయిస్తూ గిరగిర గుండ్రముగా తిరుగుచూ చేతులతో మద్దెలలువాయిస్తూ తాళము తప్పక నృత్యము ఆడుతున్నారు. ఇది ఆబోతుల దెబ్బలాట నృత్యము. పరుగు పరుగున వెనుకకు అడుగులువేస్తూ వెళ్ళారు. మళ్ళీ ముందుకు 'ఫళ ఫళ' మని మద్దెలలు వాయిస్తూ 'పరుగెత్తుకొని వచ్చి 'ఢో' కొన్నారు. ఇలా నృత్యముచేస్తూ అలసిపోతున్న నర్తకులను ప్రేక్షకులుగా నిలబడ్డ పురుషులు, స్త్రీలు చూస్తూ అందరూ కలసి యేకకంఠమున 'హే... హే' అని కేకలువేస్తూ ఉత్సాహపరుస్తున్నారు. అటుల కొంతసేపు నృత్యము చేసి తిరిగి స్త్రీలు పురుషులు కలిసి ప్రకృతి సంగీతముల పాడుచూ నృత్యముచేశారు.

ఇది 'రామన్న- లక్ష్మన్న, మేము కోయదొరలమండి, కోయ రాజులం'' అని మన ఇండ్లకువచ్చు కోయరాజుల 'ఆబోతుల' నృత్యము.

* * * *

ఆ ప్రదేశమంతా దట్టముగా లతలతో అల్లుకోబడిన చెట్లతో నిండి ఎత్తైన పర్వతపంక్తులతోనూ శోభిస్తున్నాది. ప్రక్కనే గోదావరినది పర్వతశ్రేణులనుండి పల్లపుభూములకు మధు సుమధుర ధ్వనులుచేస్తూ జారుతుంది. నిశ్శబ్దముగానున్న ఆ అడవిలో తమ బిడ్డలకు తెల్లవారుఝామున 'కొక్కో' అని నిద్రలేపు పక్షుల పలుకులు, నిద్రలేచి రెక్కలను విదల్చుకొని బద్ధకము తీర్చుకొని ఆకసముపై కెగరు పక్షుల రెక్కలచప్పుడు మాత్రము వినబడుతూంది. లేడి కుందేటికూనలు పొదలలో గెంతుచూ విహారముచేస్తున్న అడుగుల చప్పుడు, సన్నాయిపాటలో తెలుపుటకు వేయు తాళములయొక్క మధురధ్వనిని జ్ఞాపకపరుస్తుంది. ప్రభాతభానుని లేతకిరణాలు చెట్ల ఆకులపైని నీటిబిందువులను హరించుటచే మంచుచే నిండి వంగిన ఆకులొక్కొక్కటే తమతలల పైకెత్తి ప్రపంచమును తొంగి చూస్తున్నాయి. ఆ ప్రశాంతసమయములో ఆ గోదావరి నంటిపెట్టు

కొని ఉన్న కోయగూడెములోని ప్రజలు ఒక విశాలప్రదేశంలో గుమిగూడి చేసిన ఈ నృత్యమును చూచిన, ఏ కళారాధకుడు తన జీవితమున ఆ దృశ్యము మరచిపోగలడు?

ఈ నృత్యము నేను ఆరేండ్ల క్రిందట భద్రాచలమునకు దగ్గరగానున్న అడవులలో విహరించెడి కోయలు చేయగా చూచాను. ఈ నృత్యము చూస్తుంటే డార్విన్ (Darwin) తన Descent of Man లో వ్రాసిన 'Bisan fight' జ్ఞాపకానికి వస్తోంది.

## గోండలీల 'గోండల్' నృత్యము

గోండులు మన ఆంధ్రదేశములోని జంగమువారి వంటి వారు. పెండ్లి మొదలగు శుభకార్యముల సమయములలో 'గోండల్' నృత్యము చేయుదురు. నలుగురు మనుష్యులు ఈ నృత్యములో పాల్గొంటారు. అందులో నృత్యముచేయువాడు పాదములవరకు పొడుగుగానున్న ఒక కుచ్చుల కుడిచేని, గవ్వలతో చేయబడిన ఒక మాలను, కాళ్ళకు గజ్జెలను ధరించును. తలకు మార్వాడీలు కట్టుకొనునటువంటి తలపాగా ఉంచును. మిగిలిన ముగ్గురూ అతనివెంట నిలబడి యుందురు. అందులో యిద్దరు మద్దెలలు వాయించేవారు. మూడవవాడు దివిట్ (Sacred Yarch) పట్టుకొని నిలబడును. దివిట్ పట్టుకొన్నవాడు హాస్యగానిగా నటునిగా ఉపయోగపడును. వీరు భవానీస్తోత్రము చేయుచూ నృత్యమాడుదురు. రంగస్థలములో నొక కొయ్య బెంచీనుంచి దానిమీద ఒక తెల్లని గుడ్డను కప్పి, ఆ గుడ్డ మీద గోదుమలు పరచి దానిపై నీళ్ళతో నిండిన ఇత్తడి చెంబుపై కొబ్బరి కాయనుంచి ఆ బల్లపై పెట్టుదురు. ఇది భవానీదేవిగా తలచబడుతుంది. నృత్యప్రదర్శనము ముగిసిన పిమ్మట ఆ కొబ్బరి కాయను కొట్టి గోధుమలు, కొబ్బరికాయలను వారే తినివేయుదురు.

వీరిని సాధారణముగా పెళ్లిళ్ళకు, నామకరణము, రజస్వలానంతర శాంతి పూజాసమయములలో పిలిపించి కొన్నిజాతులవారు నృత్యముచేయింతురు. ఇవిగాక ఊరక వినోదార్థముగా నృత్యము చేయునప్పుడు భవానీదేవిని ఆరాధించక ఊరక నృత్యము చేయుదురు. వీరినృత్యములు ఆధ్యాత్మికతను బోధించును.

"నేనెవరు - ఎటనుండి వచ్చాను" - ఈ పరమరహస్యమును యింతవరకు ఎవ్వరూ తెలుపలేక పోయారు.

తల్లి దండ్రి - అక్కా తమ్ముడు, వీరంతా మాయ - వీరంతా నావారేనని తలచి స్వార్థముకోసము జీవము వృథాపుచ్చుచున్నాను.

విషయ వాంఛ నరకానికి మొదలుమెట్టు. మానవుడు ఏకారణము లేకుండా దీనిలో చిక్కుకున్నాడు. ఓయి నరుడా!

నీ గురువును తలచుకో' (అనగా జ్ఞానమిచ్చేవాడని అర్థము),
అతని యొద్దకు వెళ్లి పాదములపై బడు,
దయ, క్షమ రెండు కవచాలను ధరించు,
జ్ఞానమును సంపాదించుకో,

భగవంతుడు ప్రతి మానవుని హృదయములో వెలుగుతున్నాడు.

ఈ విధమైన వేదాంత సంబంధములగు గీతములను వీరు నృత్యములో పాడెదరు.

## హల్బా

రాత్రి తొమ్మిదిగంట లవుతూంది. నేను చిన్న దీపము ముందు కూర్చొని వ్రాసుకుంటున్నాను. ఆ పూరిఇంటి తలుపు చప్పుడు కాకుండా తెరచి 'బుర్రబైగా' లోనికి వచ్చాడు. అతని చేతిలో ఒక చిన్న దీపము వుంది.

"ఈ రాత్రికి ఒక వింత జరుగుతూంది. త్వరగా రండి పోదాము" అని నన్ను తొందర పెట్టాడు.

ఐదు నిముషములు అయిన తరువాత ఇద్దరము కాలిబాటపై నడచి వెళుతున్నాము. ఆ నాడు అమావాస్య; ఆ ప్రదేశమంతా చీకటిగా నున్నది. అతడు చేతిలోనున్న చిన్న దీపముతో దారి చూపుతూ ముందుకు నడుస్తున్నాడు. అతనిని అనుసరించి నేనూ వెళుతున్నాను. ఒక ఆచారి ఒక పొలములోనికి వెళ్లాడు. గట్టునవే

ఉన్న మంచెమీద ఇద్దరము కూర్చున్నాము. అతడు చేతిలోని దీపము నార్పివేశాడు. ప్రశాంతముగా వున్న ఆ ప్రదేశమునంతా చీకటి కప్పివేసింది. మధ్య మధ్య పొదలలో కదలుచున్న జంతువుల చప్పుడు మాత్రము వినబడుతుంది. అతడు మాటలాడకుండా నిశ్శబ్దముగా కూర్చున్నాడు. నేనూ అలాగే కూర్చున్నాను. ఇట్లు ఎంతోసేపు కూర్చున్నామో! దూరమునుండి 'చుర్ చుర్ చుర్ చుర్' అని ఒక శబ్దము వినబడింది. కొంతసేపటికి అది ఆగిపోయింది. అతడు చీకటిలో ఆ శబ్దము వచ్చిన వైపుకు చూస్తూ కూర్చున్నాడు. మరల ఆ ప్రదేశమంతా నిశ్శబ్దముగా నున్నది. పదిహేను నిమిషములైన తరువాత మరల అదేవైపునుండి 'చం చం చం చం' అని వినబడుట మొదలు పెట్టింది. ఆ శబ్దము రానురాను మమ్ము సమీపించుతున్నట్లనిపించింది. దూరములో ఒక దీపపు వెలుగు, దాని నీడలో కొందరు మనుష్యులు నడుస్తున్నట్లనిపించింది.

'ఇదేమిట్రా బుర్రా' ఆతృతతో అడిగాను.

ఉష్. అతడు నోటిపై వ్రేలువేసుకొని మాట్లాడ వద్దన్నట్లు సైగచేశాడు.

అది అరణ్యప్రదేశము. బందిపోటు దొంగలేమోనని నాకు భయమువేసింది; నాగుండె దడదడ కొట్టుకో మొదలుపెట్టింది.

ఆ వెలుగు క్రమేణా మాకు ఐదుగజముల దూరమునకు వచ్చింది. సుమారు ఏడుగురు మనుష్యులు కాళ్ళకు గుంగినియాలు (మన స్త్రీలుధరించే అందెలు వంటివి) ధరించారు. ఇవి లోపల గుల్లగా నుండును. దానిలో రాళ్ళు వేయుటచే వారు నడచినప్పుడు అవి మధురధ్వనుల చేయును. అందులో ఒకడు దీపముపట్టుకొని నడుస్తున్నాడు. మిగిలిన వారందరూ ఆ దీపపునీడలో నిలబడి నృత్యములోవలె అందరూ ఒకలయలో అడుగులు వేయుటచే వాళ్ళ కాళ్ళ గుంగినియాలు చం చం చం చం అని చెవుల కానందము నిచ్చు శబ్దములను చేయుచున్నాయి. ప్రక్కనే ఉన్న పొదలలో పడుకొని వున్న కుందేటి కూనలు అటువైపుకి పరుగెత్తుకొని

వచ్చాయి. కానీ ఆ దీపపువెలుగులో దానివెనుకనున్న మనుష్యులను చూడలేక మిణుకు మిణుకుమని వెలుగుతున్న దీపము ముందుకు వచ్చి దానినిచూస్తూ నిలబడ్డాయి. అవి దీపము ముందుకు రాగానే నిలబడియున్న మనుష్యులు వానిని పట్టుకొని మరునాటి విందుకు గాను బుట్టలో వేసుకొన్నారు. ఈ విధముగా తమ కాళ్ళ గుంగి నియాల ధ్వనిచే ఆకర్షించబడి దీపము ముందుకు వచ్చిన కుందేలు మొదలగు చిన్న చిన్న జంతువులను పట్టుకొంటూ వెళ్ళిపోయారు.

వీరు 'హల్బా' అను ఒక కర్షక తెగకు చెందినవారు. ఈ విధముగా వీరు జంతువులను రాత్రులందు వేటాడెదరు. వీరు రాయపూరుకు దక్షిణమున కాంకేరు, బస్తరు సంస్థానములలో నివసింతురు.

చూచారా, హల్బాలవేట ?

బుర్రా ఇదివేటా, లేకనృత్యమా ?

"నాగరిక ప్రపంచములో నివసించే నిత్యజీవితాలకు, కళకూ సంబంధములేదు. కానీ ప్రకృతి బిడ్డలమగు మాకు జీవనమే కళ. కళే మాజీవితము. సెలయేర్ల మధుర ధ్వానులే మాసంగీతము. వసంతమున తమ ప్రియురాండ్ర నాకర్షించుటకు నెమళ్ళు మొదలగు పక్షులుచేయు అభినయమే మాకునృత్యము. వర్షఋతు మేఘ గర్జనలే మా మృదంగ వాయిద్యము. కోయిలల పలుకులే మా మురళీగీతము" అని ఫకాలున నవ్వాడు'బుర్ర బైగా'.

ఈ దృశ్యమును నేను కొన్నిసంవత్సరముల క్రింద సి. పి. ఆటవికుల నృత్యకళ నభ్యసించుచుండిన సమయములో చూచాను.

# గోండులు - కర్మనృత్యము

## గోండులు

వీరు చాందాజిల్లా, సాత్పురా కీరభూమి, బేతూలు, సివిని, మాండ్లాజిల్లా మొదలైన ప్రదేశములలో నివసిస్తారు. వీరికి కోండులని గోండులని పేరు. ఇప్పటి మధ్యరాష్ట్రము (సి. పి.) గోండ్వానా (గోండులరాజ్యము) అని పిలువబడేది. వీరి భాష తెలుగు, తమిళం, కన్నడం, భాషలను చాలమట్టుకు పోలియుంటుంది. ఒకప్పుడు వీరు పెద్ద రాజ్యములను స్థాపించి పాలించారు. చింద్వాడాదగ్గర దేవ్గర్, జబ్బల్పూర్ దగ్గర గర్హామాండ్ల, చాందా మొదలగు ప్రదేశములు చాలకాలము గోండురాజులు పాలించారు. పురుషవేషమును ధరించి తన శిశువును వీపుకుకట్టుకొని తన స్వాతంత్ర్యరక్షణకై రణరంగమున శత్రువులతో పోరాడి వీరస్వర్గము నలంకరించిన వీరనారి మహారాణి దుర్గావతి ఈ తెగకు చెందినదే !

గోండుల నృత్యకళనుగూర్చి చెప్పబోయేముందు వారికి సంబంధించిన పురాణగాథ చెప్పవలసి ఉంటుంది.

ఆదిలో ప్రపంచమున, ఎచ్చట చూచినను నీరే. భగవంతుడు తామరాకులో జన్మించి ఒక్కడే జీవించాడు. ఒకరోజు తన చేతిని నలిపి ఆ మట్టితో ఒక కాకిని సృష్టించాడు. అది ఎగిరి అతని భుజముపై వ్రాలింది. కాకిని ఎగిరిపోయి కొంతమన్ను తీసుకురమ్మని ఆజ్ఞయిచ్చాడు. కాకి చాలసేపు వెదికిందిగాని, దానికి మన్ను ఎక్కడా కనుపించలేదు. చివరకు ఒకకాలు సముద్రగర్భముపైనుంచి విశ్రాంతి తీసుకుంటున్న ఎండ్రకాయను చూచింది. అలసిపోయి ఎండ్రకాయ మెత్తని వీపుమీద వ్రాలింది. ఆ కాకిపాదములయొక్క గీతలే ఎండ్రకాయవీపుమీద ఏర్పడినవి. కాకి ఎండ్రకాయను మన్ను ఎక్కడుందని అడిగింది. ఎండ్రకాయ తన శరీరమును భగవంతుడు గట్టిగాచేస్తే, తానే మన్ను తెచ్చి యిస్తానన్నది. భగవంతు డందు కంగీకరించి యెండ్రకాయ వీపును గట్టిగా చేశాడు. అందువలననే యెండ్రకాయ పైభాగము గట్టిగా వుంటుందిట ! అది నీళ్ళలోకి

పోయి భూగర్భములో ఎఱ్ఱను (కెనెడా) చూచి దాని మెడను గట్టిగా పట్టుకుంది. అందుకునే ఎఱ్ఱ మెడచుట్టూ నల్లనిమచ్చ యేర్పడిందట! ఎఱ్ఱ తననోటిలోనుండి మన్ను బయటకు తెచ్చింది. ఎండ్రకాయ ఆ మన్నును తెచ్చి భగవంతుని కిచ్చింది. అతడు దానిని సముద్రములో చల్లగా అక్కడక్కడ భూమి ఏర్పడింది. అప్పుడు భగవంతుడు దానిమీద నడిచాడు. అతని చేతిలో ఒక బొబ్బ యెక్కింది. దానిలోనుండి పార్వతీ పరమేశ్వరులు పుట్టారు. గోండులు పార్వతీతనయులే ననియు, వారి అవిసీతి వర్తనము మహాదేవుని కోపకారణ మయ్యెననియూ — ఇలా కల్పించి గోండుల మెప్పుపొందడానికి హిందూకవులు ప్రయత్నించివుంటారు.

## గోండుల నృత్యకళ

గోండులలో అవివాహితులైన యువతీ యువకులు నృత్య గానములతో కాలము గడుపుటకై ఒక గృహము ఏర్పరచబడును. దానిని 'గోటల్‌పూర్' అందురు. అది వారి నృత్యమందిర మన వచ్చును. కొన్ని ప్రదేశములలో స్త్రీ పురుషులకు వేరువేరుగా రెండు నృత్యగృహము లుండును. చత్తీసుఘర్‌లో గోండు పల్లెలలో, పెండ్లి గాని యువతీయువకులు 'గోటల్‌ఘర్'లో రాత్రిళ్లు చేరి, నృత్యగీతము లతో కాలము గడిపెదరు. రాత్రి భోజనమైన తరువాత పెండ్లిగాని యువకులు ముందుగ నృత్యగృహములు చేరుదురు. వారి తరువాత యువతులు వెళ్లెదరు 'కొట్వారు' (Master of Cermonies) అనబడు గురువు బాలికలను ఆహ్వానించి, బాలకులయొక్క నాయకునికి (సర్దార్‌కు) వారిచే ముందుగా మ్రొక్కించును. తరువాత యువతి తనకు నచ్చిన యువకుని ఏరుకొని, అతని తలదువ్వి, కాళ్లు, చేతులు మర్దించి (Massage) నృత్యము మొదలుపెట్టును. అలసిపోవునంత వరకు పాడుచూ, నృత్యముచేసి తరువాత విశ్రాంతి తీసికొందురు. యువతులు యిష్టమైనచో తమ ఇండ్లకు పోవచ్చును. కాని సాధారణ ముగా తనతో నృత్యముచేసిన యువకుని యింటనే గడిపెదరు. ఈ విధముగా ప్రతి రాత్రీ నృత్యముచేయుటచే అనేక యువతీయువకు లలో పరస్పరానురాగము ఏర్పడుతుంది. తలిదండ్రులు వారి పెండ్లికి

ఒప్పుకోననిచో వారు అరణ్యములలోనికి పారిపోవుదురు. అప్పుడు వారిద్దరూ భార్యాభర్తలుగ జీవించుటకు సంఘము ఒప్పుకుంటుంది. అనగా పెండ్లి అయినట్లు అర్థము. కొన్ని ప్రదేశములలో బాలికలను 'గోటల్‌ఘర్'కు పంపరు.

ఇదేవిధముగా 'భుయ్యా' (వీరు బైగా జాతికి చెందినవారు, బైగాలు అరణ్యాజాతులవారికి పూజారులు) జాతి పెండ్లిగాని యువతులు బియ్యమును పువ్వులతో నలంకరించి, తమ పల్లెనుండి మరొక పల్లెకుపోయి, ఆ పల్లెలోని ముందు దానినుంచి దీనిని తీసుకోండి, లేకుంటే నీళ్ళల్లో వేయండి అందురు. వారంగీకరించినట్లైతే ఆ పువుల నెత్తి తమచెవులపై నుంచుకొందురు. ఆరోజుసాయంత్రము ఆపల్లెలోని పెండ్లిగాని యువకులందరూ ఈ పడుచులతో కలసి రెండుగుంపులుగా వీడి పోవుదురు మొదటి గుంపువారు నృత్యముచేసి అలసినపుడు రెండవ గుంపువారు నృత్యముచేయుదురు. ఈ విశ్రాంతిసమయమే వారు ఒకరితో నొకరు గూడి పరస్పరానురాగము పెంపొందించుకొను సమయము, వారు ప్రేమ వెల్లడించుకొనుటకు ఒక అవకాశము. ఇట్లు రాత్రంతా నృత్యములతోగడిపి, తెల్లవారులోగా అందులో ఎవరైనా భార్యాభర్తలుగా జీవించుటకు యిష్టపడినచో, ఇద్దరూ కలిసి రెండు మూడు రోజులవరకూ అరణ్యములలోనికి పారిపోయెదరు. అనగా వారికి పెండ్లైనట్లర్థము.

గోండు పురుషులు తమ మోచేతులు, మోకాళ్ళకు, మణికట్టులకు 'హోత్' అగ్నిలోమండుతున్న మోదుగకర్రలతో చురకలు వేసుకొందురు. అటుల చేయుటవలన నృత్యమునకు కావలసిన విధముగా వారి అవయవములు లొంగుననియు, ఆ కర్రలవలె తమ దేహములుకూడా అతితేలికగా తయారగుననియు, మండుచున్న జ్వాలలవలె తమ దేహముకూడా కదలుననియు, అతి తొందరగా మండు మంటలవలె తమ అంగములోగూడ చురుకుదనము వచ్చుననియు వారి నమ్మకము. కొందరు కుందేటి పేడతో పిడకలుచేసి దానితో మోచేతులు, మోకాళ్ళమీద చురకలు వేసుకొందురు.

అటుల చేయుటవలన కుందేటికాళ్ళవలె తమ అంగములు అతి చక్కగా వంగుననియు, చలనము కుందేటివలె అతి చురుకుగా నుండుననియు వారి నమ్మకము.

నృత్యగీతములు గోండుల నిత్యజీవితములో ఒక ముఖ్యాంశము. వారి నృత్యములలో ముఖ్యమైనది ఖర్మనృత్యము.

వర్షఋతు ప్రారంభములో (భాద్రపదము) గోండులు చిగిర్చిన విప్పకొమ్మను తెచ్చి ఒక క్రొత్తగుడ్డలోనుంచి యిండ్లలో నుంచెదరు. ఆ నాడు పెద్దపండుగ చేయుదురు. విందారగించిన తరువాత భజంత్రములు, మద్దెలలు ప్రమోగించుచుండ స్త్రీ పురుషులు కలిసి ఆ కొమ్మచుట్టూ తిరుగుచూ ప్రేమగీతములనో, ప్రకృతిగీతములనో పాడుచూ నృత్యముచేయుదురు. ఇదియే ఖర్మనృత్యము. ఇది గోండులకే గాక ఇతర అరణ్యజాతులవారికిగూడ ముఖ్యమైన నృత్యము. ఇటుల నృత్యగీతములతో 'ఖర్మవృక్షము' నారాధించి భగవంతుని సంతోషపెట్టిన పంటలు పండునని వారి దృఢనమ్మకము. ఇది ఒకవిధమైన అడవిప్రజల దైవారాధన నృత్యము (Ceremonial Dance).

ఇదేవిధముగా కార్తీకము లేక మార్గశిర మాసములలో భుయ్యా తెగవారు ఒకఖర్మవృక్షము కొమ్మను అడవినుండి తెచ్చి దానిని పల్లెలలోనుంచి దానిముందు ఖర్మనృత్యము చేయుదురు. ఇట్టి నృత్యగీతములతో కూడుకొనిన పూజవలన విప్ప, మామిడి, పనస మొదలైనచెట్లు చక్కగా ఫలించునని వారినమ్మకము. సోమ, బుధ, శుక్రవారములు వీరు పూజచేయుటకు శుభదినములు.

ఆశ్వయుజ లేక కుర్‌వార్ మాసములో గోండు బాలికలు కొందరు ఒక కుండకు చిల్లులు పొడిచి ఒక దీపమును, పావురము యొక్క విగ్రహమును, దానిలోనుంచి దానిని ఒక బాలిక తలపైనుంచి, యింటింటికి వెళ్ళి, దాన్ని ఇంటిముందు వాకిటిలో నుంచి పాడుచూ వంగి గుండ్రముగా తిరుగుచూ చప్పట్లు చరచుచూ నృత్యమాడుదురు.

వీరు ఖర్మనృత్యమేగాక, ఇతరసమయములలో - చలి, వేసవి కాలములలో - ఇతర విశ్రాంతి సమయములలో నృత్యగీతములతో ప్రొద్దు పుచ్చుదురు. మరియు గోండులు స్త్రీలు పురుషులు కలసి నృత్యము చేయుదురు. ప్రతి పురుషుడు తనకు ఒక ప్రక్కనున్న స్త్రీ మెడచుట్టూ చేయివేసి పట్టుకొనును. రెండవస్త్రీ ఛాతిని (వక్షమును) చుట్టి అతని రెండవచేయి ఉండును. తాళలయల ననుసరించి ఒకకాలు తర్వాత ఇంకొక కాలు ఎత్తుచూ, భూమిపై కొట్టుచూ చక్రాకారముగ తిరుగుచూ నృత్యము చేయుదురు. ఈ నృత్యములో పెండ్లిగాని మెరియా గోండుయువతులే పాల్గొందురు. పెండ్లైనవా రీనృత్యములో పాల్గొనరు. పురుషులు, నృత్యసమయములలో పులులు, చిరుతలు, లేళ్లు మొదలైన జంతువుల చర్మములతో తమ శరీరముల నలంకరించుకొందురు. కొన్ని వేళలయందు నెమిలిపురితో శిరముల నలంకరించుకొందురు. వీపు ప్రక్క వారు కదలినపుడు మ్రోగుటకుగాను ఒకటి రెండుగంటలను ధరింతురు. వాయిద్యగాండ్రు మధ్యను కూర్చొని టాం టాంలు మద్దెలలు వాయింతురు. కొన్నిసమయములలో వీరి నృత్యములో ముప్పదిమంది వాయిద్యగాండ్రు పాల్గొంటారు.

ఒక్కొక్కప్పుడు, స్త్రీలు పురుషులు ఒకరికెదురుగా ఒకరు నిలబడి నృత్యముచేయుదురు. వారిమధ్యలో వాయిద్యగాండ్రు నిలబడుదురు. ముందుకు వస్తూ వెనుకకు పోతూ ఒకకాలు ముందుకు వేస్తూ రెండవకాలు నెత్తి గెంతుచూ నృత్యముచేయుదురు. నృత్యమునను సరించే వాయిద్యగాండ్రుకూడ, వారు ముందుకు వస్తే ముందుకూ, వెనుకకు పోతే వెనుకకు వెళ్లుతూ వాయిద్యములను వాయింతురు. ఈ నృత్యములో స్త్రీలను పురుషులు పట్టుకొని నృత్యమాడరు. కనుక యువతులుకూడా దీనిలో పాల్గొంటారు.

గోండుల గీతములు కొన్ని వేదాంతముగాను, కొన్ని ప్రేమ గీతములుగాను, కొన్ని స్త్రీ పురుషులమధ్య డైలాగ్సుగాను వుంటాయి. వాటి భావాలు ఈ మాదిరిగా వుంటాయి.

"నీ శరీరమును జూచి పొంగకయ్యా
అది ఒకరోజు పైకి పోవాల్సిందేగా
నీ తల్లీ దండ్రీ, చుట్టములు, బంధువులు
అందరిని విడిచి పోవాలి
నీ యింటిలోనున్న లక్షల ఆస్తినిగూడా
మరణకాలములో వదలి పోవాలి"

వాద్యములు పలుకుతున్నాయి. ఆ సంగీతము ననుసరించి పాదము భూమిపై నృత్యముచేస్తుంది. విడాకులిచ్చిన స్త్రీకి ఒక కానీ, ఉంపుడు గత్తెకు, రెండూ, కాని అన్నెపున్నెము లెరుగని అబల ఎన్నోవేల మంచి శబ్దములు గల నాణెములు.

వాయిద్యం భూమి మాఅడుగుల చప్పుడుతో ప్రతిధ్వనిస్తుంది.

పురుషులు:—

ఆ యువతి నిద్రపోతుంది
ఆమెరాజు ఆమె తొడపై పండుకొని నిద్రపోతున్నాడు.
ఒక రొట్టెముక్క ఆమె ఒడిలో నున్నది
ఒక ముంతలో నీళ్లున్నవి
ఆమె నేత్రములలోనికి చూచి చెప్పవయ్యా
నన్ను కలుస్తుందో లేదో?

స్త్రీలు:—

నా ఆవును ఆమె దొడ్డిలో వదిలాను
దూడను కొట్టు దగ్గర విడిచాను
నాబిడ్డను ఆమెకు వదిలాను
(అనగా అన్ని బంధాలు త్రెంచుకొని)
నే నొక్కతనే వచ్చానయ్యా
నిన్ననుసరించి వెళ్లుటకు.

---

తృతీయ భాగము

# తూర్పుదీవులలో నృత్యకళ

## ౧. బాలీద్వీపములోని రామనటనము

# బాలీద్వీపములోని రామనటనము

కళ జాతికి జీవము. కత్తితో సామ్రాజ్యములు స్థాపించిన రాజుల రాజ్యములు ఆ రాజులతోనే అంతమొందినవి. కాని హిందూదేశము తన లలితకళలతో, సంస్కృతితో తూర్పు దీవులలోని ప్రజల హృదయము నాక్రమించినది. అందువల్లనే శతాబ్దములు గడచినవి. మన కళలు, మన సాంప్రదాయములు మనము మరచిపోయినను, తూర్పుదేశములలో అవి ఇంకా చెక్కు చెదరకుండా సజీవముగా నున్నవి. దేహమునకు చావు నిక్కముగాని ఆత్మకు చావు లేదన్న మన పూర్వుల సిద్ధాంతము ఎంత చక్కగా ఈ దేశములలో నిర్ధారణ చేయబడినది.

సుమారు వెయ్యి సంవత్సరముల క్రిందట అమ్మురాజా అను బలిద్వీపపురాజు మనదేశముపైకి దండెత్తివచ్చి మలబారు ప్రాంతములోని ప్రజల నోడించి కొందరిని తనతోబాటు బాలికి గొనిపోయెననియు, వారే బాలిద్వీపపు ప్రజలకు నృత్యకళ నేర్పిరనియు కొందరి యభిప్రాయము. కాని ఆ ప్రదేశములోని నృత్యకళను చక్కగా పరిశీలించిన తరువాత దానిలోని సత్యము కొంచెము సంశయింపవలసి యుండును.

రామాయణ, మహాభారత, భాగవతములను నృత్య నాటికలుగా శాస్త్రోక్తముగా ప్రదర్శించువారు మన ఆంధ్రలో కూచిపూడివారు, మలబారులో కథాకళీ నర్తకులే కనబడుచున్నారు. బాలీ, జావా మొదలగు ప్రదేశములలోని నర్తకులుకూడ మన పురాణములను నృత్యనాటికలుగా ప్రదర్శింతురు.

భరతనాట్యము, కథక్, కథకళీ నృత్యములలో రసభావ ప్రకటనమునకు నేత్రములు ప్రధానములు. కాని బాలీదేశపు నర్తకులు మణిపూరి నర్తకులవలె నేత్రములను నృత్యప్రదర్శన ములలో ఉపయోగించరు. (మణిపూరి నృత్యము కేవలము దైవ సంబంధమైన నృత్యమగుటచే నేత్రములు, వక్షస్థలములయొక్క చలనము నిషేధింపబడినది.) ఈ మణిపూరివారి సిద్ధాంతమే బాల మొదలగు ప్రదేశములలో ప్రబలి యున్నది.

సిగ్రై కేళా 'చవ్వు' నృత్యము చేయువారు ముఖములకు తొడుగులు (Masks) వేసుకొని నృత్యము చేయుదురు. అందువల్ల నృత్యములో రసభావ ప్రకటనలకు ఆర్కెష్ట్రా సంగీతము నాధార ముగాచేసుకొని ప్రదర్శింతురు. ఉదా:-రౌద్రరసమును ప్రదర్శించవలసి నపుడు మద్దెల మొదలగు వాయిద్యములు వడివడిగాను, గట్టిగాను, ఉద్రేకపూరితముగాను పలుకును. దాని ననుసరించి వారు అవయవము లను కదలించి భావప్రకటనము చేయుదురు. అటులనే కరుణరసము నభినయించవలసి వచ్చినప్పుడు సంగీతము అతివిలంబితముగను, శాంతముగను, మృదువుగను ఉండును. దాని ననుసరించి అంగ చలనముచేసి ఆ రసమును పోషింతురు. అటులనే బలీ, జావా ద్వీపములలోని నర్తకులుగూడ నృత్యము చేయుదురు. వారు ముఖము లకు తొడుగులను (masks) ధరించకపోయినను ముఖమునకు నృత్య సమయములో దట్టముగా వేసుకొనిన రంగువలన (thick make-up) ముఖము Mask వలె కనబడుతుంది. వారు అవలోకితముగ చూతురు. నృత్యములో ఏయొక్క ఘట్టములోగూడ వారిదృష్టి ప్రేక్షకులపై పడదు. వీరి హస్తాభినయము అనగా వీరు నృత్యములో నుపయోగించు ముద్రలు కొన్ని భరతనాట్యశాస్త్రము ననుసరించి, మరికొన్ని హస్త లక్షణదీపిక (ఇది మలబారులోని కథకళీ నృత్యమునకు ముఖ్య గ్రంథము) ననుసరించి చేయబడును. వేషధారణ మన అజంతా చిత్రములను పోలియుండును.

ఈ విషయములనన్నిటిని చక్కగా విమర్శించిన ప్రత్యేకముగా ఒక్క మలబారునుండేగాక భారతదేశములోని వివిధప్రాంతములనుండి కళాప్రచారకు లీ దేశములకు పోయి నృత్యకళాప్రచారమును చేసి యుందురను నిర్ణయమునకు మనము రాగలము.

## రామ నటనము

సామాన్య ప్రజలవినోదార్థము చేయబడు నృత్యపార్టీలవారి నృత్యమునుగురించి ఈ వ్యాసములో వ్రాయబడును. ఏ కొబ్బరి తోట లోనో, ఏ దేవాలయఆవరణలోనో వీరుసాధారణముగా ప్రదర్శనముల నిత్తురు. ఈ ప్రదర్శనములు చాలమట్టుకు మన వీధిభాగవతములు,

కథకళీనృత్యనాటికలను పోలియుండును. అందుచే వీనిని గురించి వివరములు వ్రాయుటలేదు. కాని వీనిప్రవేశపెట్టు పక్షులు, జంతువుల నృత్యము - (మనదేశములో కథకళీ మయూరనృత్యము తప్ప యితర జంతువుల నృత్యము సాధారణముగా లేదు) - ను గూర్చి వ్రాయబడును.

నృత్యనాటికలోని ఘట్టము - శ్రీ రాముని పట్టాభిషేక సందర్భములో కైక వరములు కోరను ఆమె యిష్టప్రకారము సీతారామలక్ష్మణులు అరణ్యములకు బయలుదేరారు. వారు దండకారణ్యమును ప్రవేశించిరి అలసి ఒక చెట్టుక్రింద కూర్చుండిరి.

అది వసంతఋతు ఆరంభము-పక్షులు తమ తమ సంసారములను ఏర్పరచుకొను-ఆడుపక్షులు తమ భర్తలను ఎన్నుకొను - సమయము. ఈ ఋతువు పక్షుల స్వయంవరసమయముగా చెప్పవచ్చును.

గమ్మేళన 'కిచ్ కిచ్' - 'కిచ్ కిచ్' మని ఏమియో పక్షిభాషను పలికినది.

సుమారు పండ్రెండుమంది బాలురు పక్షుల అలంకారములలో పక్షులవలె నృత్యముచేయుచు ప్రవేశించిరి. అందులో పదిమంది బాలుర అలంకారములు పండిన నారింజపండు రంగుగాను, మిగిలిన యిరువురి అలంకారములు గోధుమ, ఎరుపు రంగుల చారలగాను ఉన్నవి. వీరిద్దరు స్త్రీలు, ఆ పదిమంది పురుషులు. స్త్రీలు కొంచెము దూరముగా కూర్చొని పురుషులు తమ నాకర్షించునట్లుచేయు నృత్యమును చూచుచున్నారు. ఒకనాయకుడు తననృత్యమును మొదలు పెట్టాడు. మెల్లమెల్లగా అడుగులు వేయుచు ఆ స్త్రీలను చేరబోవునట్లు నటించాడు. అతని వెనుకనున్న మిగిలిన తొమ్మిది మంది ఫుట్ బాల్ పందెములో తనవైపువారికి ఉత్సాహము గలుగజేయుటకు 'హుర్రా హుర్రా' (Hurrah ! Hurrah !) అని కేకలు వేసినట్లు ఏమిటో శబ్దములుచేసారు. అతనిలో ఉత్సాహముద్విగుణీకృతమైనది. తనరెక్కలను విప్పుతూ, ముడుస్తూ ఈ ప్రక్కకు, ఆ ప్రక్కకు వొరిగి నృత్యముచేయుచు, తనచక్కని దేహముతో ఆస్త్రీల నాకర్షించునట్లు

నృత్యము చేసి చేసి, అలసి ఒకసన్నని కూత కూసాడు. వెంటనే రెండవవాడు తన నృత్యము మొదలు పెట్టాడు. ఈ విధముగా ఒక్కొక్కపక్షినృత్యముచేయుట, అలసిపోవుట, విశ్రాంతితీసుకొనుట చూపబడినది. ఆఖరుకు ఆ నారీమణులు వారిలో యిద్దరిని తన భర్తలుగా ఎన్నుకొని వారితో కలసి దూరముగా వెళ్లిపోయారు. మిగిలినవారు మెల్లగా నిరాశ కనబరచునట్లు నృత్యముచేస్తూ వెళ్ళిపోయారు.

తరువాత రెండు నెమిళ్లు నృత్యమాడుతూ వచ్చాయి. రెండూ ఎదురెదురుగా నిలబడినవి. రంగు రంగుల పురిగలది మొగ నెమిలి. పురిలేనిది ఆడునెమిలి. మగనెమిలి తన రంగులపురిని చక్కని సన్నని ఊదారంగు మెలికలుతిరుగు మెడను, ఛాతిని ఆమెకు కనబడునట్లు నృత్యము చేయుచున్నాడు. తరువాత వివిధాకారములలో తన మెడను త్రిప్పాడు, కదల్చాడు. ఆడునెమిలి అతనిపురిని చక్కగా పరిశీలించినది. తరువాత అతనిమెడను, ఛాతినిగూడ చడీచప్పుడు లేక పరిశీలించినది. అతడు ఉత్సాహముతో ఉప్పొంగుతూ, సంతోషముపట్టలేక తొందర తొందరగా నృత్యము చేస్తున్నాడు. చివరకు కాళ్ళవద్దకురాగానే ఫకాలున నవ్వినట్లు ఏదో శబ్దము చేసింది.

"నీ శరీరమైతే యింత అందముగావుందికాని నీకాళ్ళమాట ఏమిచెపుతావయ్యా" అని అర్థము కాబోలు.

దానితో మగనెమిలికి ఉత్సాహము తగ్గింది. పదే పదే తన కాళ్ళు చూచుకొనుచు విచారము వెలువడునట్లు నెమ్మదిగా నృత్యము చేయుచున్నాడు. రెండు నిమిషములామె అటులనే అతనిని తిలకించి అతనిచెంతచేరి మెడలోమెడ కలిపింది. అనగా పెండ్లికూతురు, పెండ్లికొడుకు పూలమాలలు వేసుకొనినారన్నమాట.

సీతారామ లక్ష్మణులు ఈ నృత్యము చూస్తూకూర్చున్నారు. అంతలో దూరమున ఏదోశబ్దములు బాకానాదము గుఱ్ఱముల గిట్టలచప్పుడు వినబడింది. ఇది భరతుడు తిరిగి రాముని అయోధ్యకు రమ్మని వేడుకొనుటకు వచ్చుదృశ్యము. లక్ష్మణుడు ఆ చప్పుడుకు

కారణము తెలిసికొనుటకు చెట్టెక్కి నలుదిశల చూస్తాడు. అప్పుడు అతనికి ఒకదృశ్యము కనబడుతుంది. అది రెండు మగ తొండల యుద్ధము.

రెండుతొండలు ఒకదానికి ఎదురుగా ఒకటి వస్తున్నాయి. అవి చూచుకొన్నాయి. రెండూ తమ తలలను క్రిందికి మీదికి నాలుగయిదు సార్లు ఆడించాయి. వాని కండ్లు కోపముతో మెరుస్తున్నాయి. అవి తమతోకలను ప్రక్కలకు ఆడించుట మొదలు పెట్టాయి. వానిలో ఉద్రేకముహెచ్చింది. రెండూ కలియబడ్డాయి. ఒకటి క్రింద, రెండవది మీద తమపండ్లతో శరీరములను గట్టిగా కొరికి పట్టుకొని దొర్లుతున్నాయి. ఈ విధముగా పది నిమిషములు యుద్ధము జరిగింది. ఆఖరుకు ఒకదాని తోక విరిగింది. జయమునొందిన తొండ ఆ తోకను మ్రింగింది.

సాధారణజంతువులలో పక్షులలో వసంతఋతువు లేక ఎండాకాల ప్రారంభములో - అవి తమ సంసారముల నేర్పరచు కొను సమయము - మగజాతిలో వైరము (Rivalry) ఉంటుంది. ఇట్టిదే వీరు చూపిన తొండలయుద్ధము.

ఈ నృత్యము చూచిన తరువాత డార్విన్ (Darwin) 'Descent of man' లేక 'Origin of the species' అన్నపుస్తకములు చదివితే ఈదేశ కళాసేవకులు ప్రకృతి నెంతచక్కగా అర్థముచేసికొ గలిగిరో మనకు బోధపడుతుంది.

కళ అనగా సృష్టియొక్క ప్రతిబింబము. కళారాధకుడు సృష్టిని ప్రతిబింబింపజేయు ఒక దర్పణము. ఒక ప్రతిబింబము స్పష్టముగా చూచుటకు మనము అద్దము నెంతచక్కగా తుడిచి శుభ్రపరతుమో అలాగునే కళావేత్తయును సహజముగా కళను ప్రదర్శించాలంటే కేవలము శాస్త్రపఠనమే గాకుండ ప్రకృతిని పఠించి దానిలో లీనము కావలసియున్నది.

---

# కంబోడియాలో 'క్మైర్' నృత్యము

పూర్వదేశములలో (అనగా బాలి, జావా, సుమత్రా మొదలగు ఇండోనీషియన్ ద్వీపములలోను, సయ్యాం, ఇండోచైనా, కంబోడియా, మొదలైన దేశములలోను) లలితకళల నభ్యసించబోయిన కళాపిపాసికి మూడు తరగతుల కళారాధకులు కనబడుతారు.

(1) ప్రత్యేకముగా దేవాలయములలో నృత్యముచేయువారు:—

వీరు దేవళములలోతప్ప యితర ప్రదేశములలో నృత్యము చేయరు. వీరి నృత్యములన్నియు భక్తిరసముతో నిండి ఆధ్యాత్మిక చింతగలవిగా నుండును. వీరికి సాధారణముగా ప్రాపంచిక విషయము లతో నెట్టిసంబంధము ఉండదు. నృత్యకళతో భగవంతుని పూజించి తమ జీవితములను తరించు భక్తులుగా వీరి నెంచుకొనవచ్చును. విషయవాంఛలపై మనసు పోయినపుడు దేవళములలో నృత్యము చేయుట మానివేయుదురు. వీరిని మన పురాణకాలమునాటి దేవ దాసీ (అనగా దైవచింతగల కళారాధకులు) లతో పోల్చవచ్చును. ఇట్టివారు యిప్పటి మన భారతదేశములో మిక్కిలి అరుదు.

(2) రాజుల పోషణలో నుండువారు:—

వీరు రాజదర్బారులలో, పండితసభలలో మాత్రము నృత్యము చేయుదురు. సామాన్య ప్రజానీకముతో వీరికి సంబంధముండదు. రాజులు, సుల్తానులు, జమీందారులు మొదలగు ధనికవర్గమువారిచే వీరు పోషింపబడుదురు. వీరిని లలితకళలు, తర్కశాస్త్రము, వేదము నభ్యసించి, రాజుల దర్బారుల నలంకరించి, రాజుల గౌరవమును బడసిన మన పూర్వకాలపు గణికలతో పోల్చవచ్చును.

ఈ స్త్రీలు ఒక్కొక్కప్పుడు భర్తలేక రాజుగారి ఉంపుడు గత్తెలుగా జీవించినను, వారియొక్క పాండిత్యమున కందరూ వారిని గౌరవించెడివారు. వీరితో 'నటు' డను వాడొకడుండును. అతడు ఈ స్త్రీలకు గురువు. అతడే వీరికి నృత్యకళ, సంగీతకళ నేర్పి, వారిచే దర్బారులలో నృత్యకళా ప్రదర్శనములను చేయించును. నృత్యము

లలో వెనుకపాట పాడును. ప్రోషిత భర్తృక, విరహోత్కంఠిత మొదలగు అష్టవిధనాయికల నభినయించవలసి వచ్చినపుడు చెలికత్తెగా నటుడు నటించును. నర్తకి తానార్జించిన ధనములో కొంత భాగ మాతనికి గురుదక్షిణగా నిచ్చును. ఇటులనే నటిమీద నటుడు, నటునిపై నటి ఆధారపడియుండును.

'సిరియంపి', 'కిన్నెర' మొదలగు దర్బారు నృత్యములను చేయువారిని ఈ గణిక తెగలోనికి చేర్చవచ్చును.

(3) సామాన్య ప్రజలకొరకు నృత్యము చేయువారు:—

వీరు ఒక ప్రదేశమునుండి ఇంకొక ప్రదేశమునకు తిరుగుచూ నృత్యప్రదర్శనముల నిత్తురు. వీరిని ఆంధ్రదేశములోని వీధి భాగవతము పార్టీలతోను, సంయుక్త రాష్ట్రములలోని 'రామ్‌లీలా', 'నౌటంకి' వారితోనుపోల్చవచ్చును. రామాయణము, మహాభారతము మొదలైన పురాణగాథలను వీరు నృత్యముచేయుదురు. అర్జునుడు ఈ ప్రదేశములలోని, మహారాష్ట్రములోని 'దండోరా' నర్తకుల లోని, తమాషాజనుల ఆదర్శపురుషుడు. వీరి నృత్యనాటికలలో మనుష్యులేగాక పశుపక్ష్యాది జంతువులనుగూడ వాని ఆహార్యములలో ప్రవేశపెట్టెదరు.

వీరుగాక వాయాంగ్ (అనగా మన తోలుబొమ్మల భాగవత ఆటగాండ్ర వంటివారు) 'నర్తకులు' 'Shadow play' 'ఛాయానృత్య' నర్తకులు (వీరు రామాయణము మొదలైన కథలను తెల్లని తెర వెనుక నిలబడి ఆడుదురు. వీరినీడమటుకు తెరమీద పడును) మొదలైన వారున్నారు.

## బలీ ద్వీపము

బలీ మొదలగు కొన్ని ప్రదేశములలో ప్రతి స్త్రీ పురుషుడు నృత్యకళ (నృత్యగీత వాద్యములలో ఏదైనఒకటి) విధిగా నభ్యసించి యుండును. ఈ అన్ని ప్రదేశములలో ప్రాచీన హిందూమత సాంప్రదాయములను, లలితకళలను చెక్కుచెదరక కాపాడి పోషించినది

బలీద్వీపము. ఈ ద్వీపములో ప్రచారముచేసిన ప్రతి భారతీయుడు యిరవయ్యోశతాబ్దపు నాగరికతా ప్రపంచములో పెరిగిన భారత యువకులు ప్రపంచములో ఏదో ఒకమూల ప్రదేశములో వున్న ట్లను కొనక వేదకాలపు మన పూర్వులను కలసినట్లు భావిస్తాము. భరత భూమిలో హిందూమతము సంస్కృతి జీవములేని దిష్టిబొమ్మగా తయారైనా, సజీవ హిందూమతము బలీద్వీపములో ఉన్నది. ఈ ఇరవయ్యో శతాబ్దములో హిందూమత తత్వమును అర్థము చేసుకొనిన వారు ఎవ్వరైన నున్నారంటే వారు బలీద్వీపపు ప్రజలే! దీనికి ఒక నిదర్శనము: నేను 'సాంగ్‌యాంగ్' దేవదాసీలను గురించి వ్రాసినాను.

రంగు రంగుల సరోంగులు తమ యౌవనమును మరుగుపరచే లాగున కట్టిన కామినుల కనినప్పుడుగాని, శిరోజములను తలపై గోపురాకారమున కట్టి దానిపై పుష్పముల నలంకరించుకొనిన యౌవనవతుల దర్శనము మనకు కలిగినప్పుడుగాని, మన అజంతా చిత్రాలు జ్ఞాపకమునకు వచ్చును. నిజమునకు బలీద్వీపము ఒక స్వప్నభూమి.

## జా వా ద్వీ ప ము

జావాలో అధికసంఖ్యాకులు మహమ్మదీయులు అయినను మన దేశములోవలె మసీదుముందర వాయిద్యములు వాయించగూడదనీ, వారి మతములో నృత్య సంగీతాది కళలు నిషేధింపబడినవి గనుక మహమ్మదీయులు ఆ కళల నారాధించుట మతవిరుద్ధము అని - ఇట్టి పిచ్చినమ్మకములు, మూఢవిశ్వాసములు, మనదేశములోని చాల మంది మహమ్మదీయులలోవలె వారిలోలేకపోవుట చాల ఆశ్చర్యకర మైన విషయము. జావాలోని సుల్తానులు మన హిందూ నృత్యకళను పోషించారు. సుధామ, సుకర్ణ, మొదలైన హిందూ పురాణపురుషుల పేర్లు వారిలో నెందరికో గలవు. సుప్రసిద్ధ 'బోరోబోదూరు' దేవాలయము (ఇప్పుడు శిథిలావస్థలో నున్నది) శిల్పకళానైపుణ్యము కన్నులార జూచి ఆనందించుటకు లక్షలాదిప్రజలు ప్రతిసంవత్సరము వచ్చెదరు.

## కంబోడియా

ఫ్రెంచి, ఇండోచైనాలో యిది ఒకభాగము – మన పురాణ సంస్కృతి ఒకప్పుడు దేదీప్యమానముగా నిక్కడ వెలుగొందినదని తెలిసికొనుటకు అచ్చట యిప్పటికి యెన్నో దేవాలయ శిథిలము లున్నవి. ఉదా:—అంకోర్ వాట్ శిథిలాలయము, మన లలితకళలు వారి హృదయములను శాశ్వతముగా ఆక్రమించుకొన్నవని నిర్ధారణ చేయుటకు వారి నృత్యములే ఉదాహరణము.

కానీ ఈ ప్రదేశములోని ప్రజల సమ్మేళనము (ఆర్కెస్ట్రా) లో మాత్రము భేదము కనబడును.

పురాతనకాలములో మనవారు వీణ, మృదంగము, ఫ్లూటు, తాళములు, శ్రుతి, గాత్రము, నృత్యముచేయుపాత్రకు మంచిధ్వనిగల గజ్జెలు తప్ప యితరవాద్యములను ఉపయోగించెడివారుకారు.

(భారతీయనృత్యకళ కాధారములైన శాస్త్రములు, భరత శాస్త్రము, అభినయ దర్పణములలో వీణ, ఫ్లూటు, తాళములు, శ్రుతి, గాత్రము, మృదంగము, మంచిగజ్జెలే – పేర్కొనబడినవి.)

శివప్రదోత్ర శ్లోకములో శివుని సంధ్యాతాండవ వర్ణములో గూడ పై జెప్పిన కార్యములే పేర్కొనబడి యున్నవి.

"ముల్లోకములకు తల్లియైన ఉమను రత్నములు పొదగబడిన సింహాసనముపై కూర్చుండబెట్టి దేవతలందరూ గుమిగూడి, సరస్వతి వీణమీటు, ఇంద్రుడు మురళివాయించ, బ్రహ్మ తాళమువేయ, విష్ణువు మృదంగము పలికించ, లక్ష్మి గీతముపాడగా, ముల్లోకజనులు గంధర్వులు. యక్షులు, అమరులు, అప్సరసలు, కిన్నెరలు మొదలైన వారు గుమిగూడి ఆనందముతో చూడగా కైలాస పర్వతముపై శివుడు సంధ్యాతాండవము చేసెను."

కొంతకాలమునకు జలతరంగముకూడ ఉపయోగములోనికి వచ్చినది. (వాత్స్యాయనకామ సూత్రములలో, జలతరంగ వాయిద్యము అరవైనాలుగు విద్యలలో ఒక్కటిగా చెప్పబడినది.

కాని తూర్పుదీవులలోని గమ్మేళనలో కనీసము ముప్పైమంది వాయిద్యగాండ్రైనా వుండెదరు. కొందరు వెదురుకఱ్ఱలతో చేయబడిన కాష్ఠతరంగములను వాయింతురు. గమ్మేళనలో నివి యెక్కువగా నుండును. కఱ్ఱ ఫ్లూటులు, నగారావంటి కొన్ని వాద్యములు, డప్పులు వీరి ముఖ్య వాయిద్యములు.

గాత్రము మన నృత్యకళకు జీవము. గమ్మేళన వాయిద్యగాండ్రు నృత్యనాటికలలోని వివిధఘట్టములలో ఆ యా రసములను పోషించునట్టి సంగీతమును ఆ వాయిద్యములు సహాయముతో పలికింతురు. ఇది గమ్మేళన వాయిద్యములో కనుపించు విశేషత.

కంబోడియా నృత్యములలో సుప్రసిద్ధమైనది 'కిన్నెర నృత్యము' – కిన్నెర నృత్యప్రదర్శనము యిచ్చట వర్ణించుచున్నాను.

"ఆ వెన్నెల రాత్రిలో బహిరంగ ప్రదేశములో చేయబడు నృత్యప్రదర్శనము (open Air dance Performance) చూచుటకు, ఒక శిథిల దేవాలయపు విశాల ఆవరణములో జనులందరు గుంపులు గుంపులుగా కూర్చుండిరి. అక్కడక్కడ నూనె కాగడాలు వెలుగుచున్నవి. నాడు పౌర్ణమి. పసిబిడ్డలు ఆడుకొనుటకు ఉయ్యాలపైన వ్రేలాడగట్టిన బంతివలె చందమామ ఆకాశములో కదలుచున్నాడు.

దేవాలయములో మినుకు మినుకు మని వెలుగుచున్న దీపముల కాంతితో నర్తకులు ముస్తాబు అగుచున్నారు.

గమ్మేళన ప్రార్థనగీతమును ముగించినది. గంటల తరంగము ఒక్కొక్క మధురధ్వని వినీ వినబడునట్లు అతి నెమ్మదిగా చేయుట మొదలుపెట్టినది.

నర్తకు లొక్కరొక్కరూ, ఆకసమునుండి గాలితో ఎగురుచు భూమిపైకి జారు అప్సరసలవలె గమ్మేళన సంగీతమునకు తగినట్లు అడుగులు వేయుచు, దేవళములోనుండి ముఖములు ప్రేక్షకులకు కనబడకుండ విసనకర్రలను అడ్డుపెట్టుకొని దిగి వరుసగా వంటికాలు మీద, రెండవకాలు వెనుకప్రక్కకు ఎత్తిఉంచి భరతనాట్యములోని వృశ్చిక నృత్యకరణిలోవలె నిలబడిరి.

వాయిద్యగాండ్రు ఒక్కనిమిషము ఏదో స్తోత్రగీతము పాడిరి.

గమ్మేళన వసంతఋతువులో సాయంసమయమున వీచు మలయమారుతమువలె పలికినది. వారు విసనకర్రలను జారవిడిచి, ప్రభాతసమయమున పూచీ పూయని పుష్పముల రేకులను చీల్చుకొని మకరందము గ్రోలుతూ ఒక పూవునుండి ఇంకొక పూవునకు యెగురుతూ వానిపై వ్రాలుతూ తమ రెక్కలకు అంటుకొనిన పుప్పొడిని విదల్చుకొనుచూ తమ రంగు రంగుల రెక్కలను మూయుచూ, తెరచుచూ ఆచక్కని రంగుల కాశపడి తమ్ము పట్టుకొనవచ్చిన పిల్లవాండ్రను భ్రమపెట్టుచు, వారు పట్టుకొనుటకురాగా దొరకక తప్పించుకొని దూరముగా ఎగిరిపోయి ప్రకృతిలో మాయమయ్యే సీతాకోకచిలుకలలాగున వారు నృత్యముచేయ మొదలు పెట్టిరి.

వారు శరీరమున కతుకుకొని ఉండినటువంటి జల్తారుతో కుట్టబడిన ఊదారంగు మక్‌మల్ చూడీదారు పైజమాలు, నిండుచేతుల జాకెట్టును ధరించితిరి. తలపైన కిరీటములు, భుజములకు రెక్కలు తగిలింపబడియున్నవి. నృత్యముచేయు సమయములో వారు రెక్కలను బహు చక్కగా ఆడించెడివారు.

కిన్నెరలు తమ నృత్యకళను దేవతల కెదురుగా ప్రదర్శించుట వీరియొక్క నృత్యములోని ముఖ్యోద్దేశము.

నృత్యము జరుగుతూ యున్నది. గమ్మేళన విలంబితములో నుండి మధ్య, మధ్యలోనుండి ద్రుతలయలోనికి మారినది. నర్తకులు ఎండాకాలపు మధ్యాహ్నపు ఒంటవేడికి తాళలేక తమరెక్కల విదల్చుకొనుచు ఆకాశములో సంచారముచేయు పక్షులలాగున తమ రెక్కలను ఆడించుచు నృత్యము చేయుచున్నారు.

నృత్యము ఆఖరుదశలోనికి వచ్చినది. వారు పిల్లగాలులకు తట్టుకోలేక ఒరుగు లేతపైరులాగున ప్రక్కకు ఒరిగారు.

గమ్మేళన ఆఖరు ముక్తాయింపులను పలుకుచున్నది. వారు శిరముపై చేతులనెత్తి జోడించి ప్రణామము చేసి శిథిలాలయము లోనికి అదృశ్యమైరి.

ఈ నాటికీ కంబోడియాలో ఈ కిన్నెర నృత్యమునకు మన దేశములో భరతనాట్యమునకున్న ప్రాముఖ్యత యున్నది.



# వాయాంగ్ తోలుబొమ్మల భాగవతము

'Art for art's sake' —— కళకొరకే కళ - అని చాలమంది మాట్లాడుట మనము వినుచున్నాము. మన దేశములో కళకోసమే కళ అన్న సిద్ధాంతము ఏనాడుగూడ లేదు. ఇదిగాక 'కళకోసమే కళ' అని ప్రపంచములో యింతవరకు ఏ వ్యక్తిగూడ కళను ఉపాసించ లేదని నా దృఢనమ్మకము. ఇతరులను రంజింపజేయుటకు ఒక వ్యక్తి కళను అభ్యసించకపోయిన తానుగీచిన చిత్రమో, పాడిన పాటయో, చేసిన నృత్యమో ఇతరులు చూచునపుడు దానినిగూర్చి తలచు కొనినపుడు అతని కొకవిధమైన ఆనందము కలుగును. అంటే యితరులకొరకు కాకపోయినను, తన ఆనందముకొరకైనను అతడు కళను అభ్యసించుచున్నాడన్నమాట. అటువంటప్పుడు కళకొరకే కళ అన్నమాటకు అర్థములేదు. ఆదినుండి మనదేశములో లలితకళలు సంఘాభివృద్ధికి, సంఘోద్ధరణకు సహాకరించినవి.

మతము హిందూసంఘమునకు వెన్నెముక. మన నిత్యజీవితము మతసిద్ధాంతముల ననుసరించి నడుపబడుచున్నది. మన నృత్యకళ గూడ మన దైవప్రార్థనలో ఒక భాగమై యుండెడిది.

వేదయుగమున ప్రతి స్త్రీ, పురుషుడు సంగీతము (గీత వాద్య నృత్యము) ను విధిగా నభ్యసించెడివారు. ప్రతిదినము హోమానంత రము ప్రకృతిని అనగా పంచభూతములను స్తోత్రముచేస్తూ నృత్యము చేసేవారు.

ఆదియందు మనసంఘములో అనేక తెగ లుండెడివి. ప్రతి తెగయును ఒక్కొక్క జంతువును వారి శాఖదేవత (ఇప్పటి మన యిలవేల్పు) గా యెంచి పూజించెడివారు. కొందరు పక్షులను, మరికొందరు మృగములను పూజించెడివారు. పండుగలలో, పర్వ దినములలో ఆ శాఖాదేవతను పూజించి, పిమ్మట దేవతగా యెంచుకోబడిన మృగమునో, పక్షినో చంపి ఆ శాఖవారందరు చేరి పంక్తిభోజనము చేసి ఉత్సాహముతో, నృత్యగీతములతో

కాలముగడిపేవారు. ఇదే పంక్తిభోజన మనబడేది (Community feast). ఈ విందుకు ఆశాఖకుచెందినవారందరు తప్పక రావల యును. అట్లు పంక్తిభోజనముచేసిన ప్రతివ్యక్తి ఆ శాఖలోనుండుట కర్తవ్యము. ఆ శాఖదేవతను (ఉదా:-పులిని) చంపి భుజించినచో దానియొక్క గుణము లన్నియు వారికి వచ్చునని వారి దృఢనమ్మ కము. ఇప్పటికీ అరణ్యములో నివసించే గోండులు, సంతాలులు, బైగాలు మొదలైనవారిలో ఈ సిద్ధాంతము ఆచరణలో నున్నది.

జబ్బల్‌పూర్ దగ్గర అరణ్యములో నివసించే గోండులు ముసలివారైన తమ పెద్దలను చంపి భక్షించుట వాడుక. అటుల చేసినయెడల ఆ ముసలివాని ఆత్మ వారిలో ఐక్యమగునని, వారి నమ్మికకూడ ఇట్టిదే.

ఇక పెండ్లి విషయము—ఒక శాఖకుచెందినవారు ఆ శాఖ తోనే వివాహముచేసుకొనరు. ఇతరశాఖవారితో చేసుకొనవలెను. పెండ్లిఅయ్యేవరకు పెండ్లికూతురు తన తల్లిదండ్రుల శాఖాదేవతనే పూజించును. పెండ్లిరోజున వధూవరులిరువురు పెండ్లికుమారుని శాఖాదేవతను పూజించి తరువాత ఆ (దేవత) జంతువును చంపి వేసెదరు. పెండ్లికుమారుడు దానిరక్తముతో భార్యముఖముపై బొట్టుపెట్టును. అనగా ఆ రోజునుండి ఆమె తనభర్తయొక్క శాఖలో చేరినదన్నమాట. ఈ పూర్వసాంప్రదాయము ననుసరించే మన హిందూస్త్రీలు రక్తవర్ణపుబొట్టు నొసటిపై యిప్పటికి పెట్టుదురు.

ఇట్టిదే ఈ నాటికీ నేపాలుహిందువులలో ఒక సాంప్రదాయ మున్నది.

ఒక ఆబోతును భగవంతునిపేరిట అరణ్యములలో వదలి వేయుదురు. సంవత్సరముపొడుగునా మేసి, అది బాగా బలుస్తుంది. దసరారోజున దానిని పట్టుకొనివచ్చెదరు. ఊరిలోని ప్రజలెల్లరూ బల్లెములను పట్టుకొని దానిచుట్టూ నిలబడి దానిని బల్లెములతో పొడిచెదరు. అది తప్పించుకొని పారిపోవ ప్రయత్నించునపుడు దాని క్రిందపడి కొందరు చనిపోయినను, వారికి స్వర్గసౌఖ్యము లభించునని

వారి నమ్మకము. ఆ బల్లెములు దానిశరీరములో గ్రుచ్చుకొని రక్తము కారుచుండగా, ఆరక్తములో వారివ్రేళ్ళను ముంచి నాలుకల కద్దుకొందురు. ఆబోతుప్రాణము పోయినతరువాత దానిని మేళతాళములతో పాడుతూ ఆడుతూ ఊరేగించి తీసుకొనివెళ్ళి పాతిపెట్టెదరు. ఇదికూడ ఒక విధమైన ఇలవేల్పుపూజాగా భావించవచ్చును. (ఈ విషయము నేను నాగపూరులో గూర్ఖాసైనికులవలన తెలిసికొంటిని.)

బుద్ధయుగ ప్రారంభమునుండి మనము విరివిగా దేవాలయములను కట్టుట ప్రారంభించినతరువాత లలితకళలలో చిత్రకళ, శిల్పకళ ఎక్కువగా ఉపయోగింపబడినది. నృత్యగీత వాద్యములుగూడ మన పూజలో ఒక భాగము అయి దేవదాసీలచే ఆరాధింపబడినవి.

రాజులకోటలలో నృత్యమందిరము లుండెడివి. నటుడనువాడు (హాస్యగాడు) నాట్యసమయములలో ఆ రంగస్థలము నాధారము చేసుకొని దేశకాలపరిస్థితులను, సాంఘికధర్మములను విమర్శించి చర్చించెడివాడు.

ఇక భాగవతపార్టీలవారు ప్రతిగ్రామమునకు పోయి మన శాస్త్ర పురాణములను పామరుల కర్థమయేలాగున ప్రదర్శనములనిచ్చి బోధపరిచేవారు.

ఇటుల లలితకళలు సంఘమునకు అమూల్యసేవ చేయుచుండెడివి.

కాని ప్రస్తుతము మన దేశములో మతసాంప్రదాయాలలోను, సంస్కృతిలోను ప్రవేశించి మనలను ఈ హీనస్థితికి గొనితెచ్చిన దోషములే లలితకళలయందును ప్రాకాయి. కొందరు స్వార్థపరులు ధనమునకాశపడి కళను ప్రజావిజ్ఞానమునకు, సంఘోద్ధరణకు ఉపయోగపరచక ధనార్జనకు సరిపడు మార్గములలో కళ నుపయోగించుట మిక్కిలి శోచనీయము.

దేశక్షేమాభిలాషియగు ప్రతివ్యక్తియును ఈ దురంతములను ఖండించి మన కళలను పూర్వులవలె సంఘసంస్కరణకు, దేశక్షేమానికి ఉపయోగించిననాడే కళనుద్ధరించినవా రయ్యెదరు,

## వాయాంగ్ లేక తోలుబొమ్మల భాగవతము

సినిమాకు వెళ్ళే ప్రతివారును డిస్నేగారి వ్యంగ్యచిత్రాలు (Disney's Cartoons) చూచి యుందురు. కాని ఎందరకు మన పురాతనతోలుబొమ్మల భాగవతము, బొమ్మలాటలను గూర్చి తెలియును? నవీనయంత్రములసాయమున తయారుచేసిన కార్టూను చిత్రములముందు మన పురాతనతోలుబొమ్మల భాగవతము మనకు మోటుగా కనిపిస్తుంది. అది అనాగరికవినోదమని మనఅభిప్రాయము. ఆ కళకు ప్రోత్సాహములేక ఆ కళారాధకులు పేదరికముతో తమ జీవితాన్ని గడుపుతూ కళను చక్కగా నభ్యసించలేకపోతున్నారు. అందువలన దేశములో పురాతనకళ లొక్కటొక్కటి అంతర్ధాన మొందుతున్నాయి. కాని తూర్పుదీవులలో పాశ్చాత్యనాగరికతను ప్రజలు రుచిచూచిననూ తమ పురాతన కళలనుమాత్రము పోషించు చున్నారు. కనుక తోలుబొమ్మలభాగవతము, ఛాయానృత్యము (Shadow Play) ఆదేశమున యింకను ఉన్నతస్థితిలో నున్నవి.

బొమ్మలు మనదేశములోను, తూర్పుదేశములలోను ఒకే విధముగ చేయబడుచున్నవి. తోలుబొమ్మలభాగవత మనగా తోలుతో చేయబడిన బొమ్మలయొక్క నృత్యము. ఈ పార్టీలవారు సాధారణముగా రామాయణము, మహాభారతములను ప్రదర్శింతురు.

శుభ్రముచేయబడిన జంతువులచర్మములతో కావలసిన మనుష్య దేవతలు, రాజులు, జంతువులు వీని ఆకారములను కత్తిరించి ప్రతియొక్క పాత్రకు సరిపడునట్లు అలంకారములను, రంగులను చిత్రింతురు. ప్రతిబొమ్మయొక్క అవయవములు - వేరువేరుగా చెయ్యికి చెయ్యి, కాలుకు కాలు, విడి విడిగా కత్తిరించబడి యుండును. అవి వారు భాగవతమాడించు సమయమునకు వీలుపడి నట్లు ముళ్లతో కుట్టెదరు. ఆ బొమ్మకు వీపుతట్టున వెన్నెముకవలె ఒక కర్ర కట్టబడియుండును. బొమ్మలాటవాడు ఆ కర్రను పట్టుకొని బొమ్మలను తెరమీద ఆడించును. కాళ్లు, చేతులు, తలలభాగములకు ఇనుపపుల్లలు కట్టబడియుండును. ఆ పుల్లలు వాని చేతిలో ఉండును. వాడు సమయమునకు తగినట్లు ఆ పుల్లలను లాగిన ఆ బొమ్మ కాళ్లు

చేతులు, తల కదలును. వాడు పాత్రయొక్క పాటలను తెర వెనుక నుండి పాడును.

## రంగస్థలము

ఒక చిన్న పందిరి మూడువైపుల మూసివేసి యుండును. ప్రదర్శనము చూపు ప్రక్కమాత్రము తెల్లని, సన్నని తెర యుండును. ఆ తెరలోపల పైభాగమున ఆముదపు దీపములు వ్రేలాడగట్టి యుండును. బొమ్మలచే నృత్యమాడించువారు కాళ్లకు గజ్జెలుకట్టుకొని రెండు చెక్కలమీద నిలబడి, ఆ చెక్కలను తట్టుతూ బొమ్మలచే భాగవత మాడింతురు. సాధారణముగా స్త్రీపాత్రలకు స్త్రీలు, పురుష పాత్రలకు పురుషులు పాడుదురు. తూర్పుదీవులలో గమ్మేళన వాయిద్యము గూడ ఉపయోగిస్తారు. ఇదే తోలుబొమ్మలభాగవతము.

మన దేశములో పోషించే దాతలేక అంతర్ధానమొందుచున్న ఈ కళ తూర్పుదీవులలో సజీవముగా ఉన్నందుకు ఆ దేశప్రజలకు మనము ఎంతో కృతజ్ఞులము.

## బొమ్మలాటము

చిన్న చిన్న కర్రబొమ్మలను ఆడిస్తూచేసే ప్రదర్శనాలు 'బొమ్మలాటము' అనబడును. మన పిల్లలాడుకొనే కొయ్యబొమ్మల వంటివానిని ఆయా ప్రదర్శనములకు సరిపోవునట్లలంకరించి వెనుక వైపున ఒకడు పాడుతూ ఆడించును. ఈ ప్రదర్శనము యిప్పటికీ తమిళ దేశములలో మైసూరు మొదలగు ప్రదేశములలో చూడవచ్చును.

## ఛాయానృత్యము (Shadow Play)

రామాయణము, మహాభారతము మొదలైన పురాణగాథలను తెల్లని తెర వెనుక నిలబడి నటులు నృత్యముచేయుదురు. ఆ నాట్య కథ వెనుకనుండి పాడబడును. రసభావ ప్రదర్శనము గమ్మేళన చేయును.

ఉదాహరణము:—

రాముడు అరణ్యములో సంచారముచేస్తున్న ఘట్టము ప్రదర్శిస్తున్నా రనుకొందము.

మొదట పాటగాండ్రా ఘట్టమును పాడుదురు. తరువాత గమ్మేళనలో కోయిల కూతలు, పక్షుల పలుకులు, సింహగర్జనలు మొదలగునవి పలికింపబడును.

తరువాత రాముని పాత్రధరించిన నటుడు తెర వెనుక సంచారముచేయును. అతని ఛాయ మనకు కనబడును. ఇది ఛాయా నృత్యము.

ఈ మాదిరినృత్యము మన ఉదయశంకరుడుగూడ ఈ మధ్య చేసినాడు.

తూర్పుదీవులలోని నృత్యకళకు మాతృక మన భారత శాస్త్రమే యైననూ, వారు మనకళ క్షీణించకుండా దాని నింకా అభివృద్ధిలోనికి తెచ్చి చెక్కు చెదరకుండా వందలకొలది సంవత్స రాలు మన కళను కాపాడినందుకు ప్రతియొక్క భారతీయుడు కృతజ్ఞుడు.

# 'సిరియంపి' జావాద్వీపపు దర్బారు నృత్యము

''సిరియంపి – సిరియంపి – సిరియంపి''

సుల్తానుగారి కోటలోని ప్రజలు త్వరత్వరగా మస్తులు ధరించి తయారవుతున్నారు.

'సిరియంపి' – ఈవేళ సిరియంపి నృత్యము.

ధనికవర్గపు బాల బాలికలు బంగారుజల్తారునగిషీ బట్టలు ధరించి కోటలోనికి వెళ్ళుచున్నారు.

'సిరియంపి' – సుల్తానుగారి దర్బారులో సిరియంపినృత్యము.

కోటలోనికి పోయి నృత్యము కళ్ళార చూడ నోచుకోనని సామాన్యప్రజలు, గమ్మేళనసంగీతమైనా విని ఆనందించుటకు కోట వెలుపల గుంపులు గుంపులుగాచేరి గుస గుస లాడుకుంటున్నారు.

''సిరియంపి' – సిరియంపి – సిరియంపి'' అ హా హా.

దర్బారుహాలుకు ప్రక్కనున్న గదిలో నృత్యముచేయు బాలికలను ముస్తాబుచేస్తున్ననటుడు తనలో తాను ముసి ముసినవ్వులు నవ్వుకుంటూ కొవ్వొత్తికాగడాల వెల్గులో ఆ బాలికల కనుబొమ్మలు దిద్దుచుండెను.

సుమారు ఎనిమిది గంటలైంది. రాత్రి తన చీకటితెరలో ప్రపంచాన్నంతా కప్పివేసింది. నీలిఆకాశముమీద మినుకు మినుకుమని సానపెట్టిన పుష్యరాగాల్లాగా చుక్కలు మెరుస్తున్నాయి. సుల్తానుగారి కోట అంతా కొవ్వొత్తిదీపాలతో అలంకరించబడింది.

దర్బారుహాలుకు ఒకప్రక్క ఎత్తైన కుర్చీలో సుల్తానుగారు కూర్చున్నారు. వారి కిరుప్రక్కల నృత్యము చూచుటకు ఆహ్వానింపబడినవారు, ధనికవర్గ ప్రజలు, దర్బారు నౌకరులు, వారివారి హోదాలకు తగినఆసనములలో పంక్తులుతీర్చి కూర్చున్నారు.

మరియొకప్రక్క గమ్మేళన వాయిద్యగాండ్రు సుమారు ముప్పదిమంది కూర్చున్నారు. అనేకవిధముల గంటలు, డప్పులు, ఫ్లూటులు వెదురు కర్రలతో జేయబడిన కాష్ఠ తరంగములు, వారి యొక్క వాయిద్యములు.

గడియారము తొమ్మిది కొట్టింది :

సుల్తానుగారు తన ప్రక్కనున్న గంటను వాయించారు.

'ధంగ్ ధంగ్ ... ధంగ్ ధంగ్ ... ... ధంగ్ ధంగ్'

గమ్మేళనముతో గీతాలాపము అతినెమ్మదిగా వినీవినబడ నట్లు మొదలైంది.

పదిమంది బాలికలు తమ ముఖములకు సుందరమైన చిన్న చిన్న విసనకర్రలను అడ్డముపెట్టుకొని అతిరమణీయముగా అడుగు వేస్తూ ప్రవేశించి హాలుమధ్య కూర్చున్నారు. జల్తారు నగిషీపని చేయబడిన మెత్తని సిల్కులుంగీలు వక్షస్థలము కనబడకుండా కట్టినారు. వారు నృత్యముచేసేటప్పుడు పట్టుకొని ఆడుటకుగాను సన్నని, ఆకుపచ్చని గుడ్డలు నడుముకు కట్టబడియున్నవి. తలపైన నాజూకైన కిరీటములనుధరించారు. ముడివేయక వదలిన తలవెండ్రుకలు వారు కదలునపుడు సముద్రములోని తరంగములవలె గాలిలో ఎగురు చున్నవి. చేతులకు, దండలకు బంగారుఆభరణములు, మెడలో ఒక మణులమాల ఉన్నవి. నృత్యము చేయునపుడు తాళలయను తెలియపరచుటకుగాను మృదుమధుర ధ్వనులజేయు అందెలను కాళ్లకు ధరించారు. వారు వచ్చి కూర్చొనినవెంటనే గమ్మేళన సంగీత మాగిపోయింది.

హాలులో నిశ్శబ్దము. తరువాత ఏమిటి? తరువాత ఏమిటి? – అన్నట్లు మా గుండెలు టకా టకా కొట్టుకొంటున్నాయి. అందరము ఆతృతతో చూస్తున్నాము.

అకస్మాత్తుగా కొంతమూరములో నుంచబడిన పెద్దనగారా 'తద్దంగ్ - తద్దంగ్' అని యుద్ధభూమిలో మనపూర్వులు వాయించే రణభేరిలాగున మ్రోగింది. ...... 'ఘం ఘం ఘాం' అను ఒక కొమ్ము వాయిద్యపు పిలుపు ఆ భేరీనాదములో లీనమైపోయింది.

'ధంగ్, తడధంగ్ ...... ధంగ్ తరధంగ్ ధంగ్ తడ ధంగ్ - ధంగ్ తరధంగ్.'

మధ్యాలయలో యేకతాళములో గమ్మేళనలో సంగీతము ప్రారంభమైంది.

బాలికలు తమ ముఖములకు అడ్డుగానున్న వీవనకఱ్ఱలను మెల్లగా తొలగించి, క్రింద పడవైచి, కుడిచేత పతాకహస్తములను బట్టి ఆ చేయి తమశిరములపైకెత్తి ఆకాశమును చూపినట్లు అభినయించారు. (ఇది దేవతలకు నమస్కరించుట)

తరువాత ఎడమచేయి నడుముపైనుంచి, కుడిచేత పతాక హస్తమును ప్రేక్షకులకు చూపారు. (పతాకహస్తము ప్రేక్షకులకు నృత్యము మొదలుకానున్నదని అర్థము.)

గమ్మేళన గట్టిగా మ్రోగ మొదలిడింది. వారు అవయవ ములను కొంచెమైనా కదల్చక పోతపోసిన విగ్రహములాగున లేచి నిలబడి గమ్మేళన తాళ లయలననుసరించి తమ అవయవములను (కాళ్ళు, చేతులను మాత్రమే) కదలించుట మొదలుపెట్టిరి.

(కండ్లు, వక్షము మణిపూరినృత్యకళారాధకులవలె వీరును కదలించరు. మణిపూరినృత్యము దైవసంబంధమైనది గనుక కండ్లు, ఛాతీయొక్క సహాయముతో రసభావప్రకటనచేయుట నిషేధించిరి. ఇతర అవయవములయొక్క కదలికతోనే సంగీతము నాధారముగా గొని వారు భావప్రకటన చేయవలయును. ఈ సిద్ధాంతమే బాలీ, జావా మొదలైన ప్రదేశములలోగూడ అమలులోనున్నది.)

ఆ బాలికలు తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణలకు తిరిగి నృత్యముచేయునపుడు రెండుచేతులతో నడుముకు కట్టబడిన పచ్చని గుడ్డను పట్టుకొని గాలిలో ఎగురునట్లు ఆడించుచూ నృత్యముచేసిరి.

(ఇది అష్టదిక్పాలకుల ఆరాధన. మన పూర్వసాంప్రదాయములలో నొకటి.)

వీ రింతవరకు చేసినది దైవప్రార్థనానృత్యము. వీరు హాలు మధ్యకు వచ్చి సమభంగిమలలో వరుసగా నిలబడిరి. ఆ నృత్యము ముగిసింది. గమ్మేళన ఆగింది. వారు రాతివిగ్రహముల తీరున ఆ విధముగనే నిలువబడిరి.

'సిరియంపి'

పదికంఠములు వీరత్వము వెలువడులాగున పలికినవి. ధన్ ధన్ మని నగారా మ్రోగినది. దానితో బాకా పూరింపబడినది. గమ్మేళన వడిగా మ్రోగడం మొదలుపెట్టింది. ఆ బాలికలు ఐదైదుగురు చొప్పున రెండుభాగములుగా చీలిపోయి ఒకరికెదురుగా ఒకరు దూరముగాపోయి నిలబడ్డారు.

## సిరియంపి యుద్ధనృత్యము

ఇందులో రెండు సేనలు యుద్ధభూమికివచ్చుట–వారు ఢీకొనుట–యుద్ధము – కొందరువీరులు యుద్ధములో మడియుట – జయముపొందిన వారు విజయపతాకము నెగురవైచి ఆనందముతో నృత్యముచేయుట–ఇది కథావస్తువు.

ఇరుపక్షములవారు నృత్యముచేయుచు దగ్గరగా వచ్చిరి. ప్రళయకాల ఝంఝామారుతమువంటి శబ్దములు గమ్మేళనలో పలికినవి. ఇరుపక్షములు ఏకమైనవి. ఆ రణభూమిలో వీరులు యుద్ధము చేస్తున్నారు. శత్రువులనుండి హాని కలుగకుండుటకుగాను డాలు అడ్డుపెట్టుకొని పోరు సల్పుచున్నారు. ఓడి పారిపోవుచున్న పక్షము వారిని గెలుపొందినవారు తరుముచున్నారు. శత్రుఖడ్గములబారిని

హతులైనవారిని ఎత్తుకొనిపోయి తమ గుడారములయొద్దకు చేర్చు చున్నారు. చివరకు అందరు భూమికి ఒరిగినారు.

గమ్మేళన కరుణరసము గానముచేస్తూంది. ఒక వ్యక్తి ఆ యుద్ధభూమిలో అతి విచారకరముగా సంచారము చేస్తూంది. ఇది యుద్ధమువలన కలుగునష్టము, హానిని తెలుపుటకు కాబోలు!

గమ్మేళన మరల మంగళధ్వనులు చేస్తుంది. అందరు లేచి ఆనందముతో నృత్యముచేయ నారంభించారు. వారు పతాక హస్తములను ప్రేక్షకులకు చూపుతూ వరుసగా నిలబడ్డారు. నృత్యము ముగిసింది. ఇది స్వచ్ఛమైన లాస్యనృత్యముయొక్క నమూనా.

వారుచేసింది యుద్ధనృత్యమైనా వారు స్త్రీ స్వభావాన్ని పూర్తిగా మరువక ఆ వీరరసములోకూడ లాస్యనృత్యము చక్కగా ప్రదర్శించారు. యుద్ధభూమికి వెళ్ళినను స్త్రీ స్త్రీయే! ఆమెకుగల సహజస్వభావములను మరచిపోలేదని వారి దృక్పథమ్మకముగా వారు యుద్ధభూమికి కదలివచ్చినప్పటి నటనము స్పష్టపరుస్తుంది. రణ రంగములో గాయపడ్డవీరులు—పడినప్పటి నటనము — చక్కగా వికసించిన గులాబిపువ్వురెక్కలు, సంధ్యావేళవీచే మలయమారుతా నికి ఒక్కొక్కటి పూవు కాడనువదలి క్రిందికి పడినట్లనిపించింది. కాని 'కథకళీ'లో లాగున స్త్రీ పురుషులకు ఒకే విధమైన భావ ప్రకటన అవయవములకదలిక ఎక్కడను వారినృత్యములో కను పించలేదు. స్త్రీయొక్క సహజస్వభావమును ప్రదర్శించుటే వారి ముఖ్యోద్దేశము. ఆ నృత్యకళారాధకులు ఎంతవరకు ప్రకృతి నర్థము చేసికొనిరో దీనినిబట్టి మనము గ్రహించవచ్చును.

నేను మద్రాసులో భరతనాట్యము - (ఇది లాస్యనృత్యము, కేవలము స్త్రీలయొక్క నృత్యము) బెంగాల్‌లో మణిపూరి నృత్యము- (ఇదికూడ లాస్యనృత్యము) ఎన్నో నృత్యప్రదర్శనలు చూచాను గాని ఆ కళారాధకులఅభినయము భావప్రదర్శనములలోను, నృత్య, నృత్త ములలోనూ, స్త్రీ కుండవలసిన సహజలక్షణములు, సుకుమారత (grace), నెమ్మది, చక్కగా స్వాభావికముగా ప్రదర్శించ లేక

పోయేవారు. కొన్నికొన్నిఘట్టములలో వారు చేయునది లాస్యమే అయినా, తాండవములోనికి (పురుషనృత్యము.) దిగేవారు స్వచ్ఛమైన లాస్యనృత్యమును నేను చూచుట జావాలోనే మొదటిసారి.

మనదేశములో నృత్యశాస్త్ర ప్రవీణులు శాస్త్రమును, లాస్యమును చక్కగా పఠించిననూ వారు ప్రకృతిని, దాని రహస్యములను గ్రహించుట మాని కేవలము సాంకేతిక విషయములకే (Technical Things) ప్రాముఖ్యత నిచ్చుటవలన ఈ దోషం మనలోనికి ప్రాకింది. ఒక కళారాధకుడు స్త్రీలయొక్క లేక పురుషులయొక్క వివిధఘట్టములయొక్క అభినయము నే విధముగ చేయవలెనో దానిని శాస్త్రములలో చదువుటతోనే తృప్తినొందక సజీవులై యున్నవారి సహజస్వభావములనుకూడ బహుజాగ్రత్తగా గమనించుట అత్యవసరము. ఈ గమనిక లేకపోవుటవలననే దక్షిణాది భరతనాట్యము స్త్రీలు చేసినను వారు లాస్యమును ఒక్కొక్కప్పుడు పోషించలేకున్నారు.

శాస్త్రములు మనకు ఒక భావమును హస్త నేత్ర అవయవములయొక్క సహాయముతో ఎలాగు ప్రదర్శించవచ్చునో తెల్పును గాని, ఆ భావము స్వాభావికముగా, సహజముగా ప్రదర్శించితిమా లేదా అని తెలిసికొనుటకు మనము సజీవముతో నున్న ప్రకృతిమీాద ఆధారపడి దానిలో లీనము కావలసియున్నది.

ఎక్కడైతే శాస్త్రము ఆఖరవుతుందో అక్కడే కళ మొదలిడుతుంది (The technic stops where art begins) అన్న టాల్‌స్టాయ్ మాటలయొక్క విలువ ఈ కాలపు మన నృత్యకళారాధకులు గ్రహించాలి.

---

# 'సాంగ్ యాంగ్'

# బలిద్వీపపు దాసిఆట్టము

# (దేవదాసీనృత్యము)

# సాంగ్‌యాంగ్ బలీద్వీపపు దాసీ ఆట్టము

## (దేవదాసీ నృత్యము)

'ఢింగ్ ఢాంగ్ ...... ఢింగ్ ఢాంగ్ ...... ఢింగ్ ఢాంగ్'

గమ్మేళన (బాలినీస్‌వారి ఆర్కెస్ట్రా) గంటలు మోగుతున్నాయి.

ఉదయం సుమారు ఆరు గంటలవుతుంది. సముద్రగర్భములో నుండి పైకివస్తున్న ప్రభాతభానుని లేతకిరణాలకు విష్ణుదేవాలయ బంగారుగోపురం తళతళ మెరుస్తూంది.

'ధంగ్‌త - థంగ్‌త - ధంగ్ - థంగ్‌త - ధంగ్‌త - ధంగ్'

గుడిలోని నగారామోగడం మొదలుపెట్టింది.

'జయ మాధవా, జయ మాధవా, జయ మధుసూదనా, జయ మహావిష్ణు'. ఆ ప్రశాంత ప్రదేశమంతా జయ జయ నాదములతో ప్రతిధ్వనించింది.

స్నానముచేసి ముడివేయక వదలిన శిరోజములమీద పచ్చని పూవుల ధరించిన బాలీదేశపు వనితలు దేవళమునకు గబ గబ నడుస్తున్నారు.

'జయ మధుసూదనా, జయ మధుసూదనా'

వక్షస్థలమువరకు సీతాకోకచిలుకరంగుల పువ్వుల సరోంగుల ధరించి ఒక చేతిలో పళ్లెములో కొన్నిపండ్లు పట్టుకొని కొందరు భక్తురాండ్రు విష్ణుదేవళము చేరుతున్నారు.

'జయ మహావిష్ణు, జయ మహావిష్ణు'

రాత్రంతా ప్రియ వియోగము ననుభవించి, ప్రభాత సమయానికి సరోవరగర్భాన్నుండి పైకివచ్చి తమ నవ్వుముఖాలతో అరుణునాహ్వానించు తామరపువ్వులను చేతబట్టి బాలిద్వీపపు బాలికలు, ముడివేయక వదలిన తమ శిరోజములు వాయుదేవునితో మేలమాడుచుండగా దేవళమువైపునకు పరుగెత్తుతున్నారు.

'జయ మాధవా, జయ మధుసూదనా !

స్త్రీలు, పురుషులు, వృద్ధులు యువకులు అందరు ఆలయ ప్రాంగణంలో చేరేరు.

'ధంగ్‌త – ధంగ్‌త – ధంగ్ – ధంగ్ – ధంగ్ – ధంగ్ – ధంగ్'

గమ్మేళన వడిగా వాయిస్తున్నారు. నగారా జోరుగా మ్రోగుతోంది. 'భాం' అని శంఖనాదము వినబడుతోంది. గణ గణ మని దేవాలయపు గంటలు మ్రోగుచున్నవి.

పూజారి విష్ణువిగ్రహముముందున్న తెరను తీసేడు.

'జయ మహావిష్ణు, జయ మహావిష్ణు, జయ మహావిష్ణు.'

భక్తులు మిన్నునంటునట్లు కంఠము లెత్తి విష్ణుస్తోత్రము చేస్తున్నారు.

ఈ నవనాగరికత పాశ్చాత్యసిద్ధాంతములకు బలికాని ఆ భక్తుల కండ్లు ఆనందాశ్రువులతో నిండాయి. ఉల్లాసముతో చేతులుచరుస్తూ విష్ణుగీతములను పాడుచున్నారు.

'తద్ధంగ్ ...'

అందరూ కన్నులుమూసుకొని ఒక్కనిమిషము నిశ్శబ్దముగా నిలువబడ్డారు.

గమ్మేళన విలంబితలయలో మధురధ్వనుల వెలిగ్రక్కుతూంది. డెబ్బదిసంవత్సరముల ఒక ముదుసలి దేవతాస్వరూపులగు యిద్దరు బాలికలతో ప్రవేశించింది. బంగారుఛాయగలవారి శరీరములకు పసుపు రాయుటచే పచ్చగా మెఱుస్తున్నది. పసుపుపచ్చని లుంగీ జల్తారునగిషీ పనిచేయబడిన పసుపుపచ్చని జాకెట్టు ధరించారు. చేతులకు, మెడలోను పూలమాల లున్నాయి. నొసట రక్తవర్ణపు తిలకము దిద్దారు.

విష్ణుమూర్తిని చూస్తూ ఆ మూర్తి కెదురుగా నిలబడ్డారా బాలికలిద్దరు. వారి ముందున్న ముత్తెపుచిప్పలోని అగ్నిలో వేయసిన సాంబ్రాణిపొగ వారి శరీరములమీదికి ప్రాకుతూంది.

'ఢంగ్‌త ఢంగ్‌త ఢంగ్ - ఢంగ్‌త ఢంగ్‌త ఢంగ్ !'

గమ్మేళన గట్టిగా మ్రోగుట మొదలుపెట్టింది. ఇద్దరు బాలికలు పతాకహస్తములనుబట్టి నిలబడ్డారు.

'జయదేవ - జయదేవ - జయమాధవా !'

అక్కడచేరిన స్త్రీకంఠములు గమ్మేళనలోచేరి పాడుతున్నాయి.

ఆ బాలికలు నృత్యంచేయడం మొదలుపెట్టారు. ఇది దక్షిణాది భరతనాట్యములోని 'అలరింపు'ను పోలుతుంది. అనగా దైవ ప్రార్థనా నృత్యము.

గమ్మేళన వడిగా మ్రోగుతుంది. భక్తుల కంఠములతో దేవాలయమంతా మారుమ్రోగుతున్నది. బాలికల నృత్యముగూడ చురుకుగా జరుగుతూంది. మంచిముత్యములబోలు చెమటబిందువులు వారి శరీరములనుండి రాలుతున్నాయి. ఆ బాలికలు నృత్యము చేసి చేసి స్మారకము తప్పిపోవుస్థితికి వచ్చారు. ఇద్దరు స్త్రీలు వెళ్ళి వారిని పట్టుకున్నారు. వారి శరీరముపై ధారగా పారుతున్న స్వేదమంతా గుడ్డతో అద్దారు. పూజారి గర్భగుడినుండి తళతళ మెరయుచున్న అతిసుందరమైన రెండు కిరీటములను తెచ్చి ఆ బాలిక శిరముల నలంకరించాడు. (నృత్యముచేయు బాలికలకు భగవదావేశము గలిగినదని తెలిసినప్పుడే పూజారి ఆ కిరీటములను వారి శిరములపై నుంచును ఇతరులా కిరీటముల ధరించుట కర్హులుగారని వారి దృఢవిశ్వాసము.)

విష్ణుపాదములవద్దనున్న పుష్పములు, తులసీ తెచ్చి వారి చేతులలోనుంచును. వారలాగే ఒక నిముసము నిలబడి రెండుచేతులను శిరముపై కెత్తి జోడించి నమస్కారము చేయుదురు.

మరల గమ్మేళనము మొదలవుతూంది. స్త్రీలు పురుషులు, బాలురు, బాలికలు, వృద్ధులు అందరూచేరి స్తోత్రగీతములను పాడుదురు. బాలికలు తమనృత్యమును మొదలుపెట్టారు.

ఇది అసలు దేవతానృత్యము.

తమ శరీరములయొక్క ప్రతి అవయవములను గమ్మేళనా సంగీతము ననుసరించి కదలించినపుడు హంసనడకతో భగవంతుని చేరునపుడు, భారతదేశ ప్రాచీన కళ – మనము మరచిన మన నృత్య కళ – బలిద్వీపము మరల మనకు నేర్పుటకు చెక్కుచెదరకుండా తన గర్భములో దాచియుంచినదా అనిపించును. వారు నృత్యరేఖలు, చారులు, కరణులు చేసినపుడు భరతకళామతల్లి వారిలో ప్రత్యక్ష మవుతుంది. ఆ భక్తులందరూగూడి స్తోత్రగీతములు పాడినపుడు హోమముచేసిన తరువాత ఇంద్రవరుణుల స్తోత్రముచేయుచూ వేదములను పఠించిన వేదకాలపు మనపూర్వులు జ్ఞాపమునకు వత్తురు.

ధన్యహో ! బలీదేశ ప్రజలారా !

ధన్యహో ! బలీదేశ దేవదాసీలారా !

నృత్యము ముగిసింది. ఆ బాలికల నిద్దరును రెండు కుర్చీలపై ఆసీనుల చేసిరి.

వ్యాధిగ్రస్తులైన కొందరు ప్రజలు ఆ బాలికల పాదములు ముట్టుకొని కండ్లకద్దుకొని బోవుచున్నారు. కొందరుస్త్రీలు ఆ బాలికల మెడలోని పుష్పమాలలోని ఒక్కొక్క పూవునుతీసి అతిభక్తితో కండ్లకద్దుకొని యిండ్లకు తీసుకొని వెళ్ళుచున్నారు.

ఆ సమయంలో ఆ దేవదాసీబాలికల స్వరూపము చూసిన ప్రతియొక్కడూ స్వర్గమునుండి దిగివచ్చిన దేవతామూర్తుల్లా ఈ బాలికలను భావించుచుండిరి.

వీరే బలిద్వీపపు దేవదాసీలు – భగవానుని సేవకురాండ్రు. వారికి, ఈ ప్రపంచసౌఖ్యాలకు ఏ విధమైన సంబంధము లేదు. వారు సభలలో నృత్యము చేయరు. ప్రాపంచకేచ్ఛ గలిగిన నృత్యములను మాని జీవితమును భగవత్సేవలో గడపుటయే వారి ముఖ్యోద్దేశము – మహాదాశయము. శివునిజడలనుండి ప్రవించు గంగాజలమువలె వారి జీవితములు స్వచ్ఛములు, అతి పవిత్రములు.

ఈ పవిత్రాత్ములకు - మన దేశములోని దాసీలకు యెంత భేద ముంది! దాసీవ్యవస్థ యెంత వికృతముగా మారిపోయింది. మన మత సాంప్రదాయాలను, ధర్మాలను మన హిందూసంఘము మరచి పోయింది.

ఏనాడైతే హిందూమత గురువు మతమేగాక అన్ని శాస్త్రములలోను, కళలలోను - మన జాతి ఔన్నత్యమునకు కారణమైనవాడు దైవచింతమాని, ధనమును ఆర్జించుట మొదలుపెట్టాడో - స్వార్థము కొరకై సంఘాన్ని పెడత్రోవ పట్టించాడో - ఆనాడే ప్రజలలో నీతి ధర్మములు నశించాయి. సంఘాభివృద్ధి, సంఘ శ్రేయస్సు మరచి పోయారు. స్వార్థముకొరకు పాటుపడ మొదలుపెట్టారు. అవినీతి కరమైన హిందూ ప్రజల జీవితమే మన దేశ, జాతి, సంఘ సంస్కృతుల వినాశానికి మూలకారణమైంది. మనలను పరదేశీయులకు బానిసలుగా చేసింది.

ఈనాడు మనము స్వతంత్రులము. ఇంకనైనా దేశనాయకులు మన సంఘసంస్కరణకు పాటుబడి నిర్జీవమైన దేశాన్ని సజీవంగా చేయాలి. ఇది వారి విధ్యుక్తధర్మం.

# ముగింపు

హిందూదేశము తన మతధర్మములతోనూ, లలితకళలతోను ప్రపంచాన్ని జయించి కళాసామ్రాజ్యాలు స్థాపించింది బౌద్ధయుగ ప్రారంభంలో అనేకమంది భారతీయులు, చైనా, టిబెట్టు, సయ్యాం మొదలైన దేశములకు వెళ్ళి మతప్రచారము, కళాప్రచారము చేశారు. మనధర్మబోధనలు అసంఖ్యాకుల హృదయాలను శాశ్వతంగా ఆకర్షించాయి, ఆక్రమించాయి.

అందువల్లే ప్రపంచమునంతా తన బాహుబలంతో జయించి, మహాసామ్రాజ్యమును స్థాపించి, 'అయ్యో ఇక జయించుటకు రాజ్యములు లేవే' అని బొట బొట కన్నీరు కార్చిన మహాబలశాలి అలెగ్జాండరుసామ్రాజ్యము అతనితో అంతరించినది. మహావైభవముల ననుభవించిన మొగలు సామ్రాజ్యము మనకు కానరాదు. 'మాసామ్రాజ్యంలో రవి అస్తమించడు' అనిన బ్రిటిష్‌సామ్రాజ్యమును అస్తమించింది. ఇటుల బాహుబలంతో స్థాపించిన అనేక సామ్రాజ్యములు రూపులేకుండా మానవుని భౌతికదేహముల్లాగనే అంతరించి పోయాయి. కాని భారతీయులు మానసిక ఆత్మబలముతో సామ్రాజ్యాలు నెలకొల్పారు. కనుక ఈనాటికీ భారతసంస్కృతిచిహ్నములు చైనా, జపాన్, టిబెట్టు, సయ్యాం, జావా, బాలీ మొదలైనప్రదేశాలలో కనబడుతున్నాయి. అవి విశ్వకోటి జీవించునంతవరకు శాశ్వతముగా ఉంటాయి. మరల మూడు వేల సంవత్సరములకు ఆ బుద్ధుని అహింసా ధర్మమునే బోధించుటకు మహాత్మాగాంధీజీ అవతరించాడు. మనకు స్వాతంత్ర్యము సంపాదించియిచ్చాడు. కాని పవిత్రమైన ఆర్యధర్మము యొక్క నిజతత్వము నెరుగని కొందరు స్వార్థపరులు ఆతని ప్రాణములనే ఆహుతి కొన్నారు. పూర్వమువలె ఈ నాడుగూడ దేశములోని ప్రతి కళారాధకుడు, కళావేత్త, కళోపాసి ఆ మహనీయుడు బోధించిన ధర్మసూత్రములతో ప్రపంచములోని మానవుల హృదయాలను జయించవలెను. పరస్పర వైరములతో, యుద్ధములతో వినాశ మొందుచున్న ప్రపంచములో సుస్థిరశాంతి జేయాలి. ఇదే భారత భూమిని జన్మించిన ప్రతికళారాధకుని, ప్రతికళాశీలి యొక్క పరమధర్మము.